Regd No. M.1118.

12 పేజీలు-2 అణాలు



ఆంధ్రపత్రిక

Founder: K. NAGESWARA ROW.

SUNDAY EDITION.

Vol. 36. ANDHRA PATRIKA, MADRAS. 11th DECEMBER 1949 No. 248

J17607



# సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షపదవికి దిగంబరరావు బిందూగారి ఏకగ్రీవ ఎన్నిక

ఫ్రెంచి ఇండియా జనవాక్యం:

## "మొత్తం ఓటర్లలో నూటికి 60 మందైనా పాల్గొనాలి"

### ఫ్రెంచి ప్రభుత్వంవారి కొత్తషరతు: భారతప్రభుత్వం నిరాకరించే సూచన

న్యూఢిల్లీ, డిసెంబరు 9: చంద్రనగర్ మినహాయించగా మిగిలిన ఫ్రెంచి ఇండియా భూభాగాలలో మొత్తం ఓటర్లలో నూటికి 60 మంది తక్కువకాకుండా రిఫరెండం సందర్భంలో ఓటుచేయాలని ఫ్రెంచిప్రభుత్వం ఒక షరతు పెట్టింది.

ఫ్రెంచి ఇండియా స్థావరాల విషయంలో రిఫరెండం తీసుకొనే సందర్భంలో ఈ షరతును భారత ప్రభుత్వం పాటించాలని తాను పంపుకున్న మెమొరాండంలో ఫ్రెంచిప్రభుత్వం నివేదించుకున్నట్లు తెలుస్తున్నది.

నూటికి 60 మంది ఓటర్లన్నా రిఫరెండంలో పాల్గొంటేనేగాని, వారికి ఇందులో ఆసక్తి వున్నట్లు నిశ్చయించేందుకు వీలులేదని ఫ్రెంచి ప్రభుత్వం అభిప్రాయపడుతున్నదట.

ఈ విషయాన్ని గూర్చి ఇండియా ప్రభుత్వం ఇంకా ఫ్రెంచి ప్రభుత్వానికి ఎటువంటి సమాచారము పంపి వుండకపోయినా, ఈ సూచనను భారతప్రభుత్వం ఆమోదించే సూచనలు ఎక్కడా అవుపించటంలేదని అభిజ్ఞులు అంటున్నారు.

ప్రపంచంలో ఎక్కడా ఎన్నికలు జరిగినా అందులో 100 కి 30 మందో 40 మందో పాల్గొనడమే గగనంగా వున్నదని అందువల్ల నూటికి 60 మందిన్ని కనీసం ఓటు చెయ్యాలని షరతుపెట్టడం అసహజంగా కనపడుతున్నదని వీరు పేర్కొంటున్నారు.

### వచ్చేమార్చిలో జనవాక్య నిర్ధారణ

మద్రాస్, డిసెంబర్ 9. వచ్చే మార్చిలో ఫ్రెంచి స్థావరాలలో రిఫరెండం తీసుకోవడం సంభవమని జనాబ్ రషీదలీ బేగ్ ఇవ్వాళ వెల్లడి చేశారు.

రషీదలీ బేగ్ పుదుచ్చేరిలో ఇండియన్ కాన్సల్‌గా పనిచేస్తున్నారు.

ఈ రిఫరెండం జరగడానికిముందు విధి విధానాలను గురించి, ఫ్రాన్సుకు ఇండియాకు ఒప్పందం జరగవలసివున్నదని, అది జరగడం అవశ్యమైతేతప్ప, ఈ రిఫరెండంమార్చి నెలలో జరగవచ్చునని ఆయన వెల్లడి చేశారు.

ఓటర్ల పరిశీలకులు, ఓటర్ల జాబితాల పరిష్కారం, మొదలైన విషయాలను గూర్చి ఇండియా ఫ్రాన్సులు సమాలోచనలు చేస్తున్నాయని, ఇందులో ముఖ్యంగా ఓటర్ల జాబితాలను క్షుణ్ణంగా పరిష్కరించవలసినది అతిముఖ్యమైనదని, అది పరిష్కృతమయ్యేవరకు ఎట్లాలేదన్నా రెండు నెలలు పడుతుందనిగూడా ఆయన అన్నారు.

అటువంటి ఒప్పందమేమీ జరక్కపోతే, సమస్య సమస్యగానే వుండి ఒకవిధమైన ప్రతిష్టంభన ఏర్పడుతుందని జనాబ్ రషీదలీ తెలియజేశారు.

### బ్రిటిష్ ఉపఎన్నికలో లేబర్‌పార్టీ గెలుపు

బ్రాడ్‌ఫర్డ్, డిసెంబర్ 9: దక్షిణ బ్రాడ్‌ఫర్డ్ నియోజక వర్గంలో ఈ వేళ పార్లమెంటుకు జరిగిన ఉపఎన్నికలో లేబర్‌పార్టీ ప్రతినిధి 4 వేల ఓట్ల తేడాతో కన్సర్వేటివ్ ప్రత్యర్థిని ఓడించాడు. ఇంత తేడా వచ్చినందుకు లేబర్‌పార్టీ సంతోషపడుతుండగా, 1945 ఎన్నికలో వచ్చిన 9 వేల తేడాను 4 వేలకు తగ్గించకలిగామని కన్సర్వేటివ్‌లు సంతోషిస్తున్నారు.

ఈ స్థానాన్నికూడా లేబర్ ప్రతినిధి గెలవటంవల్ల, 1945 లో అధికారానికి వచ్చినప్పుడు సంపాదించుకున్న స్థానాలన్నిటినీ లేబర్‌పార్టీ చివరివరకు నిలబెట్టుకోగలిగింది. ఈ విధంగా ఉపఎన్నికలలో స్థానాలను గోల్పోకుండా నిలబెట్టుకో గెలగటం బ్రిటిష్ చరిత్రలో అపూర్వమైనదన్నది.

## చిత్తూరుజిల్లాలో బంగారు గనులు

చెన్నపట్నం, డిసెంబరు 10: చెన్నరాష్ట్రమునందు చిత్తూరు సేలం జిల్లాయందు బంగారం గనులున్నవని ఇండియా ప్రభుత్వం భూగర్భశాస్త్రజ్ఞులు పరిశోధనలుజరుపుచున్నారు. భారతదేశం మొత్తంమీద దక్షిణాపథంలోనే బంగారం ఎక్కువగా లభించుచున్నది. ఇదివరకు ఈప్రాంతములను ఇందుకుగాను పరిశోధించలేదు. ఇప్పుడు బంగారం ధర పెరిగింది కనక క్రొత్త గనులకొరకు అధికారులు వెదుక దలచినట్లు డా॥ ఎ. కె. డేగాలు, దక్షిణ సర్కిలు అధికారి, నుడివెను.

## మిగతా అభ్యర్థులందరి ఉపసంహారం

### హైద్రాబాద్ కాంగ్రెసు వ్యవహారాలలో భిన్నవర్గాల సామరస్యం

[ఆంధ్రపత్రిక విలేఖరి]

హైద్రాబాదు, డిసెంబరు 10: హైద్రాబాదు సంస్థాన కాంగ్రెసులోని ఉభయపక్షాలకు మొన్న భారత ఉపప్రధాని సర్దార్ వల్లభాయ్‌పటేల్‌గారి సమక్షాన కుదిరిన ఒడంబడిక ప్రకారం, ప్రముఖ మహారాష్ట్రనాయకుడు, సంస్థాన కాంగ్రెస్ కార్యవర్గసభ్యుడు అయిన దిగంబరరావు బిందూగారు సంస్థానకాంగ్రెసు అధ్యక్షులుగా పోటీలేకుండా ఎన్నుకొనబడినట్లు గతరాత్రి ప్రకటింపబడింది.

సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షపదవికి పోటీచేయటానికిగాను లోగడ నామినేషన్ పత్రాలు దాఖలుచేసిన స్వామి రామానంద తీర్థ, బూర్గుల రామకృష్ణరావు, జనార్దనరావు దేశాయ్, గోవిందదాస్ ష్రాఫ్, డా॥ జి. ఎస్. మేల్కోటే, ఆర్. వెంకట్రావుగారలు తాము పోటీనుండి వైదొలగినట్లు నిన్నసాయంకాలం సంఘ ప్రధాన కార్యదర్శికి తెలియజేశారు.

దిగంబరరావు బిందూగారి వయస్సు ప్రస్తుతం దాదాపు 50 సం॥లు. ఈయన ప్రారంభంలో స్థానిక వివేక వర్ధనీ వున్నతపాఠశాలలో ఉపాధ్యాయులుగా ప్రవేశించారు. అనంతరం హైదరాబాదు హైకోర్టు భుక్తు ప్లీడరుగా చేరారు. సంస్థాన కాంగ్రెసు, ఆర్యసమాజసంస్థ, సత్యాగ్రహోద్యమాన్ని ప్రారంభించినప్పుడు న్యాయవృత్తికి స్వస్తి చెప్పి ఉద్యమంలో పాల్గొని నిజాం ప్రభుత్వంచే శిక్షింపబడినారు. సంస్థాన కాంగ్రెసులో చేరటానికి ముందు, బిందూగారు, హిందూ స్థాయీ సంఘం, మహారాష్ట్ర సమ్మేళనం, మహారాష్ట్ర గ్రాంటు కేంద్రాల యములలో సభ్యులుగా ఉన్నారు. హైదరాబాదు సంస్థానంలో రజాకార్ పరిపాలనను వ...

(2-వ పేజీ చూడుడు)

కర్ణాటకుల రాజీనామా:

## కేంద్రపార్లమెంటరీబోర్డుతో చర్చకు నిజలింగప్పగారి ఢిల్లీ ప్రయాణం

బొంబయి, డిసెంబరు 9: కేంద్ర, రాష్ట్రశాసనసభలనుండి కర్ణాటక సభ్యులంతా రాజీనామాయివ్వ నిశ్చయించుకొన్నందువల్ల యేర్పడిన క్లిష్టపరిస్థితిని గురించి కేంద్రపార్లమెంటరీబోర్డువారు, కర్ణాటకరాష్ట్ర కాంగ్రెసుఅధ్యక్షులైన నిజలింగప్పతో చర్చిస్తారు. ఇందు నిమిత్తమే నిజలింగప్ప డిసెంబరు 12 వ తేదీన విమానంలో ఢిల్లీ వెళుతున్నాడు.

ఈవిషయాన్ని కర్ణాటక రాష్ట్ర కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు, టి. ఆర్. నెస్వీ వెల్లడిస్తూ సంయుక్త కర్ణాటక రాష్ట్రనిర్మాణంపట్ల మైసూరు ప్రజలుగూడా సుముఖులుగా ఉన్నారని అన్నాడు "మైసూరును చేర్చి కర్ణాటక రాష్ట్రమును నిర్మించుట సాధ్యంగాదని కాంగ్రెస్ హైకమాండ్ వారి అభిప్రాయం. ఒక సంస్థానానికి సర్వాధిపతిగా ఉన్న రాజు, భారతయూనియన్ భూభాగానికి నామమాత్రాధిపతిగా ఉంటంనం సబబుగాదని హైకమాండ్ తలంపు. ఈవిషయంలో హైకమాండ్ వారి సంశయాన్ని నివృత్తి చేయుటకుగాను, మైసూర్ రాష్ట్రకాంగ్రెస్ కార్యవర్గము డిసెంబర్ 15న సమావేశమై కర్ణాటక రాష్ట్ర కాంగ్రెస్ తీర్మానము బలపర్చుమా, సంయుక్త కర్ణాటకను తక్షణమే నిర్మించవలెనని కోరును బహుశః మైసూర్ మహారాజా రాజ్యాధికారమును పరిత్యజించవలెననిగూడా మైసూర్ సంస్థానకాంగ్రెస్ కోరవచ్చు.

మైసూర్ సంస్థానకాంగ్రెస్ నవంబర్ 5-న, కర్ణాటకరాష్ట్రమును నిర్మించాలని తీర్మానించింది కాని, మైసూరు మహారాజును నామమాత్రాధిపతిగా ఉంచాలని సూచించింది.

కర్ణాటక రాష్ట్రమునకు మైసూరు మహారాజా నామమాత్రాధిపతిగా ఉండటానికి కర్ణాటకుల కేమీ అభ్యంతరం లేదు. అయితే మైసూర్‌లో కర్ణాటకప్రాంతాలను కలిపి సంయుక్త కర్ణాటకము నిర్మించేముందే, మహారాజాను పదవినుంచి తొలగించాలని, కాంగ్రెస్ కార్యవర్గ అభిప్రాయం"

మేము కాంగ్రెస్‌పట్ల ఎల్లప్పుడూ విధేయతతో ప్రవర్తిస్తున్నాము. నిష్పాక్షిక దృష్టితో చూచేయడల కర్ణాటక రాష్ట్రనిర్మాణం అసాధ్యం కాదని తెలుస్తుంది" అని నెస్వీ అన్నాడు.

### పటేల్‌కు మైసూర్ కాంగ్రెస్ విజ్ఞాపన

హుబ్లీ, డిసెంబరు 9: పటేల్-పట్టాభి-నెహ్రూ నివేదికలో పేర్కొన్న పద్ధతులమీద, మైసూర్‌ను చేర్చి తక్షణమే సంయుక్త కర్ణాటకరాష్ట్రమును నిర్మించి,దానిని కొత్తరాజ్యాంగంలో ఉదహరించాలని కోరుతూ 225 మంది మైసూర్ కాంగ్రెస్ వాదులు, సర్దార్ వల్లభాయిపటేల్‌కు నేడు ఒక విజ్ఞాపన పంపుతున్నారు.

ఈ విజ్ఞాపనపై, అఖిల మైసూర్ కాంగ్రెస్ కమిటీసభ్యులు, జిల్లా తాలూకా కాంగ్రెస్ కమిటీల అధ్యక్ష, కార్యదర్శులుగూడా సంతకములు చేశారట.

## విభజనసంఘ డెప్టీ సెక్రటరీ

### శ్రీ వి. కె. రావుగారి నియామకం

చెన్నపట్నం, డిసెంబర్ 10: చెన్నరాష్ట్ర విభజనసంఘానికి ప్రస్తుతం రివిన్యూశాఖ డెప్టీ కార్యదర్శిగా వున్న ఒకటి రెండురోజుల్లో ప్రకటన జరుగవచ్చునని తెలియుచున్నది వి. కె. రావు, ఐ. సి. ఎస్. గారు నియమింపబడెదరని మాఫీగా తెలియుచున్నది. శ్రీ వి. కె. రావుగారు బెంగాల్‌లో ఆర్థికశాఖలో అయిదారేళ్లు పనిచేసినారు. మదరాసులోగూడా కొంతకాలం ఆర్థికశాఖలో పనిచేసివున్నారు. వీరికి ఆర్థిక రివిన్యూశాఖల పరిపాలన క్షుణ్ణముగా తెలియును.

## బర్మాకు కామన్వెల్తు సహాయం

రంగూన్, డిసెంబరు 9: వచ్చే జనవరిలో కామన్వెల్తు రాజ్యాలనుండి 35 కోట్ల రూ.ల సహాయం లభించవచ్చునని బర్మాప్రభుత్వం తలంచుచున్నది. కామన్వెల్తు రాజ్యాలు బర్మాకు అందచేసే తొలి ఆర్థికసహాయం యిదే.

## 'ఆంధ్రరాష్ట్రం జనవరి 26 లోగానే ఏర్పడవచ్చు'

### కళా వెంకట్రావుగారి విశ్వాసం

విజయవాడ, డిసెంబరు 10: భారత జాతీయ కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి, చెన్నరాష్ట్ర విభజనసంఘ సభ్యులు అగు కళా వెంకట్రావుగారు మద్రాసునుండ రాజమండ్రి వెళ్లుతూ నేటి ఉదయం ఇక్కడకు వచ్చారు.

విభజనసంఘ కార్యకలాపం చాల సఖ్యంతో జరుగుతున్నదనీ, స్థూలంగా అన్ని విషయాలపైనా సభ్యులందరకు ఏకాభిప్రాయం ఉన్నదనీ వివరాలను ఉపసంఘాలు తయారు చేయగలవనీ, వారి నివేదికలు డిసెంబరు 21 నాటికి సిద్ధంగా ఉండగలవనీ వెంకట్రావుగారు ఆంధ్రపత్రికావిలేఖరితో ఒక ఇంటర్వ్యూలో అన్నారు.

విభజనసంఘ కార్యకలాపంలో కనుపించుతున్న అనుకూలవాతావరణాన్నిబట్టి ఆంధ్రరాష్ట్రం జనవరి 26 లోగానే ఏర్పడవచ్చునని నమ్ముతున్నానన్నారు. సాధ్యమైనంత త్వరలో ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరుగవలెనని మద్రాసుప్రభుత్వం ఆతురతతో నున్నదనికూడ వారు అన్నారు.

ప్రస్తుత కార్యక్రమాన్నిబట్టి వెంకట్రావుగారు స్వంత జిల్లాఅయిన తూర్పు గోదావరి జిల్లాలో డిసెంబరు 15 వరకు ఉండి ఆనాడు బెజవాడలో బయలుదేరి గ్రాండుట్రంకు ఎక్స్‌ప్రెస్‌లో ఢిల్లీ వెళ్లుతారు. తిరిగి 21 వ తారీఖున మద్రాసు వచ్చి విభజనసంఘ సమావేశంలో పాల్గొంటారు.

కళా వెంకట్రావుగారు ఎక్స్‌ప్రెస్‌లో వస్తున్న రంగాగారిని విజయవాడలో కలుసుకోవాలనుకొన్నారు. కాని ఎక్స్‌ప్రెస్ ఆలస్యమవటంచేత రంగాగారిని కలుసుకోకుండానే వెంకట్రావుగారు రాజమండ్రి వెళ్ళారు. అయితే విభజన సంఘ కార్యకలాపాలను తెలియజేస్తు రాష్ట్ర కాంగ్రెస్ కార్యాలయ కార్యదర్శికి ఒకచిన్న కాగితం యిచ్చారు. (స్వ. వి.)

## రాష్ట్రనిర్మాణంపై ఢిల్లీ వర్గాల వైఖరి

### ఆచార్య రంగాగారి వివరణ

[ఆంధ్రపత్రిక విలేఖరి]

విజయవాడ, డిసెంబరు 10: ఆచార్య రంగాగారు నేడు ఎక్స్‌ప్రెస్సులో ఢిల్లీనుండి రాగానే ఆంధ్రపత్రికా ప్రతినిధి సందర్శించి రాష్ట్రవిభజన కార్యకలాపమునుగూర్చి ప్రశ్నించగ ఇట్లు తెలిపిరి :-

"భారతప్రభుత్వము చెన్నరాష్ట్ర విభజన విషయమై మదరాసు ప్రభుత్వానికి పంపిన ఖరీతేమరు ఆ దేశములో విభజన ఏర్పాటులు ఎప్పటికి పూర్తికావాలో గడువు నిర్ణయించలేదు. విభజనచేయు విధానము, నిర్ణయింపవలసిన అంశములు తెలుపుచు, భారతప్రభుత్వంవారు బాధ్యత అంతయు చెన్నరాష్ట్రమునకు విడచి, ఎల్లలు రాజధాని ఆర్థిక విషయములు అన్నింటిని పెద్ద హంగామా హడావుడి లేక సత్వరమే ప్రస్తుతం చేయవలెనని యున్నది.

మదరాసుప్రభుత్వం ఎంతత్వరగా యీ విషయాన్ని తేల్చగలదో తెలుసుకొనుటకై భారత ప్రభుత్వంవారు సంకల్పించియుండిరి.

భారతప్రభుత్వ ఆదేశం విభజన సంఘంవారు, వెంటనే పనికి పూనుకొనవలెనని కాని చర్చలకు పురికొల్పుటకు గాదు. విభజన ఏర్పాటులు తుణ్ణంగా వెంటనే జరగాలనియే భారత ప్రభుత్వం వారి యుద్దేశం. ముందు తాత్కాలిక ఏర్పాటులు చేసుకొని పిదపరి శాశ్వత ఏర్పాటులు చేసుకొనుటకు భారత ప్రభుత్వం వారి ఆదేశం అవకాశం యివ్వడంలేదు. ఇప్పుడు బెంగాలు పంజాబు సరిహద్దుల చిక్కులు వివాదాలవంటివి యికముందు ఆంధ్రరాష్ట్రం విషయంలో రావడం భారత ప్రభుత్వానికి యిష్టంలేదు. అందువల్లనే ఎల్లలు, రాజధానియున్నను వ్యవహారాలన్ని గూడ యిప్పుడే తేలాలనిరి.

"జనవరి 26 తేదీలోగా మదరాసు ప్రభుత్వం యీ విభజన విధానం పూర్తి చేసిన బాగుండును. ఆనాటికి పని పూర్తి చేయలేకుంటే, పార్లమెంటులో బిల్లు పరిశోధన చర్చలు మున్నగు తతంగం అంతా యుండి, అనేకచిక్కు లేర్పడును."

"ఆంధ్రరాష్ట్రం విషయమున తమిళనాయకులు ఆంధ్ర నాయకులకూ విసుముఖంగానుండి తొందరపడుచున్నారు గనుక, త్వరగా పనిముగించుట అత్యావశ్యకము ఆది కుకుతరమైన కార్యమే చర్చలకు ప్రకటనలకు యీ కార్యనిర్వహణలో తావులేదని ఢిల్లీలో నాయకుల విశ్వాసము. ఇతర రాష్ట్రములలో జరుగుచున్న సంఘటనలను గమనించి, ఆంధ్ర తమిళులు యీ వ్యవహారము వందు గుట్టు చప్పుడుగ ప్రవర్తించి ముగించుకోవాలని ఢిల్లీ పెద్దల అభిప్రాయం. విభజనగూర్చిన బహిరంగ చర్చలే యిది పరకు రాష్ట్ర నిర్మాణానికి ప్రతిబంధకములైనవని వారి యుద్దేశము" అని ఎన్. జి. రంగాగారు తెలిపిరి.

శ్రీ రంగాగారు శ్రీ కళా వెంకటరావుగారు కలియుటకు అవకాశం లేకుండెను. రావుగారు రంగాగారికి ఒక లేఖ పంపిరి.

### సిబ్బంది ఉపసంఘ సమావేశం

శాఖాధిపతులకు పంపు ప్రశ్నావళి నిర్ణయం

చెన్నపట్నం, డిసెంబరు 10: చెన్నరాష్ట్ర విభజన సంఘంవారు నియమించిన సిబ్బంది ఉపసంఘం సభ్యులు

## చిత్తరంజన్‌లో రైలు ఇంజన్ల నిర్మాణ కేంద్రం

### బ్రిటిష్ కంపెనీతో భారత ప్రభుత్వ ఒప్పందం ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబరు 9: రైలుఇంజన్లను ఉత్పత్తి చేయడానికి భారతప్రభుత్వం చిత్తరంజన్‌లో 14 కోట్ల రూ. పెట్టుబడితో ఒక పెద్ద కార్ఖానాను నిర్మించబోతున్నది; ఈ కార్ఖానా నిర్మాణాన్ని పర్యవేక్షించి దానిని ఒక దోవలో పెట్టి నడిపించడానికి ప్రభుత్వం లోకోమోటివ్ మాన్యుఫాక్చరర్స్ లిమిటెడ్ అనే ఒక బ్రిటిష్ కంపెనీ సాంకేతిక సహాయం తీసుకుంటున్నది. ఇందుకుగాను భారత ప్రభుత్వం ఆ బ్రిటిష్ కంపెనీతో ఈవేళ ఒక ఒడంబడిక చేసుకున్నది.

ఈ ఒడంబడిక ప్రకారం, పైనచెప్పిన కంపెనీ యంత్రాగారాన్ని నిర్మించడంలో తోడ్పడమేగాక ఉత్పత్తి ప్రారంభమై సక్రమంగా సాగేవరకు సాంకేతిక నిపుణులను ఉంచి ఏపని ఎలాచేయాలో భారతీయులకు నేర్పి ఫాక్టరీని ఒక దోవలోపెట్టి మరీ వెళ్ళాలి. ఫాక్టరీలో పనిచేసే భారతీయ ఉద్యోగులలో కొంతమందిని బ్రిటన్‌కు పంపి యంత్రాగారాలలో సాంకేతిక శిక్షణ ఇప్పించడం అవుతుంది భారత ప్రభుత్వం ఈ సహాయానికి ప్రతిఫలంగా సదరు కంపెనీవద్ద 200 రైలు ఇంజన్లను ఖరీదుకు కొంటుంది దీనికింద 6 కోట్లు మొదలంతొని 8 కోట్లదాకా ఖర్చు తగులుతుందని అంచనా వేయబడినది ఒడంబడికమీద భారతప్రభుత్వం తరపున రైల్వే బోర్డుకార్యదర్శి ఎస్. ఎన్. రామసుబ్బన్ కంపెనీతరపున జె. డబ్ల్యు. వాఘన్ సంతకాలం చేసిరి. ఒడంబడిక కాలపరిమితి 5 ఏళ్లు, ఈ 5 ఏళ్ళలో ఈ పని అంతా జరిగిపోవాలి. కంపెనీతో చేసుకున్న ఒడంబడిక విషయమై భారత ప్రభుత్వ రైల్వేశాఖ నేడీవిధంగా ఒక ప్రకటన చేసింది- "ఏ సంవత్సరంలో ఎన్ని ఇంజన్లు ఉత్పత్తిచేయాలో ఏ కార్యక్రమాన్ని అనుసరించి ఎన్ని అంచెలలో పనిపూర్తి చేయాలో అంతా స్పష్టంగా ప్లాను వేయబడినది.

ప్రారంభంలో, దేశీయంగా ఉత్పత్తి కాని ఇంజను భాగాలు పైజెప్పినకంపెనీ ద్వారా విదేశాలనుండి దిగుమతిచేయడం అవుతుంది. క్రమంగాఫ్యాక్టరీలో ఉత్పత్తి ప్రారంభమైనకొద్దీ దిగుమతులను నిలిపి వేయడం అవుతుంది."

ప్రభుత్వం నిర్మించబోతున్న ఈఫాక్టరీలో సాలుకు 120 ఇంజన్లు ఇవిగాక అద

2-వ పేజి చూడుడు

## కాశ్మీర్ సమస్యపై మండలిలో తిరిగి ప్రతిష్టంభనవస్తే

### పరిస్థితి విచిత్రంగా మారుతుందని సర్ గిరిజాశంకర్ బాజ్పాయి అభిప్రాయం

బొంబాయి, డిసెంబరు 9: కాశ్మీర్ పరిస్థితి తీగలాగితే డొంకంతా కదిలే విధంగా వుంది. అందువల్ల భద్రతా సంఘం ఒకరికి ఒప్పందంగా వుండి, ఇంకొకరికి నచ్చనటువంటిన్నీ, కాకపోతే యిద్దరికి సరిపడనటువంటిన్నీ పరిష్కార మార్గాన్ని సూచిస్తే, ఎటువంటి విధానం అనుసరించవలసి వుంటుందో చెప్పడం, కష్టం అని సర్ గిరిజా శంకర్ బాజ్‌పాయ్ యు. ప్రె. విలేఖరితో మాట్లాడుతూ అన్నారు.

సర్ బాజ్‌పాయ్ కాశ్మీర్ దేశాంగ మంత్రి శ్రీ డి. పి. ధార్‌తో సహా లండన్‌కు నేడు బయలు దేరారు. వారు ప్రయాణం చేస్తున్న విమానంలోనే ప్రఖ్యాత అమెరికన్ పత్రికా రచయిత వాల్టర్ లిఫ్‌మన్ గూడా ప్రయాణం చేస్తున్నారు.

సర్ బాజ్‌పాయి నిన్న సాయంత్రం ఢిల్లీ నుంచి ఇక్కడకు వచ్చారు. ఇక్కడ నుంచి లండన్, అక్కడ నుంచి లేక్ సక్సెస్‌కు వారు ప్రయాణం చేస్తారు.

ఈ సారిగూడా కాశ్మీర్ సమస్యను గూర్చి జరిగే చర్చల్లో ప్రతిష్టంభన ఏర్పడితే ఏమవుతుంది. అని ఆయన్ను కలుసుకున్న యు. ప్రె. విలేఖరి ప్రశ్నించారు. అప్పుడు పరిస్థితి విచిత్రంగా మారిపోతుంది. ఒక కొత్త పరిస్థితి ఏర్పడుతుంది. ఆ పరిస్థితికి, ఇప్పటి పరిస్థితికి ఏ విధంగానైనా సంబంధం వుండదు. అప్పుడు తిరిగి సమస్య ఆ మూలాగ్రం కొత్తగా విచారణకు తీసుకొని, ఇండియా, పాకిస్థాన్‌లకు నచ్చే విధంగా సమస్యను పరిష్కరించవలసి వుంటుంది అని సర్ బాజ్‌పాయ్ ఆ ప్రశ్నకు సమాధాన మిచ్చారు.

భద్రతా సంఘంలో ఇండియా వాదన ఏవిధంగా వుంటుందని విలేఖరి అడిగిన దానికి ప్రత్యుత్తరమిస్తూ అదంతా కాశ్మీర్ కమిషన్ రిపోర్టును బట్టి వుంటుందని సర్ బాజ్‌పాయ్ చెప్పారు. దాన్ని రేపు సభ్యులకు అందజేస్తారు. డిసెంబరు 17 నుంచి భద్రతా సంఘంలో దానిమీద చర్చ ప్రారంభమౌతుంది. అనికూడా ఆయన చెప్పారు.

కమిషన్‌కైన ఖర్చులుభరించేది ఎవరు? అన్న ప్రశ్నకు సమాధానమిస్తూ, కాశ్మీర్

(2-వ పేజీ చూడుడు)

## కావలెను

పడుగుపాడులో (నెల్లూరుజిల్లా) మా ఆంధ్ర దైనిక, సచిత్రవార భారతి మాసపత్రికలను వారి స్వంత బాధ్యతపై విక్రయించుటకు న్యాయ ఏజంటు కావలెను. వివరములకు:

మేనేజరు,
ఆంధ్రపత్రిక. జి. టి. మద్రాసు.

## గంటల పంచాంగం

విరోధి సం॥ మార్గశిర బ॥ షష్ఠి 1949 సం॥ డిసెంబరు 11 ఆదివారం ఆ॥ షష్ఠి రా 9-17 ఆశ్లేష ఉ 6-47 వర్జ్యం సా 6-36 ల 8-11 స.

బ॥ సప్తమి డిసెం॥ 12 సోమవారం సో॥ సప్తమి రా 8-3 మఖ ఉ 6-26 వర్జ్యం ప 2-12 ల 3-45 స.

# ఆంధ్రపత్రిక

విరోధి సం॥ మార్గశిర బ॥ షష్ఠి
ఆదివారం

## ఐక్య ఇండొనీషియా

హేగ్ ఒడంబడికను ధ్రువపరచి, ఆ ఒడంబడికను అనుసరించి ఐక్య ఇండొనీషియాకు స్వాతంత్ర్యము నొసగుటకు డచ్ ప్రభుత్వము ప్రతిపాదించినబిల్లును నెదర్లెండ్ దిగువ శాసనసభ ఆమోదించుటతో మూడు సంవత్సరములుగ యావత్తు ప్రపంచమును, ముఖ్యముగ ఆఖిలాసియాను తీవ్రముగ కలవరపెట్టిన ఇండొనీషియా సమస్య అందరికి తృప్తికరముగ పరిష్కారమై స్వతంత్రాసియా ఐక్యతకు ప్రాతిపదిక ఏర్పడినది. డచ్ పార్లమెంట్ చర్చ సందర్భమున వలసశాఖామంత్రి మార్సెవీన్ "ఆగ్నేయాసియా జాతీయవాదులను అనవసరముగ రెచ్చగొట్టి ఆ దేశములను చేతులార కమ్యూనిజమునకు ఎరగా నిచ్చుటకన్న వారితో సవిధముగనైనను రాజీచేసుకొని సఖ్యపడుట మంచిది" అని చేసిన హెచ్చరికను డచ్ పార్లమెంటు సభ్యులందరు గ్రహించుట శుభసూచకము. ఇండొ-చైనా విషయమున ఫ్రాన్సు కూడ ఇట్టి వైఖరిని అనుసరించి ఇండొనీషియా ప్రజలకు అధికారము దఖలు పరచిన, మలయా నుండి బ్రిటన్ ఇదేవిధముగ వైదొలగిన ఆసియాఖండము కమ్యూనిజము వ్యాప్తిని అరికట్టుటకు జరుగు ఇతర ప్రయత్నము లన్నియు ఫలప్రదము కాగలవు.

ఐక్యరాజ్యసమితిలో యుక్రేన్ ప్రతినిధి హేగ్ ఒడంబడిక ఐక్య ఇండొనీషియాకు సంపూర్ణ స్వాతంత్ర్యమును ప్రసాదింపలేదని ఎంత విమర్శించినను, బ్రిటిష్ కామన్వెల్తు సభ్యత్వమును వదులుకొనవలసిన యవసరము లేకనే సింహళ, భారత దేశములు సంపూర్ణ స్వాతంత్ర్యమును పొందినట్లే ఐక్య ఇండొనీషియాకూడ కాలక్రమమున సర్వాధికార సమన్విత స్వతంత్ర ప్రజారాజ్యము కాగలదు. హేగ్ ఒడంబడిక అట్టి స్థితిని ఇండొనీషియా పొందుటకు దోహదము చేయుగలదను విశ్వాసముతోనే ఇండొనీషియా జాతీయ నాయకులందరు ఈ ఒడంబడికను అంగీకరించిరి. తమ ప్రజల క్షేమమునకు, తమదేశ అభివృద్ధికి ఏది ప్రయోజనకరమో, ఏది ప్రధానమో యుక్రేన్ ప్రతినిధికి కంటె, ఇండొనీషియా నాయకులకు ఎక్కువ తెలియుగలదనుట నిర్వివాదము. డచ్ వలస మంత్రి అన్నట్లు "హేగ్ ఒడంబడిక" కుదరక, ఆబడంబడికను పార్లమెంటు ఆమోదింపక యున్న రష్యా ఎంతగనో సంతోషించి యుండెడిది. అట్టి ఒడంబడిక కుదిరినందువలన ఈ ప్రాంతమునందు ప్రజల రెచ్చగొట్టుటకు ఇంతవరకు కమ్యూనిస్టులకు ఉండిన 'వలస విధానము' అను సాధన హేగ్ ఒడంబడిక ఫలితముగ భగ్నమై పోయెను. నెహ్రూ ప్రభుత్వము సామ్రాజ్యవాదుల చేతులలో కీలుబొమ్మ ప్రభుత్వమని విమర్శించిన రష్యన్ పత్రికలు, విమర్శకులు ఇండొనీషియా ఒడంబడికనిట్లు ఖండించుటలో ఆశ్చర్య మేమియు లేదు.

ఇండొనీషియా ప్రపంచ రాజ్యముల కూటమిలో అనతికాలము ననే ఉచితస్థానమును ఆక్రమింపగలదు. సమితి సభ్యత్వమునకు ఐక్య ఇండొనీషియా పెట్టుకొను దరఖాస్తును రష్యా తమ వీటో అధికారమును ప్రయోగించి త్రోసివేయవచ్చును; కాని అంతమాత్రమున ఇటలీ, సింహళ దేశములవలెనే ఇండొనీషియా స్వాతంత్ర్యము పరిమితము కాజాలదు.

హేగ్ ఒడంబడిక సాధ్యమగుటకు కారణభూతమైన ఐక్యరాజ్య సమితి సమాధాన సంఘమును ఈ సందర్భమున ప్రత్యేకము అభినందింపవలెను. కాశ్మీరు కమిషన్ వలె పక్షపాత విధానమును అనుసరింపక ఇండొనీషియా సామరస్య సంఘము న్యాయ పక్షమున నున్న దోషముందు గ్రహించి, అప్రకారముగ, ఎన్ని ప్రతిబంధకము లేర్పడినను, న్యాయ విజయమునకు దీక్షతో పనిచేసియున్నందున ఐక్య ఇండొనీషియా స్థాపన సాధ్యమయ్యెను. ఈ ఉపసంఘ కార్యవిధానము ఐక్యరాజ్య సమితికి, సమితి అధీన సంఘములకు, ముఖ్యముగ కాశ్మీరు కమిషన్‌కు అనుసరణీయమని చెప్పవచ్చును.

భారత దేశము తరువాత సాత్విక మార్గమున స్వాతంత్ర్యమును పొందిన ఐక్య ఇండొనీషియా, భారత దేశమువలెనే ఇండొనీషియా కూడ శాంతిస్థాపనలో ప్రముఖపాత్రవహింపగలదని, ఉభయ దేశములు స్నేహ, సహకార విధానముల నవలంబించి ఐక్య ఆసియా స్థాపనకు కృషి చేయునని ఆశింపవచ్చును.

## హైదరాబాద్ కాంగ్రెస్ తగాయిదా పరిష్కారం

సంస్థాన శాఖామాత్యుడు సర్దార్ వల్లభాయ్‌పటేల్ జోక్యము వలన ఒకసంవత్సరముగ హైదరాబాద్ రాజకీయములను కలుషితము చేసిన 'కాంగ్రెస్‌వాదుల స్పర్థలు' అన్నివర్గములకు తృప్తికరముగ పరిష్కారమైనవి. లోగడ సర్దార్ పటేల్ హైదరాబాద్ వచ్చినపుడు ఇదేవిధముగ ఇరుపక్షముల ప్రతినిధులను సమావేశపరచి, ఒక ఒడంబడికను కుదర్చెను. కాని ఆ ఒడంబడిక సర్దార్ పటేల్ సంస్థానమును వదలి వెళ్లిన ఉత్తరక్షణమున భగ్నమైనది. అప్పటినుండియు తిరిగి సామరస్యమును సాధించుటకు జరిగిన అన్ని ప్రయత్నములు విఫలమయ్యెను. విభేదములు తీవ్రమయ్యెను. ఈ విభేదములు, కాంగ్రెస్‌వాదుల స్పర్థలు సంస్థాన భవిష్యత్తునకు ముప్పు తెచ్చిపెట్టునవిగ పరిణమించెను. ఈ స్థితిలో సర్దార్ వల్లభాయ్‌పటేల్ తిరిగి ప్రమేయము కల్పించుకొని సమాధానమును కుదర్చి, మార్చిలో జరుగనున్న రాజ్యాంగ పరిషత్తు ఎన్నికలలో కాంగ్రెసువాదులు తమ బాధ్యతలను నిర్వహించుటకు అవకాశము కల్పించెను.

సంస్థానము నందలి, ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్ర ప్రాంతములందు సంస్థాన కాంగ్రెసు స్పర్థలు తీవ్రమై ఆయాప్రాంతీయుల ఐక్యతకు ప్రతిబంధక మయ్యెను. అందువలన కాంగ్రెసు ప్రాథమిక ఎన్నికలందు దౌర్జన్య చర్యలు కూడ జరిగినవి. కేంద్ర కాంగ్రెసు సంస్థ అధ్యక్షుని ఎన్నిక విషయమున కుదిరిన సమాధానము, ఇతర ప్రాంతీయ కాంగ్రెసు సంఘములందు ప్రబలిన వివాదములను పరిష్కరించి ఐక్యతను సాధించుటకు ఉపయోగపడవచ్చును.

హైదరాబాదు రాజ్యాంగ పరిషత్తుకు మార్చి మాసమున ఎన్నికలు జరుగుట తథ్యము. ఆఎన్నికలందు కాంగ్రెస్ అభ్యర్థులు విజయమును గాంచుటకూడ తథ్యమే. కాని కాంగ్రెస్ అభ్యర్థులు భిన్న పక్షములకు ప్రాతినిధ్యమువహించి ఒకరితో నొకరు పోటీపడుటకంటె ముందుగనే ఒక సమాధానమునకు వచ్చి నిర్దుష్ట ప్రణాళికపై ఎన్నికలందు గెలుపొందిన సంస్థాన రాజకీయ భవిష్యత్తు విషయమునఁ నేగాక, సంస్థానము నందికముందు అమలు జరుపవలసిన ఆర్థిక, సాంఘికసంస్కరణల విషయమున కూడ తమ అభిప్రాయములను అమలు జరుపుకొనుటకు ఎక్కువ అవకాశము ఉండగలదు. మార్చి ఎన్నికల ఫలితముగా రాజ్యాంగ పరిషత్తు ఏర్పడిన అనంతరము ఎంతోకాలము ఇప్పటి మంత్రివర్గము అధికారమునందుండదు. కాంగ్రెస్‌పక్ష నాయకుని ఎన్నిక జరిగి, నాయకులు తమ బాధ్యతను నిర్వహింపగలరని ధ్రువపడిన వెంటనే సంస్థానమున ప్రజాప్రతినిధి ప్రభుత్వ మేర్పడగలదు. ఇట్టి ప్రభుత్వస్థాపనలో ఇంక ఏమాత్రము కాలహరణము ఉండరాదు; ఉండదనియే భావింపవచ్చును. కనుక ఇంక నుండి సంస్థాన కాంగ్రెస్‌నాయకులు ఇప్పటి ఒడంబడికను కుదుర్చుకొనుటలో ప్రదర్శించిన సమాధాన వైఖరినే ప్రదర్శించి సంస్థాన సమస్యల పరిష్కారమును సుకరము చేయుదురని విశ్వసించుచున్నాము.

## కామన్వెల్తు విదేశాంగ మంత్రుల సభ

### నెహ్రూ నాయకత్వాన భారత ప్రతినిధివర్గం

న్యూఢిల్లీ, డిసెంబరు 9: కచ్చేరెల కొలంబోలో జరుగనున్న కామన్వెల్తు విదేశాంగ మంత్రుల సభకు, భారత ప్రతినిధివర్గం పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ నాయకత్వాన వెడుతుంది.

భారత విదేశాంగశాఖా సహాయ కార్యదర్శి దత్తు, ఆర్థికశాఖా కార్యదర్శి కె. జి. అంబేద్కర్, సహాయ కార్యదర్శి కె. వి. రాయ్‌గారలు భారత ప్రతినిధివర్గ సభ్యులుగా నెహ్రూ వెంట కొలంబో వెడతారు. ఈ ప్రతినిధివర్గానికి, భారత విదేశాంగశాఖా డిప్యూటీ కార్యదర్శి, కార్యదర్శిగా పనిచేస్తారు. కొలంబోలో భారత హైకమీషనర్ వి. వి. గిరిగారు కూడా యీ ప్రతినిధివర్గంలో చేరతారు.

కామన్వెల్తు విదేశాంగ మంత్రులసభ జనవరి 9 వ తేదీన ప్రారంభమై ఆరు రోజులపాటు జరుగుతుంది. ఆర్థిక రాజకీయ విషయాలు అనేకం సమావేశంలో చర్చకు వస్తాయి. ముఖ్యంగా తూర్పు ఆసియాలో స్థితిగతులు చర్చింపబడును. కమ్యూనిస్టు చైనాను పరిగణించే విషయం, జపాను సంధి ఒడంబడిక సమావేశంలో చర్చకు వస్తాయని, విదేశాంగ మంత్రులు వీటిపై తమ తమ అభిప్రాయాలను పరస్పరం వ్యక్తీకరించుకొంటారని తెలుస్తున్నది.

# విద్యుచ్ఛక్తి చట్ట సవరణ

## బిల్లుకు పార్లమెంటు ఆమోదం

### రైల్వే చట్టసవరణ బిల్లుకుకూడా సమ్మతి

న్యూఢిల్లీ, డిసెంబరు 9: ఇండియా పార్లమెంటు ఈవేళ రెండు చట్టాలు ఆమోదించింది. రెండూ సవరణలతో కూడిన చట్టాలే. వీటిలో మొదటిది ఇండియా రైల్వేచట్టము. రెండవది విద్యుచ్ఛక్తిసప్లయిచట్టము.

పార్లమెంటులో నిన్నంతా ఇండియా రైల్వేచట్టాన్ని గురించి చర్చ జరిగింది. ఈవేళ ఉదయమే ఈ సవరణచట్టం ఆమోదింపబడినది.

రైల్వే జవాబుదారితో వస్తువుల సరఫరా చెయ్యడంలో సౌలభ్యం కలిగించడానికి, రైల్వేలల్లో జరిగే ప్రమాదాలలో బాధితులకు తక్షణ పరిహారం ఇవ్వడానికి అవకాశాలను కల్పిస్తూ రైల్వే చట్టంలో సవరణలు చెయ్యబడ్డాయి.

విద్యుచ్ఛక్తి చట్టానికి సంబంధించిన సవరణలను విద్యుచ్ఛక్తి మంత్రి ఎన్. వి. గాడ్గిల్ ప్రతిపాదించారు. ఈ విధంగా ఆమోదింపబడిన విద్యుచ్ఛక్తి చట్టంవల్ల రాష్ట్రాలు, కేంద్రము, కలిసి రాష్ట్రాలకు సంబంధించిన విద్యుచ్ఛక్తి సంఘాలలో సగంకాలమే పనిచేసే సభ్యులను నియమించడానికి వీలవుతుంది. ఈ విషయంలో నిరుటి సంవత్సరం ఆమోదించిన చట్టంవల్ల కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు విద్యుచ్ఛక్తి సంఘాలలో పూర్తిగా పనిచేసే సభ్యులను నియమించవలసి ఉండెను. ఇప్పుడు సవరణలతో ఆమోదించబడిన విద్యుచ్ఛక్తిచట్టంవల్ల సగంకాలం పనిచేసే సభ్యులను నియమించడానికి వీలవుతుంది.

రైల్వేశాఖాసహాయమంత్రి కె. సంతానం రైల్వేసవరణ చట్టాన్ని గురించి మాట్లాడుతూ, పైనూతలులేని రైల్వేపెట్టెలలో తీసుకొనిపోబడిన వస్తువుల విషయంలో నష్టపరిహారానికి రైల్వేలకు జవాబుదారీ ఉండకూడదని ఒకసవరణ వచ్చిందనీ దానికి తమ ఆమోదం తెలియజేస్తున్నామనీ అన్నారు. మూతలు గల రైల్వే పెట్టెలు దొరకనిపక్షంలో, మూతలు లేని రైల్వే పెట్టెలలో వస్తువులకు నష్టంకలిగినప్పుడు, వాటికి పరిహారం ఇచ్చే జవాబుదారీ రైల్వేలకు లేకుండా చెయ్యడమే కొత్త సవరణ ఆశయము.

ఆ పిమ్మట కె. సంతానం విద్యుచ్ఛక్తి సంఘాలలో సగంకాలం మాత్రమే పనిచేసే సభ్యులను గురించి మాట్లాడుతూ, సమర్థులైన ఇంజనీయరులు దొరకకపోవడంవల్లా, ఆర్థికమైన ఇబ్బందులవల్లా ఈ విధంగా చెయ్యవలసివచ్చిందనీ, దీనివల్ల ఈ సభ్యుల నిష్పక్షపాత ప్రవర్తనలో లోపం ఏమీ ఉండదనీ, అన్నారు.

ఆ తరువాత హెచ్. వి. కామత్ ఈ విషయంలో మాట్లాడుతూ, ఈ సవరణలతో కూడిన చట్టానికి తాము వ్యతిరేకిస్తున్నామనీ, సగంకాలం మాత్రమే పనిచేసే సభ్యులను నియమించడమువల్ల పని తిన్నగా సాగదనీ, సమర్థులైన ఇంజనీర్లు లేకపోవడం దేశం అసమర్థతనే చాటుతున్నదనీ ప్రభుత్వం సాహసంతో మెలిగితే తప్ప దేశానికి క్షేమం చేకూరదనీ అన్నారు.

అనంతరం హెచ్. వి. పటాస్కర్ మాట్లాడుతూ ఎప్పుడూ సగంకాలం మాత్రమే పనిచేసే సభ్యులను నియమించాలనే మాత్రం ఎక్కడాలేదనీ, తగినంత ధనము అవసరమున్నంతే పూర్తిగా పనిచేసే సభ్యులనుకూడా నియమించవచ్చుననీ అన్నారు.

ఆటుపిమ్మట యు. పి. ప్రతినిధి మహావీర్ త్యాగి మాట్లాడుతూ, తగినంత ధనం లేక పోవడం వల్లనే ఇలాంటి మార్పు చెయ్యవలసి వచ్చిందనీ, స్వాతంత్ర్యం వచ్చిన కొద్ది రోజుల్లో భారత ప్రభుత్వం వెనక ముందు చూడకుండా ప్రణాళికలు వెయ్యడం మొదలు పెట్టిందనీ, కాని డబ్బులేక పోవడంవల్ల అన్నిన్నీ కట్టిపెట్టి వేస్తున్నదనీ, ఈ సవరణలతో కూడిన చట్టానికి తమ ఆమోదం తెలియ జేస్తున్నామనీ అన్నారు.

ఆ పిమ్మట ఈ చర్చకు సమాధానం చెబుతూ గాడ్గిల్ ఇల్లాగ అన్నారు. ఇంత చిన్న విషయంమీద కామత్ ప్రభృతులు ఇంతెంత పెద్ద ఉపన్యాసా లివ్వడం చాలా ఆశ్చర్యంగా ఉన్నది. విద్యుచ్ఛక్తి దేశంలో ఆ వీటి కాదేదు పెరుగుతుంది. ఈ సంఘంలో సభ్యులకు గొప్ప సాంకేతిక జ్ఞానం ఉండాలి. ఒరిస్సావంటి చిన్న రాష్ట్రాల్లో పూర్తిగా పని చేసే సభ్యులందరినీ వల్ల తలపెట్టించిన వ్యయం అవుతుంది. దానిల్లు అసలు సంఘాలు ఏర్పాటు చెయ్యడానికి వీలుండదు. ఇప్పుడు ఈ సవరణల్ల సగం కాలంలో పనిచేసే సభ్యులనుకూడా వేసుకోవచ్చునని ఉన్నది. గాని, పూర్తిగా పనిచేసే వారిని నియమించకూడదని ఎక్కడాలేదు. ఆర్థికాది కారణాలవల్ల ఈ సవరణలు అమలులో పెట్టవలసి వచ్చింది. పరిస్థితులు అనుకూలించగానే పూర్తిగా పనిచేసే సభ్యులనే నియమించవచ్చును.

ఆనంతరం కొంత చర్చ జరిగిన తరవాత పార్లమెంటులో ఈ చట్టం ఆమోదింపబడినది.

## మూడు బిల్లుల ప్రతిపాదన

న్యూఢిల్లీ, డిసెంబరు 9: ఈ వేళ ఇండియా పార్లమెంటులో కాందిశీకుల ఆస్తికి, పారిశ్రామికమైన తగాదాలలో కేంద్ర అప్పీలు విచారణ మండలికి, ఇండియా స్టీమరులకు సంబంధించిన మూడు కొత్త చట్టాలు ప్రవేశపెట్టారు.

మోహనలాల్ సక్సేనా కాందిశీకుల ఆస్తికి సంబంధించిన చట్టం ప్రవేశపెట్టారు. 1949 అక్టోబరులో కాందిశీకుల ఆస్తికి సంబంధించిన ఆర్డినెన్సు ఒకటి ప్రకటించబడినది. అది రేపు ఏప్రెలుతో అంతమైపోతుంది. ఆ ఆర్డినెన్సును చట్టంగా చెయ్యడమే దీని ఆశయము.

దీనివల్ల ఇండియా కంతటికీ ఒక చట్టం అమలులోకి వస్తుంది. పశ్చిమ బెంగాలు, మణిపూరు మొదలైన ప్రాంతాలలో ప్రత్యేక పరిస్థితులు ఏర్పడనందువల్ల వాటికి మాత్రం ఈ శాసనం వర్తించదు.

కార్మిక మంత్రి జగజీవన్‌రామ్ పారిశ్రామికమైన తగాదాలలో కేంద్ర అప్పీలు విచారణమండలిని ఏర్పరిచే ఉద్దేశంతో మరి ఒక బిల్లు ప్రవేశపెట్టారు.

ఈ చట్టంవల్ల కేంద్ర అప్పీలు విచారణ మండలిని ఏర్పరచడానికి అవకాశం కలుగుతుంది. ఇంతకు పూర్వము, కేంద్రము రాష్ట్రాలు పారిశ్రామికమైన తగాదాలలో అనేకమైన అప్పీలు విచారణ సంఘాలను ఏర్పరిచాయి. ఈ అప్పీలు విచారణ సంఘాలు కొన్ని విషయాలలో పరస్పర విరుద్ధములైన తీర్పులుకూడా ఇచ్చాయి. దీనివల్ల పారిశ్రామిక సంస్థలకు అనేకమైన ఇబ్బందులు కలుగుతున్నాయి. ఈ కేంద్ర అప్పీలు విచారణ సంఘంవల్ల వివిధములైన ఈ విచారణ సంఘాలనన్నిటినీ ఒకదారిని నడిపించటానికి వీలవుతుంది.

భారతప్రభుత్వం ఇంతకుపూర్వమే ఈ విషయంలో ఒక చట్టం ప్రవేశపెట్టవలసిందికాని, పూర్వపు ఇండియా ప్రభుత్వ చట్టంవల్ల అది వీలులేకపోయింది. అందుచేత కేంద్ర ప్రభుత్వం ఈ చట్టం ప్రవేశపెడుతున్నదని తెలుస్తున్నది.

ఆపిమ్మట రవాణా సహాయమంత్రి కె. సంతానం 1917 లో ఏర్పడిన దేశంలోని స్టీమరులకు సంబంధించిన చట్టానికి సవరణ ప్రవేశపెట్టారు.

దీనివల్ల ఈశాన్యంగా ఉన్న భారత నదులలో పాకిస్థాన్‌తో చేసుకున్న ఒడంబడిక ప్రకారం అడ్డులేకుండా స్టీమర్లను నడిపించడానికి వీలవుతుంది.

దీనివల్ల ఒక దేశంలో ఇచ్చిన లైసెన్సు కొంతవరకును చెల్లించడంలో ఇతర దేశంలోకూడా ఉపయోగించుకోడానికి వీలవుతుందని తెలుస్తున్నది. పూర్వం ఒకసారి చేసుకున్న ఒడంబడిక రద్దుకావడంవల్ల ఈ చట్టం ప్రవేశపెట్టవలసిన అవసరం కలిగిందని తెలుస్తున్నది.

## కేంద్ర ఫిలిమ్ సెన్సారు బోర్డు చట్టం

న్యూఢిల్లీ, డిసెంబరు 9:—ఇండియా పార్లమెంటులో ఈవేళ ఫిలిమ్ సెన్సార్ బోర్డు చట్టం ఒకటి ప్రవేశ పెట్టబడినది. దేశానికంతటికీ ఒకే ఫిలిం సెన్సారుబోర్డును ఏర్పాటు చెయ్యడము, రాష్ట్రాలలో ఫిలిమ్ సెన్సార్ బోర్డులను ఎత్తివెయ్యడము ఈ చట్టం ఆశయాలు. భారత ప్రచార శాఖామంత్రి ఆర్.ఆర్.దివాకర్ ఈచట్టం పార్లమెంటులో ప్రతిపాదించారు. ఈ చట్టంవల్ల సమాచార చలన చిత్రాలు మొదలయినవి విధిగా ప్రజలకు ప్రదర్శింపజేసే అవకాశంకూడా ఏర్పడింది. రాష్ట్రీయ ప్రభుత్వాలు శాంతి భద్రతల సంరక్షణ కోసం ఏ ఫిల్మునైనా రెండు నెలల వరకు నిషేధించే అధికారం కూడా ఈ చట్టంలో పొందుపరచబడింది.

ఈ బిల్లును పార్లమెంటులో ప్రవేశ పెడుతూ ఆర్. ఆర్. దివాకర్ ఇల్లాగ అన్నారు. 'ఇంతకు పూర్వం అమలులో ఉన్న చట్టాన్నిబట్టి ఈ దేశంలో అనేకమైన ఫిలిం సెన్సారు బోర్డులు ఏర్పడ్డాయి. అందుచేత దేశాని కంతటికీ ఒకే విధానం అవలంబించడానికి వీలులేకుండా పోతున్నది. ఒక రాష్ట్రంలో అనుమతించబడిన చిత్రం ఇంకొక రాష్ట్రంలో నిషేధించడం పంటివి కూడా జరిగాయి. అందు చేత దేశంలో ఫిలిం సెన్సారుబోర్డులకు గౌరవము లేకుండాపోయింది. ఫిల్ములవల్ల జ్ఞానాభివృద్ధి ఆరోగ్యాభివృద్ధి చెయ్యవచ్చును. అయితే ఈ సెన్సారుబోర్డుల మీద అనేకమైన విమర్శలు రావడంవల్ల కేంద్రప్రభుత్వం ఈ అధికారం తీసుకున్నది. ఆ అధికారాన్ని బట్టే ఇప్పుడీబిల్లు ప్రవేశపెడుతున్నాము. ఈ సెన్సారుబోర్డులో అన్ని భాషలకూ అన్ని సంస్థానాలకు అన్ని రాష్ట్రాలకు సరియైన సదుపాయాలు కలిగేటట్టు చూస్తాము. కేంద్రం ఈ అధికారం తీసుకోవడంతోబాటు రాష్ట్రాలకు కొన్ని అధికారాలు ఇవ్వడంకూడా జరిగింది. శాంతిభద్రతలకు భంగం కలిగించేటట్లుంటే రాష్ట్రప్రభుత్వాలు ఏఫిల్మునైనా రెండు నెలలవరకు నిషేధించవచ్చును. విదేశీయుల ఫిల్ములతో పోటీచేయడానికి చెయ్యడానికి దేశీయములైన ఫిల్ములు ప్రదర్శించడంలో కేంద్రానికి కొన్ని ప్రత్యేకాధికారాలు కల్పించాము. ఈ విషయంలో ఒక విచారణ సంఘాన్ని కూడా నియమించాము.

దాని నివేదికనుబట్టి అవసరముయితే కొన్ని కొత్తచట్టాలు ప్రవేశపెట్టదలచుకున్నాము. ఈ విషయంలో చాలా కాలం నించి మార్పు చెయ్యవలసిన అవసరం ఏర్పడింది కాబట్టి ప్రస్తుతానికి ఈచట్టం ప్రవేశపెట్టడం జరిగింది!!

ఆ పిమ్మట తిరుమలరావుగారు మాట్లాడుతూ పీల్ములు పెట్టుదారులకు ఉపకరించేలాగా మూరాయన కామప్రవృత్తిని రేకెత్తించే విషయాలే వీటిల్లో ఎక్కువగా ప్రదర్శింపబడుతున్నాయనీ, అనేక భాషల్లో చలనచిత్రాలు తయారవుతున్నాయి కాబట్టి వీటిని జాగ్రత్తగా పరిశీలించే పూర్తి కేంద్ర ప్రభుత్వం నియమించిన సెన్సారు బోర్డు పై పడినదనీ, ఫిలుములు విద్యావ్యాప్తికి చాలా అవసరములనీ ఇవి సరిగా ఉపయోగపడేటట్లు కేంద్రం ప్రభుత్వం చూడాలనీ అన్నారు.

అ పిమ్మట బీగమ్ అజీజాల్ రసూల్ మాట్లాడుతూ, ఫిలిమ్ సెన్సారు బోర్డుకు తగిన వారిని నియమించాలనీ, భారతీయ చలన చిత్రాలలో ప్రేమ చిత్రణం బాగా లేదనీ, వీటిలో నైతిక ప్రమాణాలు అవలంబించాలనీ అన్నారు.

తరవాత మునిస్వామి పిళ్లె మాట్లాడుతూ ఫిలిమ్ సెన్సార్ బోర్డుకు అన్ని భాషీయ ప్రాంతాల నించీ ప్రతినిధులను ఏర్పరచాలని అన్నారు.

తరవాత ఒ. వి. అలగేశన్ మాట్లాడుతూ రాష్ట్రాలలోని సెన్సారు బోర్డులను పూర్తిగా ఎత్తి వెయ్యడం న్యాయం కాదనీ, కేంద్రానికి కొన్ని అధికారాలు ఉండాలనీ అన్నారు.

ఆ పిమ్మట శ్రీమతి దుర్గాబాయి గారు మాట్లాడుతూ తాము ఈ చట్టానికి ఆమోదం తెలియ జేస్తున్నామనీ, కేంద్రంలో సెన్సారు బోర్డు ఉంచడం మంచిదేనని ఫిలుము నిర్మాతలకు ఈ బోర్డు వారు ముందే కొన్ని సూచనలు చెయ్యడం కూడా మంచిదేనని అన్నారు.

తరవాత ఈ బిల్లు చర్చ సోమవారానికి వాయిదా పడింది.

## రైలు ఇంజన్ల నిర్మాణ కేంద్రం

(1 వ పేజీ తరువాయి)

సంగా 50 బాయిలర్లు ఉత్పత్తిఅవుతవి. టాటావారి ఫ్యాక్టరీ, ప్రభుత్వం పెడుతున్న ఫ్యాక్టరీకలిసి ఏటేటా దేశానికి కావలసిన ఇంజన్లన్నీ స్వయంగా ఉత్పత్తి చేయగలవనీ, ఇకమీద విదేశాలనుండి ఇంజన్లను దిగుమతిచేసుకోవలసిన అవసరం కలగదనీ విషయజ్ఞులు చెబుతున్నారు.

చిత్తరంజన్ ప. బెంగాలులో బర్ద్వాన్‌జిల్లాలో ఈస్టిండియా రైల్వే లైనుమీద అసన్సోల్‌కు 17 మైళ్ళ దూరంలో ఉన్నది. ఈ ప్రాజెక్టుకింద ప్రభుత్వం 24 కోట్లు పెట్టుబడి పెడుతున్నది. ఇందులో 6½ కోట్లదాకా కార్మికుల గృహనిర్మాణంకింద ఇతర వసతులకిందనే ఖర్చుచేయబడుతుంది. తక్కిన 8½ కోట్లు కార్ఖానాలనిర్మాణంకింద యంత్రపరికరాల కింద పెట్టడంఅవుతుంది. చిత్తరంజన్‌ను ఒకపట్టణంగామార్చి 6 వేల కుటుంబాలకు వసతికల్పించడానికి ప్లాను వేయబడుతున్నది.

## బిందూగారి ఎన్నిక

(1-వ పేజీ తరువాయి)

కొట్టడానికి గాను సంస్థాన కాంగ్రెసు ప్రారంభించిన స్వతంత్ర పోరాటంలో బిందూగారు హైదరాబాదు సంస్థాన కాంగ్రెసు, కార్యాచరణసంఘ అధ్యక్షులుగా సంస్థానానికి ప్రశంసాపాత్రమైన సేవచేశారు. బిందూగారు స్వార్థరహితమైన ప్రజాసేవకులు, నిరాడంబరత్వము, ఋజువర్తన ఆయనకు పెట్టనికోటలు.

సంస్థాన కాంగ్రెస్‌లోని ఉభయపక్షాల మధ్య విభేదాలు తీవ్రంగాఉన్న రోజులలో, రెండు పక్షాలను ఒక అంగీకారానికి తీసుకొనివరావటానికి బిందూగారు తమ పలుకుబడినంతను వినియోగించి కృషిచేశారు. సంస్థాన కాంగ్రెస్ అధ్యక్ష పదవికి ఆయన అభ్యర్థిత్వాన్ని పోటీ పక్షాలు రెండూ కలిసి బలపరచట, ఆయన విలువను ఋజువు చేస్తున్నది.

సంస్థాన కాంగ్రెస్‌లోని వివిధశక్తులను బిందూగారు ఒక్కతాటిమీదకు తీసుకొనిరాగలరని విశ్వసిస్తున్నామని ప్రముఖ ఆర్యసమాజ నాయకుడు, సంస్థాన కాంగ్రెస్ ప్రముఖుడు అయిన వినాయకరావు విద్యాలంకార్ గారు ఒకఇంటర్వ్యూలో అన్నారు. బిందూగారు అధ్యక్షులుగుటతో సంస్థానంలో వివిధవర్గాల రాజకీయ వాతావరణం ఏర్పడగలదని విశ్వసిస్తున్నానని కూడ విద్యాలంకార్ అన్నారు.

## కాశ్మీరు సమస్య: బాజ్పాయ్ అభిప్రాయం

(1-వ పేజీ తరువాయి)

సమస్య విషయం తేలిన తరువాతగానీ ఆ విషయమై విచారణ జరగదు అని ఆయన గిరిజా అన్నారు.

### భద్రతామండలి చర్చించేవిషయం

లేక్‌సక్సెస్, డిసెంబరు 9: డిసెంబరు 17 వ తేదీనాడు కాశ్మీర్ సమస్య విషయమై భద్రతా మండలిలో చర్చ జరుగనున్న సందర్భంలో, ఆమండలి ఈ విషయంలో ఇంకా మధ్యవర్తిత్వం అవసరమా? లేక ఏదైనా చర్యతీసుకోవాలా? అనే విషయాన్ని పరిశీలించవలసి వుంటుంది.

మధ్యవర్తిత్వం లేకపోతే, ఇక ఈ మండలి సూచించగల మార్గమల్లా పరిష్కర్తృత్వం తప్ప ఇంకొకటి లేదని ఇక్కడివారు అంటున్నారు. ఐక్యరాజ్య సమితి ధర్మ ప్రణాళిక 33 వ అంశం ఈ విషయాన్నిగూర్చి వివరిస్తున్నది.

కాని ఇండియా ప్రభుత్వం పరిష్కర్తృత్వంపట్ల తనకుగల వైముఖ్యాన్ని స్పష్టం చేసివున్నది. అందువల్ల ఇండియాకు అంగీకార యోగ్యమయ్యే విధంగా ఒక రాజీ ప్రతిపాదనను భద్రతామండలి సన్నద్ధం చేయవచ్చునని ఈ వర్గాలవారు భావిస్తున్నారు.

కాగా ఈ మార్గం ఏమిటో, ఎట్లా వుంటుందో కూడా ఇప్పటివారికి తెలియరాకాలేదు. సాలకు పాల్పడు తున్నది. ఈ పరిష్కర్తృత్వం కొన్ని వివాద విషయాలకు మాత్రమే నియమితం చేయబడుతుంది. ఏ విషయాలకు ఇది నియమితమైందో కూడా భద్రతా సంఘం తన తీర్మానంలో విశదీకరిస్తుంది. అడ్మిరల్ నిమిట్జే అప్పుడు కూడా పరిష్కర్తగా వ్యవహరిస్తారు.

ఈ విధంగా విషయ విశదీకరణతో కూడిన పరిష్కారమార్గం ఇండియాకు నచ్చగలదా? అని ఇక్కడి వర్గాలవారు భావిస్తున్నారు.

## సారవాక్ గవర్నర్ స్టివార్డ్ మరణం

సింగపూర్, డిసెంబర్ 10: ఇటీవల కత్తిపోటువల్ల గాయపడిన సారవాక్ గవర్నర్ డంకన్‌జార్జి స్టివార్డ్ ఈరోజు మరణించారు. సిబూ అనే పట్టణంలో గత శనివారంనాడు 18 ఏళ్ల మలయా కుర్రవాడు ఇతనిని కత్తితో పొడిచాడు.

## ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము

(1 వ పేజీ తరువాయి)

శ్రీ ఒ. పుల్లారెడ్డి, ఎస్. వెంకటేశ్వరన్, ప్రధాన కార్యదర్శి రామునిమోహన్‌గారలు నేడు ప్రధాన కార్యదర్శి మందిరమున సమావేశమై ఆయాశాఖల అధిపతులకు పంపవలసిన ప్రశ్నావళినిగూర్చి చర్చించి నిర్ణయించిరి. ఇపుడు ఆయా శాఖలలో పనిచేయు చున్న వారెందరు? ఆంధ్రరాష్ట్రమునకు కావలసిన వారెందరు? ఎందరు ఆంధ్రులు పర్వీసులో వున్నారు. ఆంధ్రరాష్ట్రమునకు కావలసినవారెందరుకున్న సిబ్బందిని రెండురాష్ట్రములకు ఎటుల పంచెదరు? ఎంతమంది అధికముగా కావలెను, లేదా ఎందరుమందిని తగ్గించవలెను మున్నగు ప్రశ్నలకు 14 వ తేదీ లోపల సమాధానములు పంపవలెనని కోరుచున్నారు.

వారి సమాధానములు వచ్చినతోడనే ఆయాశాఖల అధిపతులతోను, ఆయాశాఖల కార్యదర్శులతోను 14 వ తేదీ మొదలుకొని 21 వ తేదీవరకు అను 22. సమావేశములరు ఈ సిబ్బంది నిష్పత్తియపేర ఘంవారు జరిపెదరు. 21 వ తేదీకి విభజన సంఘమునకు వారి సిఫార్సులను అందచేసెదరు.

## ఆర్థిక ఉపసంఘం

ఆర్థిక ఉపసంఘము డిసెంబరు 13 వ తేదీన సమావేశము కానున్నది. నేను విభజనసంఘ సభ్యులైన శ్రీ టి. టి. కృష్ణమాచారిగారు వచ్చే విభజనసంఘ సమావేశమునకు పేశ చేయవలసిన సమాచారము గూర్చి శ్రీ టి. ఎన్. ఎస్. రాఘవన్, వెంకటేశ్వరన్ పుల్లారెడ్డి గారలతో సంప్రదింపులు జరిపిరి.

## తుపాను బాధిత సహాయనిధి

### రాయలసీమ ప్రజల కృషి

గుంతకల్లు లలితకళా సంఘం వారికి రాష్ట్రపతి ఆశీస్సులు

గుంతకల్లు, డిసెంబరు 6: "ఆంధ్ర రాష్ట్రం ఏర్పడుచున్న తరుణంలో తుపాను వచ్చి, ప్రజల స్థితిగతులు క్లిష్ట మగుట ఖేదకరము. నైసర్గిక ఆ ఘాతములు నోర్చుకొనుటకు ఆంధ్రులకున్న సామర్థ్యమును పరిక్షించుటకు పరమేశ్వరుడీ గట్టి నట్లున్నది." అని గుంతకల్లు లలితకళా సంఘము వారి తుపానుబాధిత సహాయనిధి ప్రయత్నమునకు ఆశీస్సుల నంపుచు, రాష్ట్రపతి డా॥ పట్టాభిగారి సందేశమును పంపిరి.

డిసెంబరు 4 వ తేదీ గుంతకల్లులో లలితకళా సంఘము వారి చాచా ప్రదర్శన కళ్యాణ వహించిన, ఎ. రాయప్పగారు ప్రదర్శకుల నభినందించిరి. కవిపుల్లంరాజు గారి బుర్ర కథ, "గుంతకల్లు ఆలిండియా రేడియో పలుకులు" అనెడి వినోదము, శ్రీమతి రామారావు సతీగారి హరికథా గానము మున్నగు కార్యక్రమములతో ప్రదర్శన జరిగెను. పాల్గొన్న వారిలో డా॥ గోవింద రాజులు, సత్యనాధన్, నాగలేయనం, లింగం, రామరావు గార్లుండిరి. మొత్తము రూ. 500 వసూలయ్యెను. (స్వ. వి.)

## తుపాను బాధితులకు వస్త్ర సహాయం

గౌతమీ జీవకారుణ్య సంఘం వారి ఉచిత సేవ

మద్రాసు, డిసెంబరు 9:—రాజమండ్రి శ్రీ గౌతమీ జీవకారుణ్య సంఘంవారు, విజయనగరం ప్రేమసమాజంవారూ కలసి తూర్పుగోదావరి జిల్లా తుని, సత్యవరం, రామభద్రపురం, తుని హరిజనపేట, రామభద్రపురం హరిజనపేట, సత్యవరం హరిజన పేటల్లో తుపాను వల్ల నష్టపోయిన నిరుపేదలకు 1800 పాత బట్టలు కొత్త బట్టలు పంచిపెట్టారు.

గౌతమీ జీవకారుణ్య సంఘం కార్యదర్శి కనకం అప్పలస్వామి, విశాఖపట్టణం ప్రేమ సమాజం ఆర్గనైజింగ్ కార్యదర్శి యస్. ఆదివరాహం, యేలూరి సరయ్య (తుని) గారలుతుపాను బాధితుల సహాయార్థం, మద్రాసు ఆంధ్ర మహిళా సభ వారి సహాయంతో 8000 పాతబట్టలు, కొత్త బట్టలు వసూలు చేశారు. ఈ బట్టలు గౌతమీ జీవకారుణ్య సంఘమునకు మహిళా సభ వారి సహాయముతో పీరు పంపిచేశారు. బట్టలు పంపుట కయిన చార్జీ చాకలిపేట దేవాంగ సంఘం వారు (మద్రాసు) సహాయం చేశారు. ఈ బట్టలు తూర్పు గోదావరిజిల్లా అమలాపురం తాలూకాలో తుపాను బాధితులకు పంచిపెట్టడానికి అప్పలస్వామి గారు యీనాడే మద్రాసు నుండి రాజమండ్రి బయలుదేరి వెళ్లారు.

పీరు విశాఖ జిల్లాలో, యలమంచిలి, సోమలింగపాలెం, మేలుపాక, నామారాయుడుపాలెం, యాతిగిరిపాలెం మొదలయిన గ్రామాల్లో కూడా తుపాను బాధితులయిన నిరుపేదలు 1200 మందికి బట్టలు పంచిపెట్టారు.

### మదనపల్లిలో తుపాను బాధిత సహాయ సంఘం

మదనపల్లి, డిసెంబరు 7: ఆంధ్రదేశ తుపాను బాధితుల సహాయార్థం నిధి సేకరించవలెనన్న ఉద్దేశ్యముతో స్థానిక బిసెంటు థియసాఫికల్ కాలేజి విద్యార్థులు సమావేశమై నొక కమిటిని ఏర్పాటు చేసిరి. దీనికి ఇ. యన్. సుబ్రమణ్యంగారు అధ్యక్షులుగాను, ప్రిన్స్‌పాల్ బి. ఆర్. కుమార్ గారు, కోశాధికారిగాను, టి. నరసయ్య కార్యదర్శిగాను ఎన్నుకొనబడిరి. కమిటీవారు ఈ గ్రామములో నిధి వసూలకు చురుకుగా పనిచేయుచున్నారు. ఇంతవరకు రూ. 700/- వసూలు చేసియున్నారు. (స్వ. వి.)

### గురజాడ పంచాయితీబోర్డు విరాళం

గురజాడ, డిసెంబరు 6: కృష్ణాజిల్లా గురజాడ పంచాయితీబోర్డువారు నేడు గురజాడ రామచంద్రయ్యగారి అధ్యక్షత సమావేశమై రు. 300 తుపాను నిధికి యివ్వటకు తీర్మానంచేసి పంపిరి.

### తుపానునిధికై పంచాయితీ అధికార్ల కృషి

గుడివాడ, డిశంబర్ 7: ఈ జిల్లాలో వున్న పంచాయితీ అధికార్లు వల్లభనేని పిచ్చయ్య, పి. వి. సుబ్బారావు, వై. వి. సుబ్బారావుగార్లు, తుపాను నిధికిగాను యింతవరకు రూ. 10,016/- వసూలుచేసి జిల్లా పంచాయితీ అధికారి డి. వెంకటరత్నంగారి ద్వారా జిల్లా కలెక్టరుగారికి అందచేశారు. పీరు కనీసం రు. 50,000/- లైనా వసూలు చేయుటకు ప్రయత్నం చేస్తున్నారు.

## వస్త్రాల దొంగ వ్యాపారము జరుగలేదు

### సరకు సమృద్ధిగా వుంది

మదరాసు, డిశంబరు 9: కంట్రోలు వస్తువుల కంట్రోలు డైరక్టరు ఎం. ఎస్. శివరామనుగారు నిన్న ఉదయం సుమారు 100 మంది వివిధ మండలాల వస్త్రవ్యాపారస్థులను ఆహ్వానించి, రాష్ట్రంలో వస్త్రాల నిలవ పరిస్థితులు చర్చించిరి. గడచిన 16 నెలలలో వస్త్రములందు దొంగవ్యాపారం జరుగలేదనియు, దాన్ని అరికట్టినసిబ్బంది ఎంతో ఉన్నా ఒక్క కేసు పట్టలేదు కనుక వ్యాపారస్తులను అభినందించిరి. సరకు సమృద్ధిగానున్న యితర రాష్ట్రాలలోగూడ యీ దొంగ వ్యాపారం జరిగినందున, సరకు మిగులుట ఒక్కటే యీపూర్వపు కారణం కాదనిరి, అక్టోబరునుండి మన రాష్ట్రానికి సరకు దిగుమతి తగ్గినదనియు, వ్యాపారస్తులవద్ద చెల్లకుండాపోయిన సరకు భోగట్టా తన కార్యాలయానికి తెలిసినచో అది చెల్లుబడి కాగలచోట్ల వ్యాపారస్తులకు తాము తెలియజేయుదుమనిరి.

వస్తువిక్రయం పన్ను కొనే ప్రజలు చిల్లర వ్యాపారస్తునివద్ద పుచ్చుకున్నప్పుడే వసూలుచేయాలిగాని, సరకు ఎన్ని చేతులు మారునో అన్నిచోట్ల వసూలు చేయరాదని వ్యాపారస్తులు విన్నవించిరి.

## మదరాసు హరిజనుల ఐక్య సంస్థ

చెన్నపట్నం, డిసెంబరు 8:—చన్నపురిలోని ఆంధ్రహరిజన మహాసభ, ఆదిమాంధ్ర మహాసభ, ఆంధ్ర హరిజన సేవా సంఘములు మూడు కలసి 4 తేదీన కృష్ణంపేటలో శ్రీ కొమ్ము రాఘవయ్య గారి అధ్యక్షతను సమావేశమయి, ఒకే ఆంధ్ర హరిజన మహాసభ యుంచుటకు నిశ్చయించి యీ దిగువ కార్యవర్గమును ఎన్నుకొన్నట్లు సందిపోగు వెంకటస్వామిగారు, వ్రాయుచున్నారు:—

అధ్యక్షులు:—సందిపోగు రాఘవులు గారు, ఉపాధ్యక్షులు:—బండారి చిన్న నాగయ్య, చెలికాని వెంకటస్వామి, రొడ్డా తిరుపాలుగార్లు ప్రధాన కార్యదర్శులు — సోమార్పు రాఘవులు, బోడిపోగు చిన్నగోవిందు గార్లు సం॥ కార్యదర్శులు:—

చీకాపల్లి రాజగోపాలం, భూలోకం ఒడిపాలు, నందిపోగు వెంకటస్వామి, గుర్రం వెంకటస్వామిగార్లు, కోశాధికారి;—రొడ్డా పెద్ద కొండయ్య.

## శిస్తుతగ్గింపు చర్య

మదరాసు శిస్తుతగ్గింపు చట్టం ప్రకారం జమీందారీ గ్రామాలందు శిస్తులు తగ్గించు చర్య 1950 మార్చి నరికి పూర్తికాగలదని స్పెషలాఫీసరు ఎన్. కె. చెట్టూరుగారు తెలిపిరి. నవంబరు నరికి 11000 గ్రామాల పని ముగిసిందని, యింకా 11000 గ్రామాలు మిగిలియున్నవనియు చెప్పిరి. శ్రీకాకుళంలో ఆదివసలు స్పెషలు అసిస్టెంటు పని ముగించెను. శివగంగలో, వెంకటగిరిలో పని డిశంబరు అంతానికి ముగియగలదు.

## మునిసిపాలిటీల సలహా సంఘం

సి. ఎస్. రత్న సభాపతిమదల్యారుగారి అధ్యక్షతను సమావేశమయిన పై సంఘ సభయందు మునిసిపలు హెల్తాఫీసరులు మునిసిపలు అధ్యక్షుల అజమాయిషీ క్రింద నుండాలని అభిప్రాయపడిరి. సంఘం తిరిగి జనవరి 4 వ తేదీ సమావేశమగుతు.

## ఉద్యోగులశాఖల మార్పు

మదరాసుప్రభుత్వం ఉద్యోగులుగనున్న వారిని ఒక శాఖనుండి యింకో శాఖకు జిల్లా అధికారులు మార్చుటకు యిదివరకు అవకాశంగలదు. అట్టి మార్పులు దిగువ ఉద్యోగుల గుణగణముల పట్టలు చూడకుండా కూడజరుగుచున్న వను కారణమున అట్లు మార్చరాదనియు, మార్చవలసివచ్చినచో మదరాసు ప్రభుత్వంవారికి వెంటనే తెలుపవలెనని విధించిరి.

## ఉద్యోగ వార్తలు

డాక్టర్ యస్. జె. ఆదినారాయణ రాజు యం. బి. బి. యస్. శ్రీ జె. తిమ్మారెడ్డికిబదులు మదరాసు సిటీ పోలీసు మెడికల్ ఆఫీసరుగా నియమించబడిరి.

డా॥ జె. తిమ్మారెడ్డి యం. బి. బి. యస్. కడపజిల్లా మెడికల్ ఆఫీసరుగా నియమించబడిరి.

కృష్ణాజిల్లా డిప్యూటీ కమర్షియల్ టాక్సు ఆఫీసరు శ్రీ ఇ. వేణుగోపాల రాయడు తాత్కాలికముగా గుంటూరు జిల్లా కమర్షియల్ టాక్సు ఆఫీసరుగా నియమించబడిరి.

శ్రీ హెచ్. సి. యం. మాక్‌బాలిక్ శెలవునుండి రాగానే చిత్తూరు జిల్లా కలెక్టరుగా శ్రీ యస్. సుబ్రహ్మణ్యం ఐ. సి. యస్. స్థానే నియమించబడిరి.

## బాలికపై అత్యాచారం

### హిందూపూర్ సమీప గ్రామంలో నలుగురి అరెస్టు

హిందూపురం, డిశంబరు 5: స్థానిక పోలీసుసర్కిలు ఇన్‌స్పెక్టరు జనాబ్ అబ్దుల్ సత్తారుసాహేబ్‌గారు శనివారం నాడు భూమయ్యగారిపల్లె వాస్తవ్యులైన నలుగురిని అరెస్టుచేసి ఇచటికి తెచ్చిరి. వీరు మరి ఏడుగురితో చేరి నవంబరు 27 తేదీరాత్రి పైపల్లెలో 17 ఏండ్లబాలికను ఆమెయింటినుండి బలాత్కారముగ ఎత్తుకొనిపోయి, ఆమెను ఆమె వక్షస్థలమునకు మున్నగురాచి, వుల్లిపాయలపొరయును జేసి తలపైముందు భాగమున కొన్ని కేశములు కత్తిరించి, గాడిదపై కూర్చుండబెట్టి, తప్పెటకొట్టించుచూ, కాగడాలతో గ్రామములో ఊరేగించినారట. ఆరుండు రాత్రి వారిలో ఒకడు ఆమెను బలవంతపర్చగా ఆమెనిరాకరించినదట. అందుపై ఆమెను వారు పైవిధముగా హింసించినారట. తర్వాత వారామెను బాసుగకొట్టి నిర్బంధములోవుంచి 28 వ తేదీ మధ్యాహ్నమప్పటికి వదలినారట.

మ్యాచిలిమఠ్ పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు జాన్ వాషింగ్టను 28వ తేదీ ఆగ్రామమునకువెళ్లి దర్యాప్తు మొదలుపెట్టిరి. ఇప్పుడు సర్కిలు ఇన్‌స్పెక్టరు జనాబ్ అబ్దులుసత్తారు సాహేబ్‌గారు దర్యాప్తు సాగించుచున్నారు. అరెస్టుఅయినవారు నల్గురుమినహా మిగిలిన ఏడుగురు పత్తాలేదని తెలియుచున్నది. నిందితులచే హింసింపబడిన ఆ బాలిక స్థానికగవర్నమెంటు ఆసుపత్రిలో చికిత్సపొందుచున్నది.

## పట్టపగలు ఖూనీ

### ఆరుగురి అరెస్టు

అమలాపురం, డిశంబరు 5: అమలాపురమునకు ఆరుమైళ్ల దూరములోనున్న ముంగండ గ్రామములో నవంబరు 21 తేదీ ఉదయం ఏడుగంటలకు మట్టపర్తి రామమూర్తి అనే అతనిని ఖూనీచేసిరి. ఈ సందర్భములో 6 గురు అరెస్టు చేయబడి కొత్తపేట సబుజైలుకు పంపబడిరి. చంపిన కత్తి, మరి ఆయుధములు ప్రక్కనున్న నూతిలో పడవేయగా పోలీసులు వాటిని వెలికి బయటకు తీసిరి.

## పసుల సాగరం హత్యకేసు విచారణ

ఏలూరు, డిసెంబరు 7: "ఒక దుష్టుని ద్వారా నేనీ ప్రతిఫలము పొందుట భగవంతుని ఇచ్ఛమాత్రమే. భగవానుడాతనిని క్షమించుగాక. అతడు సన్మార్గగామియై మానవసేవ జేయుగాక. ఇంతకన్న నే నేమియూ చెప్పగోరను. మనమందరమూ చిరకాలముగా కోరినట్లు, భారతదేశము దక్షిత, సామర్థ్యములతో పరిపాలింపబడుగాక.

1941 సత్యాగ్రహోద్యమములో కారాగార శిక్ష ననుభవించినట్టియూ, కొంతకాలము మద్రాసు శాసనసభా సభ్యునిగా పనిచేసినట్టియూ, కీ. శే. పసుల సాగరంగారు తమ అంత్య సందేశముగా నుడివిన పై వాక్యములు, నిన్న ప. గోదావరిజిల్లా సెషన్సు జడ్జీగారి ఎదుట, భీమవరం మ్యునిసిపల్ ఎలక్షన్ హత్యకేసు విచారణ సందర్భంలో, ప్రాసిక్యూషన్ కథనసందర్భంలో తెలుపబడినాయి. ఈ కేసులో ప్రాసిక్యూషన్ కథనము ఈక్రిందివిధంగానున్నది.

నిందితుడైన కేంద్ర నరసింహామూర్తి, మరణించిన పసుల సాగరంగారు, పాల సోమన్న అను మరొకరూ, సెట్టిబలిజకులానికి చెందినవారున్నూ, భీమవరం సమీపంలో ఉన్న చినరంగనిపాలెం గ్రామ కాపురస్తులున్నూయై యున్నారు. మరణించిన పసుల సాగరంగారు తమ వర్గంలో అత్యధికమైన పలుకుబడి గల్గిన వ్యక్తి. గత జూలైలో జరిగిన భీమవరం మ్యునిసిపల్ ఎన్నికలలో నిందితుడు నరసింహామూర్తి, వసర్ల సుబ్బారాయుడు, 10-వ వార్డుస్థానానికి పోటీ చేశారు. వీరిద్దరుగాక పాల సోమన్న కూడా ఆ స్థానానికే, మరణించిన సాగరంగార్లు నిలబెట్టి, అతని పక్షాన పనిచేశారు. అందువలన సుబ్బారాయుడు గెలవడం, నిందితుడు ఓడిపోవడం జరిగింది. నిందితుడు ఓడిపోవడానికి కారణం, సాగరంగారు, నిందితుని వర్గానికి, ఆగ్రామానికి చెందిన మరోవ్యక్తి చేతకూడా, ఆ వార్డుకే పోటీ చేయించడంవల్ల నిందితునికి రావలసియుండిన వోట్లలో కొన్ని సోమన్నకు పడడంవల్ల, తానోడిపోయానని నిందితుడు భావించి, ఈ ఓటమికి కారకుడైన సాగరంగారిపట్ల ద్వేషభావం వహించాడు. 14 జూలై రాత్రి 2 గం 30 ని లకు సాగరంగారు చినరంగనిపాలెంలో తన యింటి అరుగుమీద నిద్రిస్తుండగా, నిందితుడు ఆయనను కత్తితో అనేకచోట్ల పొడిచి గాయపర్చాడు. అతడు పారిపోతూండగా పట్టుకోవడానికి తరిమిన మల్లుల రామస్వామినికూడా నిందితుడు పొడిచి సామాన్యంగా గాయపర్చాడు. సాగరంగారు మరునాడు ఉదయం భీమవరం ఆస్పత్రిలో పై గాయాలవల్ల చనిపోయారు. చనిపోయే ముందు వారు పై నుదహరించిన కొలది వాక్యములుమాత్రము మరణ వాఙ్మూలం క్రింద చెప్పి ప్రాణాలు విడచారు. వారి ఎడమ చేయి నరకబడినందున, మరణ వాఙ్మూలముకు కుడిచేతి బొటనవ్రేలి ముద్ర వేశారు.

ఈ కారణాలవల్ల నిందితునిపై హత్య చేసినందుకు ఘాతము చేసినందుకు ఐ. పి. సి. 302, 324 సెక్షనులక్రింద కేసు మోపబడింది.

ప్రాసిక్యూషన్ తరపున పశ్చిమ గోదావరి జిల్లా పబ్లిక్ ప్రాసిక్యూటరు శ్రీ వి. రామారావుగారు, నిందితుని తరపున గుంటూరు వీరరాఘవులుగారు పనిచేస్తున్నారు. విచారణ కొనసాగుచున్నది. స్వ. వి.

## బొగ్గురవాణా సెస్సు తగ్గించరాదు

### సలహాసంఘమువారి నిర్ణయములు

నాగపూర్, డిశంబరు 8: బొగ్గుగనుల నుండి రైలుమీద రవాణా యగుచున్న బొగ్గుపై యిప్పుడున్న నిధి, ప్రతిటన్నుకు అరణాల సెస్సును తగ్గించుట తను, కొంతమాత్రమును సమ్మతము కాదని బొగ్గుగనుల కార్మిక క్షేమనిధి సలహాసంఘమువారు నేడు ప్రకటించిరి. సెస్సు తగ్గించినయెడల కార్మిక క్షేమనిధి కార్యకలాపములకు అంతరాయము కలుగునని సభవారు చెప్పిరి.

ఈ సంఘసభ కార్మికశాఖ కార్యదర్శి శ్రీ ఎస్. లాల్ అధ్యక్షతను జరిగెను.

భారత ప్రభుత్వ న్యాయకర్తృత్వ విధానమునకు అనుగుణముగా తాము తెనుఖర్చును తగ్గించుకొనవీలులేదని అభిప్రాయమును సంఘమువారు వెల్లడించిరి. కార్మిక క్షేమనిధి గృహనిర్మాణ కార్యక్రమమును గృహనిర్మాణసంఘ పరిశీలనకు పంప సభవారు నిర్ణయించిరి. 1950-51 లో 119 లక్షల ఖర్చుతో గృహనిర్మాణము గావింప సంఘమువారు సంకల్పించుచున్నారు.

బొగ్గుగనుల ప్రాంతములో ఆసుపత్రులను నిర్మింపవారు సంకల్పించుచున్నారు.

సి. పి. బొగ్గుగనులలో జరుగుచున్న సాంఘిక విద్యాపథకమునకు గ్రాంటు యివ్వ సభవారు అంగీకరించిరి. ఎంత గ్రాంటు యివ్వవలెనో రాబోవువారపు సంఘసభయం సమావేశములో నిర్ణయించెదరు. డాల్టన్‌పట్టణమును, ప్రాంతీయ ఆసుపత్రిని నిర్మింపవలెనని, అచ్చట నీటిసరఫరా పరిస్థితిని విచారించవలెనని సి. పి. ప్రభుత్వమును కోర సంఘమువారు నిశ్చయించిరి. కార్మికుల స్నానమునకు లోట్లు కట్టించుటవిషయమై గనబాబు బొగ్గుగనుల యజమానులతో రాయబారములు జరుపవలెనని సంఘము వారు ధనబాదు బొగ్గుగనుల కార్మిక క్షేమ కమిషనరును కోరిరి. బొగ్గుగనుల కార్మికులకు సౌకర్యములు కలిగించుటకు గాను యెంతద్రవ్యము కావలెనో ప్రతిదానికి విడివిడిగా తెలుపవలెనని కూడ సంఘముమరు కమిషనరును కోరరి. సంఘమువారు మరల ధనబాదులో జనవరి మాసాంతమున సమావేశమగుదురు.

## రాష్ట్రకాంగ్రెస్ క్రమశిక్షణ చర్యా సంఘము

విజయవాడ, డిశంబరు 7: ఆంధ్ర రాష్ట్రకాంగ్రెసు కార్యవర్గమువారు ఈ మధ్య జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు వారిక్రమశిక్షణ చర్యలను విచారించుటకై నియమించిన ప్రత్యేక సంఘమువారు డిశంబర్ 21 నుంచి 29 వరకు రాష్ట్రములో పర్యటన చేయుదురు.

పర్యటన వివరములు:- కాకినాడలో డిశంబర్ 21 నుంచి 23 వరకు ఏలూరులో డిశంబరు 24-25, బందరులో డిశంబరు 26, 27, విజయవాడ 28-29.

## స్థానికసంస్థల పర్యవేక్షణ సంఘం

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గము నియమించిన స్థానిక సంస్థల పర్యవేక్షణ సంఘమువారు డిశంబర్ 11 నాడు సమావేశమై ఆయా సంస్థల కాంగ్రెసుసభ్యుల భవిష్యత్కార్యక్రమములకు సంబంధించిన సూచనలను చేయుదురు. జిల్లా బోర్డు యొక్క, పురపాలక సంఘములయొక్క అధ్యక్షులు ఈ సమావేశమునకు హాజరగుదురని తెలియుచున్నది.

## కలకత్తా వైద్యదళంవారికి విందు

విజయవాడ వస్త్రవర్తకుల సంఘాధ్యక్షులైన శ్రీ పచ్చిపులుసు సుబ్బారావు, కలకత్తా మార్వాడీసహాయ సంఘమువారు తుపాను ప్రాంతములో చికిత్సా కేంద్రములను నెలకొల్పుటకు పంపిన వైద్యదళము వారికి నిన్న సాయంత్రము అల్పాహార విందును చేసిరి. స్వ. వి.

### సి. ఎస్. కొఠారిగారు

సి. ఎస్. కొఠారి ఏం. ఎల్. ఏ. గారు, మదరాసు షెరీఫ్ లండనులో అంతర్జాతీయ స్టాక్ మార్కెట్టు పెంపు సంఘం సభ్యులుగ ఎన్నుకోబడిరి.

## భారత భూభాగంపై పాకిస్థాన్ దాడ్లు

### 16 మంది భారతీయుల మరణం

సిమ్లా, డిసెంబరు 8: 1949 జనవరి లగాయతూ, నవంబరువరకూ, అనగా 11 నెలల్లోనూ, పడమటి పంజాబునుంచి పాకిస్థానీ గుండెగులు, తూర్పు పంజాబుపై 50 సార్లు దాడులు జరిపారు. ఈ దాడుల మూలంగా 16 మంది భారతీయ పౌరులు నల్గురు పోలీసులు సహా మరణించారు. 700 పశువులు అపహరింపబడినవి. 12మంది భారత పౌరులనుగూడా దుండగులు అపహరించుకొని వెళ్లారు.

## అట్లీతో పాకిస్తాన్ కాశ్మీర్ మంత్రి సమాలోచన

లండన్, డిసెంబరు 8: పాకిస్థాన్ ప్రభుత్వ కాశ్మీర్ వ్యవహారాల మంత్రి, నవాబ్ ముస్తాక్ అహమ్మద్ గుర్మనీ, శుక్రవారంనాడు నెం. 10 డౌనింగ్ వీధి భవనంలో బ్రిటిష్ ప్రధాని అట్లీని కలుసుకొని మాట్లాడుతాడు.

## శ్రీమతి రాజం భారతి ఎన్నిక రద్దు

చెన్నపట్నం, డిశంబరు 9: గత సంవత్సరమున కార్పొరేషనుకు పురుశవాక్కం నుంచి ఎన్నికగాంచిన శ్రీమతి భారతి గారి ఎన్నిక క్రమబద్ధముగా జరుగలేదనే కారణమున ఆ ఎన్నిక చెల్లదని రద్దుచేస్తూ స్మాల్ కాజ్ కోర్టుయిచ్చిన తీర్పునే అప్పీలులో హైకోర్టు న్యా॥ బాలకృష్ణఅయ్యర్ గారు యీనాడే ఖాయపరచిరి.

## శిక్ష తగ్గింపు

చెన్నపట్నం, డిశంబరు 9: కమ్యూనిస్టు వాలంటీరుదళం సభ్యులుగా నుండి సభలు పరేడులు జరుపుటయు తేపల్లి తాలూకా కొల్లపల్లి కోనయను గ్రామమున వ్యవసాయ కూలీలను సమ్మెచేయమని ప్రోత్సహించిరను నేరముకై శ్రీ యస్. వెంకట రమణయ్యకును మరి 17 మందికి తెనాలి సబ్ డివిజనలు మేజిస్ట్రేటు 6 మాసముల కఠినశిక్ష విధించియుండెను. ఆ శిక్ష సెషన్సు కోర్టులో ఖాయమయ్యెను.

శిక్షితులు హైకోర్టులో అపీలు దాఖలు చేయగా న్యా॥ పి. యస్. పి. అయ్యర్ గారు శిక్షను 6 నెలలనుండి ఒక మాసమునకు తగ్గిస్తూ తీర్పు చెప్పిరి.

## 'ఆరుద్ర దర్శనం'

చిదంబరంలో ఆరుద్రదర్శనానికి యీ నెల 20 జనవరి రేలోపుగా పోయిన యాత్రికులందరు టీకాలు వేయించుకొని సర్టిఫికెట్లు వెంటతీసుకపోవాలని అధికారులు ప్రకటించుచున్నారు.

### దేశీయ వైద్యుల మహాసభ

మదరాసులో దేశీయవైద్య పాఠశాల రజతోత్సవంతోపాటు 19 వ రాష్ట్రఎల్. ఐ. ఎం. ల మహాసభ జనవరి 22, 23 తేదీలందు జరుపుటకు ఆహ్వాన సంఘం వారు ఏర్పాటుచేసిరి.

### చెరుకు పంటదారుల సభ

మదరాసు గోఖలేహాలులో డిశం 15 తే ని 9 గ. లకు ద. ఇ. చెరకుపంట దారుల 6 వ వార్షిక సభ జరుగును. సి. కె. నాగరాజుగారు అధ్యక్షత వహింతురు. వ్యవసాయ శాఖమంత్రి ఎ. వి. శెట్టిగారు ప్రారంభోత్సవం జరిపెదరు.

విదేశాలకు స్కాలరు షిప్పుపై చదువుకు పోయిన ప్రభుత్వోద్యోగులు తమ సెలవు జీతాలను ఇండియాలో రూపాయినాణెముల రూపమునే పుచ్చుకో వాలని మదరాసు ప్రభుత్వంవారు నిర్ణయించిరి.

## తమిళనాడు కాంగ్రెసు కార్యవర్గ విరాళము

మదరాసు, డిశంబర్ 9: ఇటీవల తుపానువలన నష్టపడిన ఆంధ్రులపట్ల సానుభూతి తెలుపుచు తుపానుబాధితుల సహాయ నిధికి తమిళనాడు కాంగ్రెసు కార్యవర్గము వెయ్యి రూపాయలు విరాళము ఇచ్చుటకు తీర్మానించెను.

### ఆంధ్ర తుపాన్ బాధితుల సహాయ నిధికి వసూళ్లు

కలకత్తా, డిసెంబర్ 7: శ్రీ కె. వి. వి. సూర్యనారాయణ, డి. వి. రామారావు, వి. వి. చెయిసులు, సి. సి. సుబ్రహ్మణ్యం వి సుబ్రహ్మణ్యంగారలు కలసి ఆంధ్ర తుపాను బాధితుల నిధికి వసూళ్లు చేయుటకు కృషి చేయుచున్నారు.

### బాధితులకు వస్త్రదానం

రాజమహేంద్రవరం, డిశంబరు 6: ఇచ్చటి జీవకారుణ్య సంఘంవారు, విజయనగరం ప్రేమసమాజంవారు కలసి యీ నెల 2, 3, 4 తేదీలలో తుని, రామభద్రపురం, సత్యవరం ప్రాంతములలో నిరుపేదలైన వరద బాధితులకు సుమారు 1100 వస్త్రములు దానముచేసిరి. (స్వ. వి.)

## ఆంధ్ర విశ్వకళా పరిషత్తు అభివృద్ధి

### స్నాతకోత్సవ సమయాన ఉపాధ్యక్షుని సమీక్ష

రామలింగారెడ్డిగారి సేవా ప్రశంస

వాల్తేరు, డిసెంబరు 10: ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు డా॥ వి. ఎస్. కృష్ణగారు నేటిఉదయం విశ్వవిద్యాలయ స్నాతకోత్సవ సమయంలో ప్రసంగిస్తూ త్వరలో ఏర్పడనున్న ఆంధ్రరాష్ట్రమును గురించి ప్రస్తావించి, ఆగస్టు 15 వ తేదీ ఎంత చారిత్రాత్మకమైన దినమో ఆంధ్ర రాష్ట్ర ప్రారంభోత్సవదినముకూడ అంత చరిత్రాత్మకంగా వెలుగగలదన్నారు.

ఈ మహోత్కృష్ట సమయమున ఉత్తమ రాజనీతి కుశలతను ప్రదర్శించిన తమ నాయకులనుజూచి ఆంధ్ర మహాజనులు గర్వించుట సమంజసమేయైయున్నదన్నారు.

గత సంవత్సరంలో విశ్వవిద్యాలయ కార్యక్రమాన్ని సమీక్షచేస్తూ, సంస్థ అభివృద్ధికి పాటుబడిన డా॥ సి. ఆర్. రెడ్డిగారికి జోహారులర్పించారు. రెడ్డిగారు మొదటిసారి ఉపాధ్యక్షులుగానున్నప్పుడు సంస్థకొక రూపం కల్పించారనీ, రెండవసారి అనగా 1936 నుండి ఉపాధ్యక్షులుగా నున్నప్పుడు విశ్వవిద్యాలయానికి, దీనికంటె యింకాముందు స్థాపించబడిన సంస్థలు అసూయపొందగల, విశిష్టమైన స్థానం లభించిందనీ అన్నారు.

నూతన ప్రభుత్వం యీ విశ్వవిద్యాలయ స్థాయిని బలపరచుటకు తగుచర్యలు తీసుకోగలదని విశ్వసిస్తున్నా నన్నారు. కృష్ణగారు ఉపన్యాసమును ముగిస్తూ, యితర విశ్వవిద్యాలయముల విషయమై కూడ విచారించవలసియున్నదను నెపమున ప్రభుత్వం యీ విశ్వవిద్యాలయంయొక్క కోరికను నిరాకరించరాదనే అభిప్రాయము వెల్లడించారు.

## ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుని ఎన్నిక

సీతాపతిరావుగారిదానా్త్రోసివేత

విశాఖపట్నం, డిసెంబరు 9: ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా డా॥ వి. ఎస్. కృష్ణగారి ఎన్నికను అక్రమంగా ప్రకటించి, ఆయన డిసెంబరు 8 నుండి ఉద్యోగాధికారమును చలాయించకుండా ఆపు చేస్తూ, ఇంజక్షను జారీ సయ్యవలెనని ఆంధ్రవిశ్వవిద్యాలయ సెనేటుసభ్యులు పి. సీతాపతిరావుగారు విశాఖజిల్లా మునసబుకోర్టులో దాఖలుచేసిన దావాను జిల్లామునసబు జె. వీరభద్రరావుగారు నేటిసాయంకాలం త్రోసి వేశారు.

## రేడియో ప్రోగ్రాములు

డిసెంబరు 12 సోమవారం.

### మద్రాసు (ఎ)

ఉ. 7-30 చెల్లం వేణుగోపాల 5 పాట. 8 ఆంగ్లమున వార్తలు. 8-15 ఉదయసంగీతం (రి). 8-30 మద్రాసు (బి) వలె. మ. 1-30 ఆంగ్లమున వార్తలు. 1.40 సినిమా సంగీతం (రి). 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు ఆంగ్లమున. 4-30 పాశ్చాత్య సంగీతం(రి) సా. 5-30 కమలా రాణీ సుందరం పాట. 6 ఆంగ్లమున వార్తలు. 6-20 జె. నాగరాజారావు వీణ. 7-30 గీతమంజరి (రి) 7-45 జంత్రవమేళనం. 8 మద్రాసు (బి) వలె. 8-30 మోసూరు ఎం. కృష్ణమూర్తి పాట. 9 ఆంగ్లమున వార్తలు. 9-15 మద్రాసు(బి) వలె. 10 సినిమాపాటలు రికార్డులు.

### మద్రాసు (బి)

ఉ. 7 తెలుగున వార్తలు. 7-15 సేలం డి. చెల్లమయ్యంగార్ రికార్డులు. 7-45 మద్రాసు (ఎ) వలె 8-30 ఎం. కె. ప్రసన్నకుమారన్ పాట. మ 12 కార్మికుల కార్యక్రమం. 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు ఆధునిక గద్యరీతులు. కొమర్రాజు లక్ష్మణరావు ప్రసంగం. బృందగానం సెయింట్ రాఫెల్స్ బాలికోన్నత పాఠశాల. 1-30 మద్రాసు (ఎ) వలె. 1-50 తెలుగున వార్తలు. 2-15 మద్రాసు (ఎ) వలె. 4-0 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు వృక్షశాస్త్రము వాణిజ ప్రసంగం. జి. బి. భైరవభోట్లు గద్యకథ. శిష్యుడు. వ్యాయామ పాఠాలు. టి. దేవిక్. సా. 5-30 మద్రాసు (ఎ) వలె. 6-20 సాయం సంగీతం (రి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం వ్యవసాయదారునికి సలహాలు దుంపకూరల పెంపకం. ప్రసంగం. ఫిల్ము రికార్డులు. 7-0 తెలుగున వార్తలు 7-15 సంస్కృతి. ఆంతర్వాహినులు. గ్రీకు సంస్కృతి. ప్రసంగం. ఇక ముందున్నది. బాపిరాజు సేమం. 8-0 ఎస్. వంజులం పాట. 8-30 మద్రాసు (ఎ) వలె. 9-15 చలికాలపు రాత్రి ఉహా చిత్రము. 10-0 మద్రాసు (ఎ) వలె.

### విజయవాడ

ఉ. 7-0 తెలుగు వార్తలు. 7-15 ఎం. ఎస్. సుబ్బులక్ష్మి రికార్డులు. 7-30 పి. అన్నపూర్ణ, వీణ. 8-0 ఆంగ్లమున వార్తలు 8.15 గీతావళి ప్రకాశగిరి లక్ష్మీనారాయణశాస్త్రి. 8-30 కార్యక్రమ సమాప్తం. మ. 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు. 1-0 తారావళం (రి) 1-30 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగున వార్తలు. 2-15 ఉన్నతపాఠశాలా విద్యార్థులకు, 4-0 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు. సా 5-30 పి. అన్నపూర్ణ వీణ 6 ఆంగ్లమున వార్తలు 6-2 గీతావళి ప్రకాశగిరి లక్ష్మీనారాయణశాస్త్రి 6-30 గ్రామస్థుల కార్యక్రమం. (మద్రాసు నుండి) 7 తెలుగున వార్తలు 7-30 చిత్రవాణి (రి). 7-45 పరస్పర సహకారము ఆహార పదార్థముల అధికోత్పత్తి ప్రసంగం కె. రామసుబ్బయ్య. 8 వరిజే సుబ్బారావు వయొలిన్ 8-30 నాళం వనజా గుప్త పాట. 9 ఆంగ్లమున వార్తలు 9-30 వరిజే సుబ్బారావు వయొలిన్.

### హైద్రాబాదు

ఉ 7-30 శ్రీనర్ సింగ్ ఖయాల్ లలిత్. 7-45 తుమ్రియాజ్ రికార్డులు. 8 ఆంగ్లమున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) 8-50 వి. ఆర్. ధనం కర్నాటక సంగీతం 8-20 తెలుగున వార్తలు 9-15 నరహరి రావు భజన్. మ. 12-30 గీత్ రికార్డులు 1 ఎస్. సి. వసంతకోకిలం రికార్డులు 1-30 ఆంగ్లమున వార్తలు 1.50 తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) సా 5. శ్రీనర్ సింగ్ ఖయాల్ గౌడ సారంగ్ 5-10 తిజ్వార్ సుల్తానా ఘజల్ గీత్ 5-20 నరహరి రావు. మరాఠీపదం భజన్ 5-35 షేక్ దావూద్ తబలా. 6-30 పిల్లల కార్యక్రమం. తెలుగున మునిజీ ల్లాలు "సల్పర్గా" ప్రసంగం. "వెంకయ్య నాకరి" నాటిక. 7 తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే). 7-15 గ్రామస్థుల కార్యక్రమం తెలుగున. సహకారసంఘాలు (4) అనుభోక్తదారుల సహకారము ప్రసంగం. ఎ. నాగభూషణం బృందగానం. 7-55 నరహరిరావు భజన్. 8-30 తిజ్వార్ సుల్తానా గీత్. 8-40 వి. ఆర్. ధనం కర్నాటక సంగీతం. 9, ఆంగ్లమున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే). 9-15 శ్రోతల పరిచయం. 9-25 శ్రీనర్‌సింగ్ ఖయాల్ శంకర్. 9-55 శ్రోతలు కోరిన హిందుస్థానీ రికార్డులు.

## ఆముదార్లంక హత్యా కేసు

### దివితాలూకా సబ్ మేజస్ట్రేటుగారిచే 11 మంది స్వాధీనం

బందరు, డిసెంబరు 8: గతవారం దివితాలూకా ఆముదార్లంకలో వేములపల్లి వెంకటనారాయణ హత్యకేసులో ముద్దాయి అయిన వెంకటేశ్వర్లు చంపబడియుండెను. ఆ హత్యకేసులో ముద్దాయిలైనట్టి వేములపల్లి వెంకటసుబ్బయ్య, మండవ పరంధామయ్య మరి తొమ్మండుగురు మొత్తం 11 మంది దివితాలూకా సబు మేజస్ట్రేటుగారిచే స్వాధీనమైనారని తెలియుచున్నది. (స్వ. వి.)

## కమ్యూనిస్టు అరెస్టు

బందరు, డిశంబరు 8: పామర్రు పోలీసు డివిజన్‌లోని కమ్యూనిస్టు కేసులలో కావలసియుండి పరారిలో ఉన్న నిడుమోలు గ్రామస్థుడు గుడిపాటి సత్యనారాయణ అను కమ్యూనిస్టు గూడూరుకద్ద పటానిపేటలోని హరిజనుని యింట్లో యున్నాడని తెలిసి స్థానిక పోలీసు సర్కిల్ ఇన్‌స్పెక్టరు జె. శ్రీరాములు, సబు ఇన్‌స్పెక్టరు యం. బి. ప్రసాదరావుగారు బందోబస్తుతో పటానిపేట చేరుటతోడనే సత్యనారాయణ పారిపోవ ప్రయత్నించెను. పోలీసులు అతనిని తరిమి పట్టుకొని అరెస్టుచేసి బందరుకు తీసుకొని వచ్చిరి. (స్వ. వి.)

## పెనుకొండ బోర్డు హైస్కూలు విద్యార్థులకు జిల్లాబోర్డు అధ్యక్షుని హితవు

పెనుకొండ, డిసెంబర్ 8: అనంతపురం జిల్లా బోర్డు అధ్యక్షులు కె. వి. వేమారెడ్డి గారు కె. శ్రీనివాస రెడ్డి పి. అప్పిరెడ్డి గారలతో కలసి నిన్న యిక్కడకు వచ్చారు. సాయంకాలం స్థానికబోర్డు హైస్కూలులో వేమా రెడ్డిగారి అధ్యక్షతను బహిరంగ సభ జరిగెను. అధ్యక్షులు స్థానిక పౌరులచే హైస్కూలుకు బహూకరించబడిన రేడియోను ప్రారంభించి, విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనకుండా విద్యయందే మనస్సు లగ్నంచేసి క్రమ శిక్షణతో వర్తించవలెనని హితవొసంగారు. హరిజన విద్యార్థులకు వస్త్రములు పంచి పెట్టబడెను. చేకూరు రంగారావుగారు మాట్లాడుచూ బీద బాలుర నిధికై జిల్లా బోర్డు వారు కూడ తగు ద్రవ్య సహాయం చేయ్యవలెనని కోరారు. పాఠశాలలో ప్రస్తుతం 550 మంది విద్యార్థులున్నారనీ, తగినంత స్థలము లేక చాల యిబ్బంది పడుచున్నామనీ, యీ విషయం పై పుర ప్రముఖులు జిల్లా బోర్డు వారు తగు శ్రద్ధ తీసుకొనవలెనని విజ్ఞప్తి జేశారు. వందనసమర్పణతో సభముగిసింది.

## విశాఖపట్నానికి గవర్నరు ఆగమనం

విశాఖపట్నం, డిసెంబర్ 9: మదరాసు గవర్నరు భావనగర్ మహారాజా, వారి సతీమణి నేటి ఉదయం సపరివారంగా విమానంలో ఇక్కడకువచ్చారు. ఈ సందర్భానికి తగినట్లుగా విమానాశ్రయం అందంగా అలంకరింపబడింది. గవర్నర్ దంపతులు విమానందిగుతుండగా జనగణమనగీతం వాద్యములపై ఆలాపింపబడింది.

జిల్లాకలెక్టర్ డి. పద్మనాభన్ (ఐ. సి. ఎస్.) వారి సతి గవర్నరుగారికి స్వాగతమిచ్చారు. ప్రత్యేక సాయుధపోలీసులు గౌరవవిన్యాసంచేశారు. తెన్నేటి విశ్వనాథంగారు గవర్నరుగారికి, కలెక్టరుగారి సతి భావనగర్ మహారాణికి పూల దండలు వేశారు. నౌకాధికారి గౌలండ్స్, విమానాశ్రయాధికారి ఎ. కె. ముఖర్జీ, కురుపం రాజా, ఎమ్. పట్టాభిరామిరెడ్డి, కె. వీరభద్రరావు, వి. జె. గుప్త, జిల్లా జడ్జి ఎ. వి. భానోజిరావుగార్లు గవర్నరుగారికి పరిచయంచేయబడ్డారు. తర్వాత గవర్నరు పరివార సహితులై విశ్రాంతి మందిరానికి వెళ్ళారు. స్వ. వి.

### ఆస్పత్రి పనివారు

ప్రభుత్వాస్పత్రులు పనివారిసభ ఎస్. వకీరుస్వామి పిళ్లెగారి అధ్యక్షతను 10 తే. సా 6 గ. వర్నెను ట్రెయినింగు స్కూలు ప్రక్కన జరుగును. ఎం. సీతారామ నాయుడు, జి. రాజమన్నారు మున్నగు వారుపన్యసింతురు.

### వివాహం

డా॥ శ్రీ వేపా రామేశంగారి మనుమరాలు సౌ. లలితాకుమారిని శ్రీ డా॥ జయంతి చినకామేశ్వరరావు (హైదరాబాదు)గారి కుమారుడు నరశింహరావునకిచ్చి మైలాపూరులో రామేశంగారి యింటియందు వివాహం 8 తేదీ ఉదయం కడువైభవంగా జరిగింది.

## ప్రభుత్వం నెలకొల్ప నున్న ఉక్కు పరిశ్రమలు

న్యూఢిల్లీ, డిసెంబరు 6: నేడు పార్లమెంటులో పరిశ్రమల, సప్లయి మంత్రి డా॥ శ్యామ ప్రసాదముఖర్జీ, జక్. శేసిధ్వా ప్రశ్నకు సమాధానంగా ప్రభుత్వం నెలకొల్ప సంకల్పించిన ఉక్కు పరిశ్రమలను గురించి ఈ కింది వివరాలు తెలిపారు:

ఒరిస్సాలో నూ, సి. పి. లో నూ భారత ప్రభుత్వంవారు ఒక్కొక్క ఉక్కు ఉత్పత్తి చేసే ఫాక్టరీ నిర్మించ సంకల్పించారు. ఒక్కొక్క ఫాక్టరీ కింద 90 కోట్లు ఖర్చవుతుంది! ఏటా 5 లక్షల టన్నుల ఉక్కు ఒక్కొక్క ఫాక్టరీలోనూ ఉత్పత్తి అవుతుంది. ప్రస్తుత ఆర్థికపరిస్థితి బాగులేదు కనుక ప్రభుత్వంవారు సి. పి. లో ముందుగా ఫాక్టరీ నిర్మించవలదారు. ఈ ఫాక్టరీల విషయమై సలహా ఇచ్చిన వారికి ప్రభుత్వం ఉలకు లిచ్చింది.

## మిగిలిపోయిన మిలిటరీ సరుకు

సిధ్వావేసిన మరొక ప్రశ్నకు సమాధానంగా డా॥ శ్యామప్రసాదముఖర్జీ ఈ కింది వివరాలిచ్చారు.

1951 మార్చి నాటికి మిగిలి పోయిన మిలిటరీ సరుకు యావత్తూ చెల్లు అయి పోయి ఈ డిపార్టుమెంటునూ సివేయ బడుతుంది. ఈ సరుకును ప్రభుత్వ శాఖలకూ, పరిశ్రమలకూ సరిగా పంచడానికి ప్రభుత్వం శ్రద్ధతో పనిచేస్తున్నారు. ఈ యేడు జనవరిలగాయతు అక్టోబరు ఆఖరు వరకూ 24కోట్ల 81లక్షలు విలువగల సరుకులు 10 లక్షలకు అమ్ముడు పోయినవి. 15కోట్లు ఖరీదు చేసే బ్రిటిషు సరుకులు, భారతీయ సరుకులు 7కోట్ల 95 లక్షలకు అమ్ముడయినవి. 9కోట్ల 97 లక్షల విలువగల అమెరికను సరుకు 1 కోటి 20 లక్షలకు అమ్ముడు పోయింది. 1944 అక్టోబరు నుంచి అమ్ముడైన సరుకు విలువ 171 కోట్ల 67 లక్షలు అమెరికను సరుకు 240 కోట్లు. ఇది అంతా 127 కోట్ల 5 లక్షలకు అమ్ముడయింది.

ఇంకా దిగబడిఉన్న బ్రిటిషు సరుకు, భారతీయ సరుకు విలువ 76 కోట్లు, అమెరికను సరుకు విలువ 26 కోట్ల 82 లక్షలు. తాతా కంపెనీ ద్వారా అమ్ముడు కానున్న అమెరికను సరుకుల విలువ 41 కోట్ల 89 లక్షలు.

## ఈ యేడు ఉత్పత్తులు

మరొక ప్రశ్నకు సమాధానంగా డా॥ ముఖర్జీ ఈ యేడు భారతీయ ఉత్పత్తులను గురించి ఈ కింది వివరాలిచ్చారు:—

1949 మొదటి 9 నెలల కాలంలో ఉక్కు, సిమెంటు, కాగితం, అట్ట, డీజల్ ఇంజన్లు, హరికేను లాంతర్లు, కుట్టుపని యంత్రాల ఉత్పత్తి హెచ్చి నూలు బట్ట, యంత్ర పరికరాలు, సైకిళ్లు, కొన్ని మందులు, రసాయనాలు మొదలైన వాటి ఉత్పత్తి పడిపోయింది. ప్రతి పరిశ్రమకు వర్కింగు పార్టీలు ఏర్పరచి 1950 కి ఉత్పత్తి ప్రమాణాలు నిర్ణయించవలసిందని పరిశ్రమల కేంద్ర సలహా సంఘంవారు చేసినశిఫార్సును ప్రభుత్వంవారు ఆమోదించి అమలుజరుపుతున్నారు.

## ఇతరప్రశ్నలకు సమాధానాలు

మరొకప్రశ్నకు సమాధానంగా డా॥ అంబేద్కరు లిఖితపూర్వకంగా, యూనియనులో చేరేసంస్థానాలలోని హైకోర్టులలో ప్రాక్టీసుచేసే అడ్వోకేట్లను ఎన్రోలుచేసుకొనడానికి వీలుగా నిబంధనలని మార్చమని ఫెడరల్ కోర్టువారికి విజ్ఞాపన చేయబడిందన్నారు.

ఉల్లిపాయలు మిరపకాయలు మొదలైనవాటిపై కంట్రోలు తొలగించబడలేదుగాని ఒకపరిమితి దాటేవరకూ ఏటి ఎగుమతులు సాగనివ్వవచ్చునని ఉత్తరువు జరిగిందని వాణిజ్యమంత్రి కే. సి. నియోగి అన్నారు.

యుద్ధం ముగిసినవెంటనే ఇండియానుండి పర్షియన్ గల్ఫుకూ, పాకిస్థానుకూ, ఆఫ్ఘనిస్థానుకూ, నేపాలుకూ చక్కెర ఎగుమతి కాసాగిందనీ 1947-48 లో 7,614 టన్నులూ, 48-49 లో 15,169 టన్నులూ ఎగుమతిఅయిందనీ నియోగి తెలిపారు.

## మదరాసు వార్తలు

### మైలాపూరు 'తోటబడి' హేమంతోత్సవం

మైలాపూరు చిల్డ్రన్సుగార్డెను స్కూలునందు హేమంతోత్సవము 10 తేది సా. 5-7 గం. మధ్య జరుగును. బాలబాలికల వినోద కార్యక్రమములు 10, 11 తేదీలందు జరుగును. వచ్చేడబ్బు పాఠశాల భవనమునకు వినియోగించబడును.

ఎగ్మూరులో శ్రీనివాస పెరుమాళు గోపుర మహాద్వారప్రతిష్ఠ సర్ సి. పి. రామస్వామయ్యంగారు 8 తే ఉదయం జరిపిరి.

## ఆంధ్ర హరిజన సేవక సంఘం

### జిల్లాసంఘాల అధ్యక్ష కార్యదర్శుల నియామకం

విజయవాడ, డిసెంబర్ 8: ఆంధ్ర హరిజనసేవక సంఘపు కార్యక్రమాన్ని ఆంధ్రదేశంలోని వివిధ జిల్లాలలో కొనసాగించుటకు ఎస్. బాపినీడుగారు ఈ క్రిందివారిని జిల్లా సంఘముల అధ్యక్ష కార్యదర్శులుగా నియమించారని రాష్ట్ర సంఘ కార్యదర్శి వేముల కూర్మయ్యగారు తెలియజేస్తున్నారు.

ఉత్తర విశాఖ: ఆర్. రామమూర్తి (అధ్యక్షుడు, చికాకోల్) బి. కూర్మన్న (కార్యదర్శి, చికాకోల్). దక్షిణవిశాఖ: పి. వీరభద్రస్వామి (అ. విజయనగరం). తూ. గోదావరి: పైడా వెంకటనారాయణ (అ. కాకినాడ) కె. కేశగోపాచారి (కా. కాకినాడ). ప. గోదావరి: దొమ్మేటిపల్లి వీరభద్రరావు (అ. పెప్పర) టి. ఎస్. కుటుంబశాస్త్రి (కా. నిడదవోలు). తూర్పు కృష్ణా: మాగంటి అంకినీడు (అ. గుడివాడ) జి. బసవయ్య (కా. గుడివాడ). పశ్చిమ కృష్ణా: డా॥ జి. సీతారామశర్మ (అ. విజయవాడ). గుంటూరు: పుతుంబాక శ్రీరాములు (అ. తెనాలి) సి. సూర్యనారాయణ (కా. గుంటూరు). నెల్లూరు: కె. వణమ్మగం (అ. నెల్లూరు) ఇ. పట్టాభిరామిరెడ్డి (కా. నెల్లూరు). చిత్తూరు: టి. కె. టి. తాతాచారి (అ. చిత్తూరు) అంజనేయులు (కా. చిత్తూరు). అనంతపురం: కల్లూరి సుబ్బారావు (అ. హిందూపూర్). కర్నూలు: ఎస్. నాగప్ప (అ. కర్నూలు).

కడప, బళ్లారి జిల్లాల అధ్యక్ష కార్యదర్శుల పేర్లు త్వరలోనే ప్రకటింపబడతాయి.

## జనపనారపంట అభివృద్ధి మార్గం

### ప్రభుత్వప్లానులు: దతార్ సింగ్ వివరణ

కటక్, డిసెంబరు 8: "ప్రస్తుతం మన దేశంలో జనపనారపంటను పండించే ప్రధానరాష్ట్రాలు నాలుగున్నవి. అవి పడమట బెంగాల్, బీహార్ ఒరిస్సా అస్సాంరాష్ట్రాలు. త్రిపుర కూచ్ బీహార్ కొచ్చిన్ తిరువాన్కూర్ సంస్థాన యూనియన్ యు. పి. రాష్ట్రాలలో గూడా కొత్తగా నారపంట పండింపబడుచున్నది. 1951-52 సంవత్సరానికల్లా దేశంలో సాలీనా 65 లక్షలబేళ్ల నారను ఉత్పత్తిచేసి నార ఎగుమతి వ్యాపారంలో స్వయం సమృద్ధిగా ఉండాలని ప్రభుత్వ సంకల్పం" అని, భారత ప్రభుత్వ వ్యవసాయశాఖా సహాయ కార్యదర్శి సర్దార్ దతార్‌సింగ్ వెల్లడించాడు.

ఈయన, యిప్పుడు నారపంట పండించే రాష్ట్రాలలో పర్యటిస్తున్నాడు. యు. పి. బీహార్ రాష్ట్రాలలో పర్యటన ముగించుకొని, యీయన యీవేళ ఒరిస్సా వచ్చాడు. ఒరిస్సాలో నారపంట పండే ప్రాంతాన్ని విస్తరింపచేసే విషయమై ఒరిస్సా ప్రభుత్వోద్యోగులతో దతార్ సింగ్ యీ ఉదయం చర్చించాడు.

దేశంలో నారపంట అభివృద్ధిని గురించి చెబుతూ దతార్‌సింగ్ యిలా అన్నాడు. తిరువాన్కూర్‌లో నారపంట జయప్రదమైంది. ఈ యేడు 400 ఎకరాలలో నార పండింపబడింది వచ్చేయేడు 24000 ఎకరాలలో నారపంట వేయబడును. నార పంటపండే భూమి స్వీర్ణం యు.పి.లో యీ యేడు 5 వేలనుంచి 13 వేలకు పెరిగింది. వచ్చేఏడు 60 వేల ఎకరాలకు పెంచాలని సంకల్పం. ఒరిస్సాలోనూకూడా 23 వేల ఎకరాలనుంచి 51 వేల వరకూ పెంచబడింది.

నారపంట అభివృద్ధివల్ల ఆహారపంటల అభివృద్ధికి దెబ్బ గలకుండా జాగ్రత్త తీసుకొంటూనే ఉన్నాము. ఇక పొలంలో రెండవపంటగాగాని, లేక కొత్తగా సాగుకు తెచ్చిన భూములలోగాని నార పండింపబడుతూంది. నారపంట అభివృద్ధి రవాణా రాకపోకలకేట్ల ననుసరించి జరగాలి. త్రిపుర కూచ్‌బీహార్‌లనుంచి నార, విమానాలలో, కలకత్తాకు రవాణాచేయబడుతుంది."

నారపంటలో స్వయం స్వమృద్ధికి సంబంధించిన ప్రభుత్వ ప్లానుల విషయమై డిసెంబరు 14 న కలకత్తా సమావేశంలో చర్చింపబడును.

## పేరుమోసిన దొంగ జైలునుండి పలాయనం

ఏలూరు, డిసెంబరు 7: ఈ జిల్లాలో పేరుమోసిన నేరస్థుడు, అనేకసార్లు జైళ్ళకువెళ్లినవాడు అయిన షేక్ దావూద్ గత రాత్రి స్థానిక సబ్-జైలునుండి తప్పించుకుని పారిపోయాడు. జైలుగది కటకటాలను విరగగొట్టి ఇతడు తప్పించుకున్నాడు. ఏలూరులో జరిగిన కొన్ని దొంగతనాల సందర్భంలో ఇతడు అరెస్టుచేయబడినాడు. (స్వ. వి.)

# హైద్రాబాద్ కేంద్ర ఇంజనీర్ల సంఘ వార్షిక సభ

## వెల్లోడీ ప్రారంభోత్సవం

హైదరాబాదు, డిసెంబర్ 8: "ఇక్కడ నేను ఉన్న ఇంతికాలం నా కప్పగించబడిన బాధ్యతలను సక్రమంగా నిర్వహించుటకు శక్తివంచనలేకుండా ప్రయత్నించగలను. దీనికి ప్రజలలో అన్ని వర్గాలవారి సహకారం అవసరం. ప్రజలనుండి యిటువంటి సహకారంతోను, భారతసంస్థాన శాఖాధికార్ల, ముఖ్యంగా సర్దార్ పటేల్ వంటి రాజనీతిజ్ఞుని మార్గదర్శకత్వముతోను నా బాధ్యతలను నిర్వహించగలనని ఆశిస్తున్నాను." అని హైదరాబాదు ప్రధాన మంత్రి యం. కె. వెల్లోడీగారు నేటి ఉదయం అఖిల భారత ఇంజనీర్ల సంఘ హైదరాబాదు కేంద్ర వార్షిక సమావేశమును ప్రారంభిస్తూ అన్నారు. ప్రధాన మంత్రి పదవి స్వీకరించిన అనంతరం వెల్లోడీగారు చేసిన ప్రథమ ఉపన్యాసం యిదే. ప్రస్తుతం హైదరాబాదు పబ్లిక్ వర్క్సు మంత్రిగానున్న నవాబ్ జైన్ యార్ జంగ్ బహదూర్‌తోటి తనకు లండన్‌లో పరిచయమైనదనీ, అప్పుడు ఇండియా ప్రభుత్వం తను నిర్దరినీ లండనుకు రాయబార వర్గసభ్యులుగా పంపిందని అన్నారు. తిరిగి వారిని యిక్కడ కలుసుకొన్నందుకు హర్షం వెలిబుచ్చారు. తర్వాత ప్రధాన మంత్రి యితర దేశాల అభివృద్ధి ఆ యా దేశాలలోని ఇంజనీర్లు నిర్వహించిన పాత్రను విశదీకరించారు. భారతదేశంలోని ఇంజనీర్లు నిర్వహించిన పాత్ర తక్కువైనది కాదు. తాను జీవితరంగంలో ప్రవేశించునప్పుడు ఇంజనీరింగు శాఖలోని ప్రధాన స్థానాలన్నిటిలోను ఇంగ్లీషువారే ఉన్నారనీ, ఇప్పుడు అన్ని రాష్ట్రాలలోను ఉన్న ఇంగ్లీషు ఇంజనీర్లు బహు కొద్ది మంది అనీ వెల్లోడీగారన్నారు.

ప్రస్తుతం ఇంజనీరు శాఖలలోని అన్ని పదవులలోను భారతీయులే ఉన్నారు. వారు తమ బాధ్యతలను సక్రమంగా నిర్వహించగలరని ఆశిస్తున్నానన్నారు. తాను యిక్కడకు వచ్చిన కొత్తలోనే, నిజాం సంస్థాన రైల్వే ఇంజనీరు షెగాల్ హత్య చేయబడినందుకు ప్రధానమంత్రి విచారం వెలిబుచ్చారు. ఈ ఇంజనీర్ల సంఘంవారు తనకింది ఉద్యోగులకు అన్ని విధాలా సహాయపడగలరని ఆశిస్తున్నానన్నారు.

హైద్రాబాద్ ఇంజనీర్ల సంఘ అధ్యక్షపదవినుండి విరమిస్తున్న ఎ. ఇ. ఎల్. శాలిన్సగారు ప్రధానమంత్రికి, తదితర ప్రముఖులకు స్వాగతంచెప్పి, ఇంజనీర్లు హైద్రాబాద్ ప్రభుత్వంలో అన్నివిధాలా సహకరించగలరన్నారు. మేజర్ జనరల్ చౌధరీగారు వేసిన పునాదులమీద సంస్థానాభివృద్ధికి కృషిచేయగలరని నమ్ముతున్నామన్నారు.

గౌరవకార్యదర్శి ఎన్. మహాలింగం గారు వార్షిక నివేదిక చదివారు.

నూతన సంవత్సరానికి అధ్యక్షులుగా ఎన్నుకొనబడిన మంజీరాలోయ అభివృద్ధి కమిషనరు డా॥ జె. సి. హార్డికార్ గారు ప్రసంగిస్తూ, ఇంజనీరుశాఖను నాలుగు ప్రధాన భాగాలుగా పునర్నిర్మాణం చెయ్యవలెనని అన్నారు.

# పెట్రోల్ రేషనింగ్

## స్టెర్లింగ్ ప్రాంతాలన్నింటిలో అమలుచేయకతప్పదు

లండన్, డిసెంబరు 8: స్టెర్లింగ్ ప్రాంతంఅంతటిలోను పెట్రోలు రేషనింగ్ అమలుజరపక తీరదని నేడు సర్ స్టాఫర్డ్ క్రిప్సు పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ అన్నారు.

స్టెర్లింగ్-డాలర్ సమీకరణాన్ని గూర్చి ఆయన ఈ సందర్భంలో మాట్లాడారు. పెట్రోలుల గూడా కొంతడాలర్ విలువ వుంది. అందువల్ల మనం అదనంగా వాడుతున్న ప్రతిగాలను పెట్రోలులోను కొంత డాలర్ విలువనుకోల్పోతున్నాము. అంటే దేశానికి ముఖ్యంగా అవసరమైన ఆహార ధాన్యాలు మొదలైనవి కోల్పోతున్నామన్నమాట అని ఆయనఅన్నాడు.

స్టెర్లింగు ప్రాంతంలో నూనెలు, పెట్రోలువిషయంలోగూడా డాలర్లను పొదుపుచేయగలిగే విధానాన్ని అమలుజరిపేపక్షంలో అది ఋజువుగాను, సర్వసమ్మతంగానూ అమలు జరుగుతుందని వ్యాఖ్యానించారు.

పౌనువిలువ తగ్గించినతరువాత బ్రిటిష్ సరకులు విదేశవిపణులలో పోటీకి నిలబడుతున్నాయని, అక్టోబరులో డాలర్ ప్రాంతానికి ఎగుమతులు పూర్వంకన్నా 30% హెచ్చాయని అయినా విలువతగ్గింపువల్ల మారకంరేటులో వచ్చిన తేడాను సర్దుబాటు చేయడానికి ఇది చాలదని సర్ క్రిప్సు అన్నారు.

# మైసూరులో స్వాభివృద్ధి కార్యక్రమం

## ప్రభుత్వవిధానం: ప్రధాని వివరణ

బెంగుళూరు, డిసెంబరు 8: అవసర ధాన్యాలను పండించడానికిగాను మైసూరు సంస్థానం చెరువుగావున్న భూములను వ్యవసాయం చేయడానికిగాను సైన్యం సహాయం చేయనున్నట్లు మైసూరు ప్రధాని శ్రీ కె. సి. రెడ్డి పత్రికా విలేఖరులతో అన్నారు.

బుల్‌డోజర్లు, ట్రాక్టర్లు ఉపయోగించి అరణ్యభూములను సాగులోకి తీసుకురావడానికి సైన్యంయొక్క సహాయాన్ని అర్థించుచున్నామని ఆయన అన్నారు.

మెల్‌బోర్న్, డిసెంబరు 8: సంవత్సరాలుగా ఆస్ట్రేలియాలో అధికారంలో వున్న లేబరుపార్టీ, అధికారంలోవుండేది లేక ఇంకోపార్టీ అధికారంలోకి వచ్చేది రేపు తేలిపోతుంది.

రేపటిరోజున రెండు సభలకూ ఎన్నికలు జరుగుతాయి. ఇంతటి తీవ్రమైన పోటీతో ఎన్నికలు జరగడం ఆస్ట్రేలియా చరిత్రలో ఇదే ప్రథమం. కార్మికపక్షంవారు నమ్మకంగావున్నారు. అంతకంటే నమ్మకంగా వారి ప్రతిపక్షులు వున్నారు.

ప్రజాభిప్రాయ నిర్ణయంగా తీసుకొన్న పోలింగులలో లేబరుపార్టీకి 48% ఓట్లుమాత్రమే వచ్చాయి.

అయినా ప్రతినిధి సభలో తమకు మెజారిటీ వస్తుందని వారు అంటున్నారు.

ఆస్ట్రేలియా ఓటింగు ప్రపోర్షనల్ రిప్రజెంటేషన్ పద్ధతిమీద జరుగుతుంది సెనెట్ సభ్యులను గూడా ఈ సందర్భంలోనే ఎన్నుకుంటారు. రాష్ట్రానికి 7 గురు చొప్పున మొత్తం 42 మంది సెనెటర్లను ఎన్నుకోవాలి.

## మైసూరు మంత్రుల జీతముల తగ్గింపు

బెంగుళూరు, డిసెంబరు 8: ఇండియా ప్రభుత్వమువారి వ్యయకర్తన విధానమునకు అనుగుణముగా తమ జీతములలో 100కి 10 వంతులు ఐచ్ఛికముగా తగ్గించుకొనుటకు మైసూరుమంత్రులు అంగీకరించిరని మైసూరు ప్రధాని శ్రీ కె. సి. రెడ్డిగారు నేడుచెప్పిరి. ఇండియా ప్రభుత్వ వ్యయకర్తన విధానమును మైసూరు ప్రభుత్వోద్యోగులకు యేంతవరకు వర్తింపజేయ వీలునో ప్రభుత్వమువారు విచారించుచున్నారనియు, ప్రస్తుత పరిస్థితులనుబట్టి తాము నిర్ణయము గావింపవలసి యున్నదనియు శ్రీ రెడ్డిగారు చెప్పిరి.

# దక్షిణాఫ్రికా ప్రపంచ ధిక్కారవైఖరి

## మలాన్ ప్రభుత్వ విధానాన్ని విమర్శిస్తూ స్మట్సు ప్రకటన

జోహాన్సుబర్గ్, డిసెంబరు 7: "దక్షిణాఫ్రికా యూనియన్ అంతర్జాతీయంగా పెనుతుపాను పెనుగొన్నకలిసిన స్థితి వచ్చింది. ఈ తుపాను మేఘములు యిప్పుడిప్పుడే కమిమూడుతున్నవి. ప్రపంచాభిప్రాయాన్ని తృణీకరించి ప్రపంచానికంతకూ కోపకారణమైన దక్షిణాఫ్రికాకు ఆరుద్ధంవాటిల్లే సూచనలు కన్పిస్తున్నవి" అని దక్షిణాఫ్రికా మాజీ ప్రధాని జనరల్ స్మట్సు, మలాన్ ప్రభుత్వ విధానాన్ని విమర్శిస్తూ అన్నాడు. యునైటెడ్ పార్టీ కాంగ్రెస్ సమావేశాన్ని ప్రారంభిస్తూ జనరల్ స్మట్సు యిలాఅన్నాడు.

ప్రధాని మలాన్, నేను దక్షిణాఫ్రికా యూనియన్ విచ్ఛిన్నం చేస్తున్నానని నిందించాడు. కాని, విదేశాలలో ప్రజలకు నేనెటువంటివాణ్ణో యిది తెలుసు. వ్యక్తులపై నిర్దాక్షిణ్యంగా దాడిచేయడం సాగుతుండడంమూలంగా, విదేశాలలో, దక్షిణాఫ్రికా నేషనలిస్టు పార్టీ యొడ అనుమానం పుట్టింది. దీనికి, పత్రికావార్తలపై సెన్సార్ గూడ తోడైంది.

నైరుతి ఆఫ్రికాను దక్షిణాఫ్రికాతో కలుపుకొనుట మలాన్ ప్రభుత్వం నిశ్చయించడాన్ని స్మట్సు విమర్శించాడు.

# రష్యాలో అణుప్రేలుడు

లండన్, డిసెంబరు 7: పర్వతాలను కదలించడానికి, నదులగతులుమార్చడానికి రష్యా అణుశక్తిని ఉపయోగిస్తున్నదని వైషిన్‌స్కీ చేసిన ప్రగల్భప్రసంగాన్ని ఒక రష్యన్ ఇంజనీరు ఖండించినట్లు బెర్లిను నుంచి వచ్చినవార్తలవల్ల తెలుస్తున్నది.

బెర్లిన్‌లోవున్న సోవియట్ రష్యా సాంస్కృతికకేంద్రంలో మాట్లాడుతూ అటామిక్ శక్తి రష్యాకువున్నమాట నిజమే అయినా, ఇప్పటివరకు అది సంకల్పమాత్రంగానే వుందనీ ప్రజేసేల్ అనే రష్యన్ ఇంజనీరు అన్నారు.

# శాంతినికేతనమహాసభ తుది సమావేశం

శాంతినికేతనం, డిసెంబర్ 8: అంతర్జాతీయ శాంతివాదుల తుది సమావేశం ఈ మధ్యాహ్నం "అమరకుంజం"లో జరిగింది. సమావేశానికి శాంతినికేతనంలోవుంటూన్న పచ్ఛాత్రు లందరూ హాజరు కావటానికి అనుమతి నిచ్చారు. ఈ సమావేశానికి అధ్యక్షత వహించిన జి. రామచంద్రన్ ఇలా ప్రసంగించారు.

'ఇది బహిరంగసమావేశం కాకపోయినా, ఢిల్లీ పాల్గొనటానికి, ఇక్కడికి వచ్చిన ప్రతినిధు లందరికంటే శాంతి నికేతనం సభ్యాధ్యాపకులు, ఉపాధ్యాయులు మొదలైన కాక్కుల అన్నయే.

'ఇక్కడికి 4 దశాబ్దాలక్రితమే మహాకవి రవీంద్రులు ఇక్కడ మానవత్వ దృక్పథానికి ప్రథమ బీజాలు చల్లారు' అన్నారు.

అనంతరం, ఫ్రాన్సు, చైనా, దక్షిణాఫ్రికా, ఫిన్‌లాండ్, అమెరికా ప్రతినిధులు ప్రసంగించారు.

ప్రతినిధులతరపున అమెరికా ప్రతినిధి రేమ్యాల్టన్ శాంతినికేతనం వారికి కృతజ్ఞతాభివందనాలు తెలియజేశారు.

ప్రతినిధులంతా రేపటిదినం చిన్న చిన్న దళాలుగా చీలి శాంతినికేతనంనుంచి బయలుదేరతారు.

ఈ సాయంత్రం జరిగిన సమావేశంలో, రివరెండ్ ఫ్రీక్ ఆండ్రూస్ గారి స్మారక చిహ్నంగా నిర్మించిన దీనబంధు భవనానికి అగథా హారిసన్ శంకుస్థాపనోత్సవం చేశారు. వివిధ వక్తలు ఆండ్రూస్ గారి సేవాచరిత్రను అభినుతించారు. అనంతరం, 'నేను శిలువను చూచినప్పుడు' అన్న ఇంగ్లీషు గేయాన్ని ప్రతినిధులంతా కలిసి పాడారు. ఈ గేయాన్ని తనకు పాడి వినిపించమని, గాంధిజీ ఆండ్రూస్ గారిని పదే పదే అడుగుతూవుండేవారట.

అనంతరం జరిగిన ప్రత్యేక సమావేశంలో స్వీడన్ ప్రతినిధి ప్రొఫెసర్ రిడ్ బెల్ "శాంతి-శాస్త్రీయవిజ్ఞానం" అనే విషయాన్ని ప్రతిపాదించుచూ ఇలా ప్రసంగించారు.

"మానవుని స్వజనాశక్తినీ, దౌర్భాగ్యాన్నీ అరికట్టడానికి సాధకొకమేమి లేదు. వాటినిచూచి గాబరాపడవలసినఅవసరంకూడా లేదు. ఉన్న సమస్య అల్లా వాటిని యేదే ప్రయోజనాలకు వినియోగించాలన్నదే. "సాంస్కృతిక జాతీయత" అనేది చాలా ప్రమాదకరమైన నినాదం. తమ యుద్ధసన్నాహాల నన్నిటినీ సమర్ధించుకోవటానికి జర్మన్ శాస్త్రవిజ్ఞానవేత్తలు ఈ నినాదాన్నే వాడారు. తక్కిన దేశాలన్నిటికంటే సాంస్కృతికంగా తాము చాలా గొప్పవాళ్ళ మనుకున్నారు. ఈనాడు రష్యా పరిస్థితులుకూడా ఇలాగే వున్నాయని నా భయం. శాస్త్రవిజ్ఞానవేత్తలకు శాంతిమార్గాలలో తగిన శిక్షణ వుంటేగాని వారు తమపైన ప్రయోగించే వత్తిడికి సహించి స్థైర్యంగా నిలబడలేరు. నన్ను మటుకు నన్ను, యుద్ధతరుణంలో, శబ్దసంచలనమాత్రం చేతనే పీలే మందు గనిని తయారు చేయమని వత్తిడి చేశారు. నేను అందుకు అంగీకరించలేదు. శాస్త్రవిజ్ఞానంయొక్క మహత్తర శక్తులన్నిటినీ, కిరాతపు పనులకు ప్రయోగించే సావకాశం చాలావుంది అలాగే జిగిలేని అల్పవాగర శతలనుకూడా దుష్టార్యాలకు ప్రయోగించవచ్చు. మనం ఆధారపడదగినదల్లా మానవ సౌశీల్యం ఒక్కటే. బ్రహ్మాండంలోవున్న ప్రాథమిక శక్తులన్నిటితోనూ మనకుసాన్నిహిత్యాన్ని కలిగించి మనకు ప్రపంచ దృక్పథాన్ని కలిగించిన శాస్త్రవిజ్ఞానం, ప్రపంచశాంతికి పరమసాధనంగా పరిణమించవచ్చు. ప్రపంచంలోవున్న దారిద్ర్య బాధనంతా తుడిచివేయగల మహత్తరమైన శక్తి శాస్త్రవిజ్ఞానానికి వుంది. ఈ నవీన ప్రపంచం, కేవలం నిరాశాజనకమైన పరిస్థితిలో ఉన్న దనుకోవటానికి ఆస్కారమే లేదు' అన్నారు.

అనంతరం చైనా ప్రతినిధి ప్రొఫెసర్ క్వేంగ్ ప్రసంగించుచూ శాస్త్రవిజ్ఞానవేత్తలకు ఆధ్యాత్మిక దృక్పథం లేకపోవటంవల్ల చాలా ప్రమాదాలు కలుగుతున్నాయని విమర్శించారు.

అమెరికా ప్రతినిధి ఎ. మస్టీగారు యూర్‌స్టిన్ వ్రాసిన ఒక లేఖను ఇలా చదివి వినిపించారు. "శాస్త్రవిజ్ఞానపసమైక్య ప్రయత్నంవల్ల పెద్ద ప్రయోజనం వుంటుందని నాకు తోచదు. ఎందుచేతనంటే, ఇది అసలు సాంకేతిక పరిజ్ఞానానికి సంబంధించిన సమస్యగాదు. ఇది కేవలం రాజకీయ సమస్య." ఆ లేఖను పురస్కరించుకొని ప్రసంగించుచు మస్టీ, 'శాస్త్రవిజ్ఞానవేత్తలు తమకు వుండే మహత్తరమైన బాధ్యతలను గుర్తించకుండా ఒకొక్కప్పుడు చాలా కుర్రతనంగా ప్రవర్తిస్తారన్నారు.

అనంతరం, ఫిన్‌లాండ్, స్విట్జర్లాండ్, జపాన్ ప్రతినిధులు ప్రసంగించటంతో ఆ సాయంత్రం సమావేశం ముగిసింది.

గురువారం ఉదయం తీర్మానాలు తయారుచేయటానికిగాను నియమింపబడిన ప్రత్యేకసంఘాల సమావేశాలు జరిగినై. సాయంత్రం జరిగిన సమావేశంలో, ప్రత్యేకసంఘాల అధ్యక్షులు, ఈ ప్రత్యే-

కసంఘాలు తిరిగి తమ కార్యక్రమాన్ని క్రిస్టమస్‌లో సేవాగ్రాంలో జరుగనున్న సమావేశాల తరుణంలో ప్రారంభించుతాయని తెలియజేశారు.

ఈ సమావేశానికి, పశ్చిమ బెంగాలు గవర్నర్ కైలాసనాథకట్జూ ప్రారంభోపన్యాసంచేశారు. ఈ సమావేశంలో వివిధ దేశాల ప్రతినిధులు వివిధ విషయాలను గురించి ప్రసంగించిన అనంతరం, అధ్యక్షత వహించిన రామచంద్రన్‌గారు, 'గాంధిజీ రూపంలో ప్రాచ్యఖండం పశ్చిమ ఖండదేశాలకు ఒక మహత్తరమైన ఆధ్యాత్మిక సందేశాన్ని అందజేస్తోందన్నారు.' రేపటినుంచీ ప్రతినిధులంతా చిన్న చిన్న దళాలుగా విడిపోయి భారతదేశమంతా పర్యటించుతారు. తిరిగి డిసెంబర్ 24 వ తేదీన సేవాగ్రాంలో కలుసుకొని తుది సమావేశాలు ప్రారంభించుతారు.

# బల్గేరియా మాజీ మంత్రుల కుట్రకేసు

## విచారణలో నేరాంగీకారం

సోఫియా, డిసెంబరు 8: సోఫియా కుట్రకేసులో ముద్దాయిలు నేడు తాము నిజంగా దేశద్రోహం చేశామని ఒప్పుకుంటూ, నిన్న టిరోజున ప్రైచోవ్ కొస్టావ్ చేసిన ఆరోపణల నన్నింటిని ఖండించారు. కొస్టావ్ పూర్వం బల్గేరియాకు ఉపప్రధానిగా వుండేవాడు.

తామే కాకుండా కొస్టావ్‌గూడా బ్రిటిష్ ఏజంట్లుగా పనిచేశామని వారు నేడు ఒప్పుకున్నారు.

ఈ ముద్దాయి, ఇవాన్ స్టెఫనోవ్, (పూర్వం ఆర్థికమంత్రి) నికోలావ్ పెట్రోవ్ (కొస్టావ్ మంత్రివర్గంలో ఇంకోమంత్రి) బోరిస్ క్రిస్టోవ్ (సోవియట్ యూనియన్‌లో వాణిజ్య ప్రతినిధి) అనేవాళ్లు.

సోవియట్‌కు వ్యతిరేకంగా వుండే అన్ని పథకాలను బయట పెట్టవలసిందా తన్ను కొస్టావ్ బలవంతం చేసాడని, అట్లా చెప్పనితరుణంలో 1948 లో గూఢచారిగా నేను పనిచేసినట్లున్న కాగితాలను బయట పెట్టగలనని బెదిరించాడని క్రిస్టోవ్ చెప్పాడు.

టిటో సహాయంతోను, బ్రిటిష్ గూఢచారిదళం సహాయంతోను, కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెస్‌ను ఆక్రమించుకోవాలని, కొత్త నాయకులను ఎన్నుకోవాలని, అందుమూలంగా పార్టీని, ప్రభుత్వాన్ని మార్చాలని కుట్ర ఒకటి పన్నబడినట్లు, స్టెఫనోవ్ చెప్పాడు. కాని ఆ పథకం దెబ్బతినడంవల్ల, తాను, కొస్టావ్ బయట పడిపోయినామని అతడు అంగీకరించాడు.

పెట్రోవ్ తాను 1941 లోనే బ్రిటిష్ ఏజంటుగా పోయినట్లు ఒప్పుకున్నాడు. తరువాత కోర్టును వాయిదా వేశారు.

# కామన్వెల్తు సభ

ఒటావా, డిసెంబరు 8: జనవరి 9 వ కొలంబో (సింహళం) లో జరిగే కామన్వెల్తు విదేశ మంత్రుల సమావేశానికి కెనడా నుండి విదేశ వ్యవహార మంత్రి లెస్టర్ బెర్ పియర్సన్ నాయకత్వం కింద 12 మంది వస్తున్నారు. వీరిలో డేవిడ్ జాన్సన్ (కొత్తగా పాకిస్తానులో ఏర్పాటు చేయబడిన కెనడా హై కమిషనరు,) చేపల పరిశ్రమ మంత్రి ఆర్. ఎం. మెహూల్య కూడా ఉన్నారు.

కెనడా, పాకిస్తాను, ఇండియా, సింహళాల మధ్య వ్యాపారం అభివృద్ధి జరిగే అవకాశాలను చర్చించడానికి కెనడా వాణిజ్య శాఖ యొక్క ఉన్నతోద్యోగి ఒకడు కూడా వస్తున్నాడట.

చైనా కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని గుర్తించడం గురించీ, జపాను సంధి ఒడంబడిక గురించీ, ఆగ్నేయాసియా పరిస్థితి గురించీ, కామన్వెల్తు ఆర్థిక, వాణిజ్య విషయాలను గురించీ సమావేశంలో చర్చలు జరుగుతవని కెనడా వారు భావిస్తున్నారు.

కొలంబో సమావేశానికి ముందుగా మైసూరులో జరిగే అంతర్జాతీయ కార్మిక కార్యాలయ పాలక సంఘం వారి సమావేశంలో మెహూల్య పాల్గొంటారు.

కొలంబోకు పోయే దారిలో కెనడా ప్రతినిధి వర్గంవారు కరాచీని న్యూఢిల్లీని చూస్తారు. వారు యూరపు, మధ్య ప్రాచ్యాల మీదుగా వస్తారు. దారి పొడుగునా వారు వాణిజ్య సంప్రతింపులు జరపగోరుతున్నారు.

## బ్రిటిషు ప్రతినిధి వర్గం

లండను, డిసెంబరు 8: జనవరి 9 న జరిగే కొలంబో సమావేశానికి హాజరయే, బ్రిటిషు ప్రతినిధుల పేర్లు నేటి రాత్రి లండనులో ప్రకటితమైనవి.

ప్రతినిధి వర్గానికి నాయకుడు బ్రిటిషు విదేశ కార్యదర్శి బెవిన్, కామన్వెల్తు సంబంధాల, కార్యదర్శి ఫిలిప్ నోయెల్ బేకర్, ఆగ్నేయాసియాలో బ్రిటిషు కమిషనరుగా ఉన్న మాల్కొమ్ మక్డొనాల్డు, సింహళంలో బ్రిటిషు హై కమిషనరుగా ఉన్న సర్ వాల్టర్ హాకిన్సన్‌లు ప్రతినిధి వర్గంలో ఉంటారు. బ్రిటిషు విదేశ, కామన్వెల్తు సంబంధాల, ఖజానా, బోర్డాఫ్ ట్రేడ్ శాఖల సలహాదార్లు కూడా ప్రతినిధి వర్గం వెంట వస్తారు.

# అంతర్జాతీయ పోటీ కార్మిక ఫెడరేషన్

## ప్రాంతీయ వ్యవస్థలు నెలకొల్ప నిర్ణయం

లండన్, డిసెంబరు 8: కమ్యూనిస్టు ప్రాబల్యంగల ప్రపంచ ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్‌కు పోటీగా ఏర్పడిన అంతర్జాతీయ స్వతంత్ర కార్మిక సంఘ ఫెడరేషన్ ప్రాంతీయ సంస్థలు నెలకొల్పుటకు నేడిక్కడ నిశ్చయించినది. ప్రాంతీయ సంస్థల ఆవశ్యకతను వివరిస్తూ హిందూ మజ్దూర్ సభ ప్రతినిధి జి. డి. మెహతా చేసిన ప్రతిపాదనను ఫెడరేషన్ ఆమోదించింది. ప్రాంతీయవ్యవస్థలు కొత్త ఫెడరేషన్‌కి ప్రపంచమంతటా పలుకుబడిని సంపాదించి పెట్టగలవని మెహతా అన్నాడు.

"రాజకీయంగా కమ్యూనిస్టు, ప్రజాస్వామిక దేశాలని రెండు రకాలు ఉన్నట్లే ఆర్థికంగా కూడా అభివృద్ధిచెందిన దేశాలు వెనకబడ్డదేశాలు అని రెండు రకాలు ఉన్నవి. ఈభిన్నభిన్న ప్రాంతాలఅవసరాలకు తగినట్లు ప్రాంతీయ సంస్థలకు అంతర్జాతీయ సంస్థలనెలకొల్పాలి. అమెరికా, స్కాండినేవియా, బెనెలక్స్ దేశాలలో ఉన్న సంస్థలకు ఆధిక్యపోటీగా ఉంచకుండ చూడాలి" అని మెహతా అన్నాడు.

భారత జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ప్రతినిధి దేవేన్ సేన్ మాట్లాడుతూ ప్రాంతీయకృషికి ఇవ్వబడిన ప్రాధాన్యత ఆసియా కార్మికులకు పెద్ద ఆశలు కలిగించినదని అన్నాడు.

స్పెయిన్‌లో ఏర్పడ్డ ఫ్రాంకో ప్రభుత్వాన్ని నిరసిస్తూ, మార్షల్ సహాయపథకంలోను, అట్లాంటిక్ ఒడంబడికలోను స్పెయిన్‌ను చేర్చాలన్న ప్రయత్నాలను విమర్శిస్తూ సమావేశం మరొక తీర్మానం చేసింది.

# జమీన్‌పై సయ్యద్ ఫజల్‌షా విడుదల

## లండన్‌లో అల్లరిచేసిన ముస్లింలీగ్ సభ్యుడు

లండన్, డిసెంబరు 8: ఇండియా భవనంలో పండిత నెహ్రూ ఉపన్యసించుచుండినప్పుడు భవనము యెదుట జరిగిన ప్రదర్శనలలో అవమానకరముగా ప్రవర్తించినందులకు సయ్యద్ ఫజల్ షాను అరెస్టు చేసి బోస్ట్రీటు మేజిస్ట్రేటు కోర్టులో హాజరు పెట్టియుండిరి. ఇతడు లండన్ ముస్లిమ్‌లీగు ఆజాద్ కాశ్మీరు సంఘ సభ్యుడు. ఈతని మేజిస్ట్రేటు ఒక సారి జమీనుపై విడుదల చేసియుండెను. తిరిగి నేడు మేజిస్ట్రేటు అతనిని జమీనుపై విడుదల చేసెను. తాను అవమానకరంగా ప్రవర్తించలేదని, తాను నిర్దోషియని అతడు వాదించెను. ఈతని 15 ఏండ్ల కుమారుని కోర్టువారు విడుదలచేసిరి.

# వయోజన వోటింగ్

## పట్టాభిగారి వుపన్యాసం

రురేకా, డిసెంబరు 8: వయోజన ఓటింగు విధానాన్ననుసరించి దేశం 17 కోట్లమంది ఓటర్లు వచ్చేఎన్నికలలో పాల్గొనవలసివుంటుందని, అప్పుడు వారు తమ ఇష్టంవచ్చినవారిని ఎన్నుకోవచ్చునని రాష్ట్రపతి డా॥ పట్టాభిగారు ఇక్కడ ఉపన్యసించారు.

జరిగిన మూడేండ్లలోను ప్రభుత్వం చాలాకష్టాలను ఎదుర్కోవలసివచ్చిందనీ ప్రజలబాగుకోసం కష్టించి పనిచేస్తున్నదనికూడా అన్నారు.

# పాటియాలా సమాఖ్యలో అకాలీ ఖైదీల విడుదల

పాటియాలా, డిసెంబరు 1: పాటియాలా, పంజాబు సంయుక్త సంస్థానాలలో తాత్కాలిక మంత్రివర్గంపై వ్యతిరేకోద్యమం లేవదీసిన అకాలీలనందరిని ఈ వేళ విడుదలచేశారు. ఈ విషయంలో ఈ క్రింది ప్రభుత్వ ప్రకటన వెలువడింది. "సంయుక్త సంస్థానాల అకాలీపక్షం ఇంతకుపూర్వం మంత్రివర్గానికి వ్యతిరేకంగా ఉద్యమం బయలుదేరదీశారు. వీరిలో చాలామందిని నిర్బంధించడం జరిగింది. వీరిలో చాలామందికి వేరువేరు విధాలు శిక్షలుకూడా పడ్డాయి.

అయితే మళ్లీ కొత్త మంత్రివర్గం రాగానే తమ ఉద్యమం విరమించుకోవాలని అకాలీలు నిశ్చయించుకున్నారు. అందుచేత నిర్బంధించబడిన అకాలీల నందరినీ వెంటనే విడిచివెయ్యాలని ప్రభుత్వం నిశ్చయించింది. ఒక అకాలీ డిటెన్యూను గూడా ప్రభుత్వం వదలివెయ్యాలని నిశ్చయించింది. అకాలీపక్షం ప్రభుత్వ చర్యకు హర్షించగలదని తలుస్తున్నాము. అయితే ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఎవరైనా ఉద్యమం లేవదీస్తేమాత్రం ప్రభుత్వం వారిని కఠినంగా శిక్షించి తీరుతుంది. ప్రజలందరు శాంతిభద్రతల రక్షణలో ప్రభుత్వానికి తోడ్పడగలరని ఆశిస్తున్నాము."

# హైదరాబాద్ శివార్లలో ఆర్యసమాజ్ సభ్యులపై దాడి

## ఇద్దరి మరణం

హైద్రాబాద్, డిసెంబరు 8: హైద్రాబాద్ నగర శివార్లలో ఫలక్‌నామా, చంద్రాయ గుట్టలమధ్య గతరాత్రి కొంతమంది వ్యక్తులపై ఒక సాయుధగుంపు దాడిచేసిన ఫలితంగా యిద్దరు మరణించుట, ముగ్గురు గాయపడుట జరిగింది. జంగారెడ్డి, నరసింహారెడ్డి అను ఆర్యసమాజసభ్యు లిద్దరు మరి ముగ్గురితో కలిసి, సినిమాలు చూచి చంద్రాయగుట్టకు వెళ్లుతున్నారట. వారిలో వారిపై 5 గురు సాయుధులు దాడిచేసి 5 గురినీ గాయపరిచారు. గాయపడినవారిని ఆస్పత్రిలో చేర్చిన కొంతసేపటికి జంగారెడ్డి, నరసింహారెడ్డి మరణించారు. మిగిలిన ముగ్గురి పరిస్థితి ప్రమాదకరంగా నున్నది.

# చింతకాని రైల్వే స్టేషన్‌మాష్టరు అరెస్టు

## కమ్యూనిస్టులతో సంబంధం ఉన్నదనే అనుమానంపై

హైద్రాబాద్, డిసెంబరు 8: చింతకాని రైల్వే స్టేషన్‌మాస్టరు రంగయ్యను, కమ్యూనిస్టులతో సంబంధం ఉన్నదనే అనుమానంపై, స్థానిక పోలీసులు అతనిని అరెస్టుచేశారని నేడిక్కడకు వార్తవచ్చింది నవంబరు 28 న చింతకాని, బోనకల్లు స్టేషన్లమధ్య నిజాంరైల్వే జిల్లా ఇంజనీరు షెగాల్ కమ్యూనిస్టులచే హత్యచేయబడి యుండెను.

## లింగగిరి పరగణా ప్రజల అసంతృప్తి

విజయవాడ, డిసెంబరు 8: లింగగిరి పరగణాను హైద్రాబాద్ సంస్థానంలో చేర్చాలన్న సూచనపట్ల యీ క్రిందిసంస్థలు అసంతృప్తి వెల్లడించినవి. లింగగిరి పరగణా కాంగ్రెస్‌సంఘం, రైతుకాంగ్రెస్, యువజనకాంగ్రెస్, వర్తకులసంఘం.

## బీబీనగర్ కేసు

హైద్రాబాద్, డిసెంబరు 8: బీబీనగర్ కేసు విచారిస్తున్న ప్రత్యేకన్యాయవిచారణసంఘంవారు నేడుసమావేశమైనప్పుడు కాశింరజ్వీ వకీలు ముస్తాఫాహుస్సేన్ కాశింరజ్వీని ఈకేసులో మిగిలినముద్దాయిలలోకలిపి విచారించేందుకు ఈకోర్టుకు హక్కులేదని వాదించెను. వాదనముగియకుండానే కోర్టు శనివారంనాటికివాయిదా వేయబడింది.

## మేజర్ జనరల్ చౌదరీ

గ్వాలియర్, డిసెంబరు 8: హైద్రాబాద్ మాజీమిలిటరీ గవర్నర్ మేజర్ జనరల్ చౌధరీగారు, "పత్రికాప్రకటనలు చెయ్యటానికి సైనికనిబంధనలను అతిక్రమించనని" నేడు పత్రికావిలేఖరులకు ఇంటర్వ్యూయివ్వ నిరాకరించారు. హైదరాబాద్‌లోని పరిస్థితులనుగురించి తమకు తెలియజేయవలసిందని ప్రపంచవ్యవహారాల భారతసమితివారు చౌధరిగారిని కోరినారట. ఆయన వారికోరికను నిరాకరించెను.

## కమ్యూనిస్టులచే కాంగ్రెస్ సేవకుని హత్య

హైద్రాబాద్ డిసెంబరు 8: వరంగల్లు జిల్లా పాదరం గ్రామంలో డిసెంబరు 3వ నారాయణ కాంగ్రెస్ సేవకుని సాయుధ కమ్యూనిస్టుల గుంపు ఒకటి హత్య చేసిందని యిక్కడకు వార్త వచ్చింది. ఈ గుంపువారే అదే రోజున ఆబ్కారీశాఖ ఇన్‌స్పెక్టరును గాయపరిచారట. (స్వ. వి)

## హైద్రాబాద్‌లో ప్లేగు

### ఒకని మరణం

హైద్రాబాద్, డిసెంబరు 8: 1949 డిసెంబరు 3 తో సమాప్తమగు వారంలో హైద్రాబాద్ నగరంలో యిద్దరికి ప్లేగు వ్యాధిసోకింది వీరిలో ఒకడు మరణించాడు. వ్యాధివచ్చిన ప్రాంతాలలో వ్యాధి యింకా విస్తరించకుండా తగు చర్యలు గైకొనబడినవి. ప్రస్తుతం ప్లేగు ఆస్పత్రిలో 13 గురు చికిత్స పొందుతున్నారు.

# ఫరూకాబాదుకు ప్రధాని నెహ్రూ రాక

ఫరూకాబాద్, డిసెంబరు 7: ఫరూకాబాద్‌లో జరగనున్న సంయుక్త రాష్ట్రాల రాజకీయ మహాసభలో పాల్గొనేటందుకు గాను ప్రధాని నెహ్రూ ఈవేళ ఫరూకాబాద్ వస్తున్నారు. ఈ సమావేశంలో ప్రతిపాదించటానికిగాను సం. రా. కాంగ్రెస్ కార్యవర్గం నిన్న సమావేశమై కొన్ని తీర్మానాలు తయారు చేశారు:— 1. క్రొత్త రాజ్యాంగాన్ని బలపరచటం. (2) అధికోత్పత్తి కార్యక్రమాన్ని బలంగా కొనసాగించటం. (3) జమీందారీ రద్దు నిధికి రైతులూ, కాంగ్రెస్ వాదులూ శక్తివంచన లేకుండా వసూళ్లు జరపటం.

# భారతరైల్వేచట్టం సవరణబిల్లు

## పార్లమెంటు ఆమోదం

న్యూఢిల్లీ, డిసెంబరు 9: భారతరైల్వే చట్టాన్ని సవరణచేస్తూ ప్రతిపాదించబడిన బిల్లుపై అధినివేశ పార్లమెంటులో నేడు కూడా చర్చసాగి బిల్లు ఆమోదించబడింది.

మూత గల వాగనులు లభ్యంకాని కారణంచేత మూతలేని వాగనులలో కొనిపోబడే సరుకులకు జరిగే నష్టానికి రైల్వేవారి పూచీ ఉండవనే నిబంధనకు ఎవరన్నా సవరణ ప్రతిపాదిస్తే తన అభ్యంతరంలేదనీ, మూతలేని కారణంచేత సరుకు నష్టమైనపుడే రైల్వేవారి పూచీ ఉండదనీ భారతరైల్వేల స్టేటుమంత్రి సంతానం అన్నారు.

# జన్మదిన సందేశాలు: నెహ్రూ ఉద్బోధ

కలకత్తా, డిసెంబరు 8: "కొంతవయస్సు వచ్చిన తరువాత పుట్టిన రోజు పండగల్లో హుషారు తగ్గిపోతుంది. అని పశ్చిమ బెంగాల్ నుంచి ఒక కాంగ్రెస్ వర్కరు పంపిన అభినందనలకు ప్రత్యుత్తరంవ్రాస్తూ నెహ్రూ అన్నారు.

తన స్నేహితులు, సహచరులు, దేశప్రజల ప్రేమను, ఆదరాన్ని ప్రదర్శిస్తే, ఆ వ్యక్తికి హుషారుగా వుంటూ వుంటుంది. ఇప్పుడు నాజన్మదినం సందర్భంలో దేశప్రజలే గాక విదేశాలవారుగూడా ఆదరాభిమానాన్ని ప్రదర్శించినదానికి నేనేమని బదులు చెప్పాలోగూడా తెలియకుండావుంది. ఈ ప్రేమనంతా మనం దేశసేవాముఖంగా తిప్పితే చాలా సౌభాగ్యంగా వుంటుంది.

ఇప్పుడు దేశంలో బహు సమస్యలు వున్నాయి. మనమంతా కలిసి పనిచేస్తేనే గాని అవి పరిష్కారం కావు. అందుకుమనం చిల్లరకుల్లర అభిప్రాయ భేదాలను విస్మరించాలి. అప్పుడుగాని మనం జాగ్రత్తగా పని చేయలేము.

నేను విదేశాలలో పర్యటించినప్పుడు అక్కడివాళ్లు ఇండియామీద ఎటువంటి ఆశలు పెట్టుకున్నది చూడగల్గాను. వారి ఆశలను సఫలం చేయవలసిన బాధ్యత మనమీద వుంది.

# ఢిల్లీలో నెహ్రూ క్రీడారంగ నిర్మాణం

ఢిల్లీ, డిసెంబరు 8: నేడు ఇండియా పార్లమెంటులో ఒకప్రశ్నకు సమాధానమిస్తూ ఇండియా ప్రభుత్వ పబ్లికు వర్క్సుశాఖా మంత్రి యను గాడ్గిల్‌గారిట్లు చెప్పిరి. ఢిల్లీలో నెహ్రూ క్రీడారంగమును పార్కును నిర్మించవలెనను సూచన యొకటి చేయబడెను. సినిమాలు మున్నగు కేవలము వినోదార్థమైనవి. అటువంటివానిని గవర్నమెంటు నిర్మించవలదు. కాని, ఆటలు ఆడుకొనుటకైన ప్రదేశము ప్రజారోగ్యమునకు సంబంధించినది. కనుక యిది సినిమాల నిర్మాణము వంటిది కాదు. నెహ్రూ క్రీడారంగమును నేషనలు స్పోర్ట్సుక్లబ్బు ఆఫ్ ఇండియా నిర్మింప సంకల్పించినది.

# బడ్జెట్ అంచనాలు మించిన ఖర్చులేదు

ఢిల్లీ, డిసెంబరు 7: నేడు ఇండియా పార్లమెంటులో అడిగిన ప్రశ్నకు జవాబుగా ఖజానామంత్రి డా॥ జాన్ మత్తయిగారిట్లు చెప్పిరి ఏ మంత్రి శాఖయున్ను బడ్జెటులోని అంచనా ఖర్చును మించి ఖర్చు చేయుటలేదు. బడ్జెటులో చెప్పబడని ఖర్చు ఏదైనను ఏ మంత్రియైనను చేయవలసివస్తే ఖజానా స్థాయిసంఘముయొక్క అనుమతి ముందుగా పొందకుండా చేయకూడదని ఇటీవల ఉత్తరువులు జారీ చేయబడెను. ఏదైనా అర్జంటుఖర్చులు ఉంటే అటువంటివానికి మాత్రము స్థాయిసంఘము అనుమతి లేకుండా ఖర్చు చేయవచ్చును.

# పూలచెట్లకై రాజ్యాంగ పరిషత్తు సభ్యుల వివాదం

ఢిల్లీ, డిసెంబరు 8: నేడు ఇండియా పార్లమెంటులో ప్రశ్నోత్తర సమయమందు సర్దారు హుకుంసింగు గారు యిట్లు ప్రశ్నించిరి. సభా భవన ఆవరణలో పూలచెట్లను పెంచుటకు ఒక్కొక్క మనిషి 1 కి నెల 1 కి రూ 2-8-0. చొ॥ రాజ్యాంగపరిషత్తు సభ్యులవద్దనుండి వసూలుచేయుచున్నారు. కాని గత 7 మాసముల నుండియు పూలమొక్కలను వేసిపెంచుటలేదు ఎందుచేత?

పబ్లికువర్క్సుశాఖా మంత్రి యన్. వి. గాడ్గిలుగారు యిట్లు ప్రత్యుత్తరమిచ్చిరి, ఈ మడులలో పూలమొక్కలను వేసంగిలో పెంచడం, కొలంలో మాత్రమే పెంచుదురు. సభ్యులవద్దనుండి వసూలుచేయబడు మొత్తం 12 మాసములకు వసూలు చేయబడినప్పటికి యీ ఆరుమాసముల ఖర్చుకే వినియోగింపబడును.

నవీనవారి 'ఆహుతి' తెలుగు చిత్రంలో ఒక ప్రణయ సన్నివేశం

# గ్రంథ సమీక్ష

## జ్ఞానేశ్వరి

శ్రీమద్భగవద్గీత ప్రథమ షట్కము శ్రీ జ్ఞానదేవ విరచితము. అనువాదము: శ్రీ దిగవల్లి శేషగిరిరావుగారు. అధ్యాత్మిక గ్రంథమండలి, విజయవాడ. పుటలు 188 వెల రూ. 2-0-0.

జ్ఞానదేవుల అద్భుత పవిత్ర చరిత్ర భక్తవిజయము ద్వారాను, హిందీ సినిమా ద్వారాను ఆంధ్రమహాజనులకు సువిదితమే. 21 సంవత్సరముల జీవితకాలములో వీరు సకల శాస్త్రముల నధ్యయించి, నిరుపమానమైన ప్రతిభా విశేషమును, అనేక మహిమలను ప్రదర్శించి, మహారాష్ట్ర దేశములో భక్తిమార్గ ప్రవర్తకుడై, జ్ఞానేశ్వరి, అనుభవామృతము అను ఉత్తమ గ్రంథములను రచించి అవతారము చాలించెను. వీరు సాక్షాత్ విష్ణు అవతారమని, వీరి అన్నగారు గురువు, నివృత్తిస్వరూపుడు అగు నివృత్తినాధుని సాక్షాచ్ఛివావతారమని ప్రజలు భావించుటలో ఆశ్చర్యమేమియు లేదు.

జ్ఞానామృతమును, అద్వైతామృతమును వెదజల్లువదనుటచేత భగవద్గీతా వ్యాఖ్యానములలో శ్రీ జ్ఞానదేవ విరచిత జ్ఞానేశ్వరి అత్యంత ప్రశస్తి గాంచినది. దీర్ఘ సగ్గసలతో, అనేక ఉపమానములతో, సర్వాలంకార శోభితమైన మహారాష్ట్ర భాషలో భగవద్గీతా హృదయమును జ్ఞానదేవులు ఆవిష్కరించుచున్నారు. గ్రంథమంతయు పురాణ పక్కీలో నడిచి శ్రోతలకును, పాఠకులకును అత్యంతాహ్లాదము చేయునట్టిదైయున్నది. భక్తవిజయ రచయిత యన్నట్లు కంకణముచేత రత్నము, రత్నముచేత కంకణము ప్రకాశించునట్లుగా జ్ఞానేశ్వరిచేత భగవద్గీతయు, భగవద్గీతచేత జ్ఞానేశ్వరియు ప్రకాశించుచున్నవనుట కెట్టి సందియమును లేదు. కొన్ని పదములకు జ్ఞానదేవులు చెప్పిన అర్థము సామాన్యముగా వానికి చెప్పు అర్థముకంటె భిన్నముగా నున్నది. సిద్ధాంతము మాత్రము అచ్చమైన అద్వైతమే. జ్ఞానియొక్క అనుభవమును, నిర్వికల్ప సమాధిలో నుండు యోగి అనుభవమును జ్ఞానదేవులు చక్కగా కర్ణించుచున్నారు. ముఖ్యముగా 5, 6 అధ్యాయములు జ్ఞానామృతమును వర్ణించునవని చెప్పవచ్చును. ఆరవ అధ్యాయములో జ్ఞానదేవులు యోగసాధనలను గూర్చి దీర్ఘముగా వివరించుచున్నారు.

ఈ ఉత్తమ గ్రంథమును శ్రీ దిగవల్లి శేషగిరిరావుగారు ఆంధ్రములోనికి అనువదించి ముముక్షువులకు మహోపకారము గావించియున్నారు: తెనుగు అనువాదము అత్యంత పాఠయోగ్యముగా నున్నది. గ్రంథారంభమున జ్ఞానదేవుల చరిత్ర కలదు. ఆస్థాన కవి వర్యులగు శ్రీ చెళ్ళపిళ్ల వెంకట శాస్త్రిగారి పీఠిక, శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి గారి ఆంగ్ల పీఠిక కలవు. అందరు అత్యంతాదర భావముతో చదువదగిన గ్రంథము.

* * *

## వెంకటేశ్వర శతకము

రచయిత:—చింతల సుబ్బయ్య, ప్రకాశకులు:—శెట్టిపల్లె సుబ్బరసయ్య అండ్ బ్రదర్సు కడప.

ఈ శతక రచయిత కీ॥ శే॥ చింతపలి సుబ్బయ్యగారు నూరుసంవత్సరముల క్రిందట కడపలో జీవించుచుండిరి. ఈయన మహాభక్తుడు, జ్ఞాని, యోగి. కడప పట్టణ శ్రీ వెంకటేశ్వరస్వామికి అంకితముగా వీరి భక్తి జ్ఞాన వైరాగ్య బోధకమగు ఈ శతకము రచించిరి. పద్యములు హృద్యములు, సరళములు. కడప పట్టణము యొక్క వీరి నిరుపమాన మగు ప్రేమ గ్రంథమంతటను వ్యక్తమగుచున్నది. వైష్ణవుడయ్యు, శివభేదము పాటించని అద్వైతి. ఉత్తమ శతకములలో నొకటిగా పరిగణింపబడదగిన శతకము.

## నగరంలో సినిమాలు

| | |
|---|---|
| సాగర్ | 'గరల్స్ స్కూల్' |
| చిత్ర | 'ఫద్దర్ కా ఫూల్' |
| స్టార్ | 'రత్నమాల' |
| సెలెక్టు | 'సాజన్ కా ఘర్' |
| వెల్లింగ్టన్, ప్రభాత్ | 'అపూర్వ సహోదర్‌గల్' |
| బ్రాడ్వే | 'శివాజాయ్' |
| క్రౌన్, గెయిటీ | 'ఇన్సనియత్' |
| సయానీ | 'లైలా మజ్ను' |
| సన్ | 'మంగయార్కరసి' |
| సరస్వతి | 'చక్రధారి' |
| Casino: | 'The Girl From Jones Beach' |
| Minerva: | 'Johnny Belinda' |
| NewGlobe: | 'The Lost Tribe' |
| New Elphinstone: | 'The Great Gatsby' |
| Roxy: | 'Texas' |

## ఆంధ్రులెవరు?

గ్రంథకర్త: శ్రీ కోట వెంకటచలంగారు, గాంధినగర్, విజయవాడ 2. వెల అరణాలం.

ఆంధ్రులెవరు? అనగా మనము ఎవరి సంతతికి జెందినవారము? మన పూర్వికులు ఉన్నతవంశ సంభూతులా? లేక నీచవంశ సంభూతులా? మన కులగోత్రములు, సంప్రదాయములు యెట్టివి? ప్రతి ఆంధ్రుడు విచారించి తెప్పగా తెలిసికొనదగిన ఈ విషయమును శ్రీ కోట వెంకటచలంగారు ఈ గ్రంథములో చర్చించుచున్నారు.

ఐతరేయ బ్రాహ్మణములో ఆంధ్రయను ఒక అనాగరికజాతి విషయమై ప్రస్తావనకలదు. విశ్వామిత్రుని కుమారులు ఏబదిమంది తండ్రి యాజ్ఞ మీరినందున తండ్రిచే శపింపబడి వేదబాహ్యులుగా గావింపబడిరి. వీరు దస్యులై అనాగరిక జాతులైన ఆంధ్ర పుండ్ర శబర, పుళింద, మూతిబాజాతులుగా మారిపోయిరని బ్రాహ్మణము చెప్పుచున్నది. ఈ అనాగరిక చండాలజాతి సంతతివారే ప్రస్తుత ఆంధ్రులని పాశ్చాత్య పండితులును, వారి అనుయాయులైన హైందవహూణ విద్యాధికులును చెప్పుచున్నారు. ఈ వ్రాతలు కేవలను భ్రమప్రమాద జనితములనియు, ఆంధ్రులు ఈ నీచజాతికి జెందినవారు కారనియు, యదుకుల సంభూతుడైన 'ఆంధ్ర' నృపతి పేర మనదేశము ఆంధ్రదేశమైనదని వీరు చెప్పుచున్నారు. 'యదువంశము నందలి బలియను మహారాజుకు దీర్ఘతమను ఋషి యనుగ్రహమున అంగ వంగ కళింగ సుంహ్మ, పుండ్ర ఆంధ్రయను పేర్లుగల ఆర్గురు కుమారులు కలిగిరి. వారు తూర్పుదేశమునకు రాజులై ఆరు దేశభాగములకు తమ నామములనే పేర్లుగా నుంచిరి' అను భాగవత వాక్యము వీరి వాదమునకు ప్రమాణము (సంస్కృత భాగవతము, నవమ స్కంధము 23 అధ్యాయము 5, 6 శ్లోకములు- తెలుగు భాగవతము 9-685) ఆంధ్ర నృపుని కాలమునుగూడ వీరు నిర్ణయించియున్నారు.

అత్యంత సమగ్రతతో వీరు తమ వాదమును నిలువబెట్టుకొనుచున్నారు. ఈ వాదము చాలా బలీయమైనదనుటకెట్టి సందియమును లేదు. ఎందువల్లనన ప్రాచీన వర్ణవ్యవస్థయందు ఒకసారి భండాలుడైనవాడు తిరిగి ఉన్నత వర్ణములోనికి వచ్చుట అసాధ్యముగా నుండెను. రాజులు వర్ణవ్యవస్థను నిష్కర్షగా, కఠోరముగా రక్షించుచుండిరి. ఇట్టి సందర్భమున భండాలజాతినుండి చాతుర్వర్ణ తములో కూడిన జాతి ఉద్భవించుట ఎన్నటికిని పొసగజాలదు. అనాదినుండియు ఆంధ్రులు వైదికమతాభిమానులుగా నుండిరను విషయము సుప్రసిద్ధము.

వీరు అత్యంత సమర్థతతో ప్రవచించిన ఈ వాదమును ఆంధ్ర చరిత్రకారులు శ్రద్ధగా విచారించి నిర్ణయము గావింపవలెను. భవిష్యచ్చరిత్రకారులకు తోడ్పడునదగుటచేత వీరికృషి అత్యంత ప్రశంసనీయముగానున్నది.

# వారఫలాలు

డిసెంబరు 11 వ తేదీ మొదలు డిసెంబరు 17 వ తేదీవరకు

### గ్రహస్థితి

రవి (15 మధ్యాహ్నం వరకు వృశ్చికం తర్వాత బుధునితో ధనస్సు) కుజుడు (కన్య) గురు శుక్రులు (మకరం) శని (సింహం) రాహువు (మీనం) చంద్రుడు (సింహం, కన్య, తులా, వృశ్చికాల్లో) 13 శని చంద్ర కుజ చంద్ర (యుతి) 14 గురు చంద్ర, శుక్రచంద్ర (కోణం) బుధ చంద్ర (కేంద్రం) కేతుచంద్ర (యుతి) 16 గురు చంద్ర శుక్రచంద్ర (కేంద్రం)

### ధరలు

ప్రత్తి (జారిల్లా) నూలూ వస్త్రాలూ స్పెక్యులేషన్ 16 తేదీనుంచి తేజీలో యుంటుంది.

### వాటాలు

17 శనివారం దెప్పర్ష్నా, రంగులూ తటాలున కొంత తగ్గుతవి.

### వెండి-బంగారాలు

16 మధ్యాహ్నం అమ్మి 17 కొనండి.

### ధాన్యములు - ఆహారవస్తువులు

పొట్టు ధాన్యములు 4 వారాలలో కొంత తగ్గుతవి. చింతపండూ, మిర్చి కొంత హెచ్చి తగ్గుతు, మిరియాలు - మసాలావస్తువులు పైధరల్లోనే నిలకడగా యుంటవి.

### లగ్నఫలాలు

**మేషం** (అశ్విని, భరణి, కృత్తిక 1వపాదం)

ఈ వారంలో 13 మధ్యాహ్నంవరకు ఎటుపోనూ తోచదు. ఆరోగ్యం తగ్గుతుంది. సంఘ వ్యవహారాలు విశ్రాంతి నివ్వక విసుగుకలిగించగలవు. తర్వాత 15 మధ్యాహ్నంవరకు పట్టుదల చూపడంవల్ల వ్యాపార కుటుంబవ్యవహార పరిష్కారాలు ఒక నిర్ణయానికి రాగలవు. భూములూ-నూతన వస్తువులూ కొనడం లాభకరం. 15, 16, 17 ల్లో ఆప్తులను కలుస్తారు. సమాజంలో సంతోషంతో కాలంగడుస్తుంది. 16 శుభవార్త.

**వృషభం** (కృత్తిక 2, 3, 4 రోహిణి మృగశిర, 1 2. పాదాలు)

ఈ వారంలో 15 మధ్యాహ్నం వరకు యత్న వ్యవహారాలు కటస్థంగా యుంటవి. ఉత్సాహం తగ్గుతుంది. ఉద్యోగసాకరీల్లో విసుగుకలిగించే పరిస్థితులు కలుగుతవి. తర్వాత 17 సాయంత్రం లోపుగా మీ అభిప్రాయాలను కార్యక్రమంలో యుంచ అవకాశాలు కలుగుతవి. మిత్రులు ఎక్కువ సహాయం చేస్తారు. రాజకీయ వ్యవహారాల్లో ప్రవేశం ప్రయత్న సాఫల్యం జరుగుతుంది. 16 శుభవార్త.

**మిథునం** (మృగశిర 3, 4 పాదాలు ఆర్ద్ర పునర్వసు 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో 11 మధ్యాహ్నం తరువాత గతవారంలో ఆగిపోయిన కార్యక్రమాల్ని ఆరంభించ కలుగుతారు. అనుకూల పరిస్థితులు ఏర్పడటంవల్ల ఉత్సాహం క్రమేణా హెచ్చుతుంది. 14-15ల్లో తలపెట్టిన ప్రయాణం అగుతుంది కాని ఒక ఆప్తునికి అవసరమునకు తగిన సహాయం చేయకలుగుతారు. 16-17 ల్లో ఆరోగ్యం సరిగా యుండదు. బిడ్డలుకూడా జలుబూ జ్వరాలతో బాధ పడెదరు.

**కర్కాటకం** (పునర్వసు 4, పుష్యమి ఆశ్లేష)

ఈ వారంలో 13 మధ్యాహ్నంవరకు కుటుంబ ఆర్థిక పరిస్థితులు విశ్రాంతినివ్వవు ప్రయత్నములకు విఘ్నాలు ఎక్కువ. 14-15 ల్లో ముఖ్య పరిష్కారాలూ-వ్రాతలూ ముఖ్య కార్యక్రమం త్వరపడి ముగించండి 16-17 ల్లో స్పెక్యులేషనుకు దూరంగా యుండడం అవసరం. ప్రయాణానికి విఘ్నం కలుగుతుంది. భోజన శయన సౌఖ్యం యుండదు.

**సింహం** (మఖ, పుబ్బ, ఉత్తర 1 పాదం)

ప్రస్తుతం మీలో జాగ్రత్త తక్కువ. అందువల్ల అందరూ మీకు ద్రోహం చేయ్యడానికికూడా సనుకీయుడుండా రయున్నారు. భద్రపడడం అవసరం.

ఈ వారంలో 12-13 ల్లో క్రమతో కూడిన ప్రయాణం. 14 - 15 ల్లో విపరీత ఖర్చులూ పొరపాట్లూ,కలుగుతుంది. 16, 17 ల్లో పరిష్కారాలూ వ్రాతలూ లాభకరం. ఇరుగు పొరుగుకు జాగ్రత్తగా గమనించిపోండి. 16 శుభవార్త.

**కన్య** (ఉత్తర 2 3 4 పాదాలు, హస్త, చిత్త 1-2 పాదాలు)

ఈవారంలో 11 12, 13 ల్లో కొరగానిఖర్చులెక్కువ. సమయంలో మిత్రులనుకొనువారుకూడా ఆశాభంగం కలిగిస్తారు. 13, 14, 15 ల్లో ప్రయాణం జరుగుతుంది దగ్గర బంధువులను కలుస్తారు. శుభకార్య ప్రస్తావనలు జరుగుతవి. ముఖ్య కార్యక్రమం-వ్రాతలూ పై మూడు తేదీల్లోనే ముగించండి. 16 17 ల్లో ఇరుగు పొరుగులవల్ల మనస్సునకు కొంత ఆలజడి కలుగుతుంది. అనుమానాలూ, అపవాదాలు ఓర్చుకొనవలసి యుంటుంది.

**తుల** (చిత్త 3, 4 పాదాలు, స్వాతి విశాఖ 1, 2, 3 పాదాలు)

ఈవారంలో పరిస్థితులు గతవారంలో కన్నా మేలుగా యుండకలవు. కళాపోషకులకూ - కవులకూ - గాయకులకూ యోగకాలం. వ్యాపారాదుల్లో అవకాశాలు తగ్గుతవి. 11, 12, 13 ల్లో పరిష్కారాలూ ప్రయాణం లాభకరం. 14, 15 ల్లో అరోగ్యం, అధికవ్యయం-వాతావరణంలో చిన్న ప్రయాణం. సంతోషకరమైన ముచ్చట్లూ శుభ సంప్రదింపులూ జరుగుతవి. లెక్కించి ఖర్చు పెట్టడం అవసరం. 14 శుభవార్త.

**వృశ్చికం** (విశాఖ 4 పాదం, అనూరాధ జ్యేష్ఠ)

ప్రస్తుతం మీకు గ్రహబలం బాగా యుంది. వెలుగుండగనే సరిచూచుకొనడం అవసరం. ఈ వారంలో 11, 12, 13 ప్రయాణానికి కార్యాన్తపరంపై అధికారులనూ గౌరవస్థులనూ కలవడంవల్ల మేలు కలుగుతుంది. 14, 15 ల్లో పరిష్కారాలూ ముఖ్యకార్యక్రమం ఆలోపుగా ముగించండి. 16,17 ల్లో ఆరోగ్యం తగ్గడమే కాకుండా అయ్యే ఖర్చులు ఒకటికి రెండుగా అవుతవి.

**ధనుస్సు:** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పాదం.)

ఈ వారంలో 13 సాయంత్రం వరకు ఆరోగ్యం తిన్నగాయుండదు. ప్రయాణం ఆగుతుంది. 14, 15 ల్లో ఆగిన ప్రయాణం జరుప అవకాశాలు కలుగుతవి. ఆప్తులనూ మిత్రులనూ కలుస్తారు. వ్యాపారాదుల్లో అనుకూల వాతావరణం ఏర్పడుతుంది. 16, 17 ఆరోగ్యభంగం ఆశాభంగం. 14 శుభవార్త.

**మకరం** (ఉత్తరాషాఢ 2, 3,4 పాదాలు, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పాదాలు)

ఈ వారంలో 15 సాయంత్రం 3 గంటలవరకూ ఓర్పు అవసరం. త్వరపడి ఏది చేసినా వెనుకవిచారిస్తారు. ఆరోగ్యభంగం, ఆశాభంగం కలుగుతవి. కానివారాంతంలో శ్రమకు తగినఫలితం పొందుతారు. ఆర్థిక సర్దుబాట్లుకలుగుతవి. ఆగినప్రయాణాం జరుపడమే కాకుండా, ముఖ్యులను కలువగలుగుతారు.

**కుంభం** (ధనిష్ఠ 3,4పాదాలు, శతభిషం, పూర్వాభాద్ర 1,.2, 3 పాదాలు)

గతవారంలో మీఆరోగ్యాన్ని తగ్గించే మనోబాధ - అధికవిచారము, కుటుంబంలో వెనుకపాట్లు జరిగియుంటవి. కాని ఈ వారంలో గతవారంలోజరిగిన వెనుకపాట్లు చాలావరకు సర్దుకోకలుగుతారు కాని అవకాశాన్ని చూచి ముందుకుపోండి 11, 12, 17 ల్లో వ్యాపారస్పెక్యులేషన్లు లాభకరం కాగలవు. అధ్యాత్మిక చింత హెచ్చుతుంది. 12 శుభవార్త.

**మీనం** (పూర్వాభాద్ర 4 పాదం ఉత్తరాభాద్ర, రేవతి)

ఈ వారంలో పట్టుదలవహిస్తే మీరు ప్రారంభించి ముగించలేనిదేమీయుండవు. ఆరోగ్యాభివృద్ధి కలుగుతుంది. ఆర్థికవెనుకబాట్లు సర్దుకోకలుగుతారు. కుటుంబంలో సామరస్యం ఏర్పడుతుంది. 11, 12, 13 పరిష్కారాలకూ 13, 14, 15 ల్లో ప్రయాణంలాభకరం. 16, 17 ల్లో విశ్రాంతి పొందడమంచిది. 14 శుభవార్త.

## ఫిలింపారిశ్రామికుల తుపాను నిధి

ఫిలిం పారిశ్రామికుల ఆంధ్ర తుపాను నిధి కార్యదర్శి ఇంటూరి వెంకటేశ్వర రావుగారు యీ దిగువరీతి చందాలిచ్చిన వారికి కృతజ్ఞత తెల్పుచు, మిగిలిన వారిని విరివిగా చందానివ్వమని కోరుచు, యీ జాబితా ప్రకటించిరి.

రూ 5001 యిచ్చినవారు జి. బలరామయ్య, పి. భానుమతి, వి. కన్నాంబ, అంజలిదేవి, వాహిని—విజయప్రొడక్షన్సు లిమిటెడు. రూ 1500; శ్రీ మురుగను టాకీసువారు, రూ 1116 ఇచ్చినవారు; ఎ. నాగేశ్వరరావు, హెచ్.ఎం.రెడ్డి, ఘంటసాల వెంకటేశ్వరరావు, కె. వి. రెడ్డి, కె. శివరావు, ప్రకాశ ప్రొడక్షన్సు. రూ. 1001 ఇచ్చినవారు; టి. రాజకుమారి, పి. యు. చిన్నప్పఎస్. వి. రాఘవాచార్యగార్లు.

విజయప్రొడక్షనుసాంకేతికఉద్యోగులు- 761. ఎస్. వి. ఎస్. రామారావు 558 పి. పుల్లయ్య 558. శ్రీనర్ 558. టి. వి. ఎస్. శర్మ 508. హరిపాదచంద్ర-501. వి. ఎస్. రంగ-250. నర్సుపిక్చర్సు సహాయ్యకటు-250. శ్రీమతి బాలామణి-200. ప్రతిభ పిక్చర్సుఉద్యోగులు-200. రూ 116 ఇచ్చినవారు - అశ్విని పిక్చర్సు ఉద్యోగులు- భరణి పిక్చర్సు ఉద్యోగులు, కె. గోపాలరావు, హెచ్. వి. బాబు, ఎం. లింగమూర్తి, సి. పుల్లయ్య- ఎం. సత్యం బలిజేపల్లి లక్ష్మీకాంతకవి, పింగళి నాగేంద్రరావుగార్లు. విజయ ప్రొడక్షను సిబ్బంది 85. ఇ. కె. మాత్యు, చిప్రాస్ 50. వై సూర్యనారాయణమూర్తి (తాడేపల్లిగూడెం)-20. మొత్తం రూ 41,746.

# మదరాసు ధరలు

మదరాసు, డిసెంబరు 10:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-క ఎడ్వర్డు బొమ సేల్సుటాక్సుతో సహా రు. 76 12.0 పెట్లా బంగారు తులం 114-12-0 మాసబంగారు 118-12-0 సీమవెండి తులం 1'0 క (రెడి 173-0-0 వెండి తులం 1-క 1-12 6

వేరుసెనగ: (581 శా 1.క ఎర్ర కోస్తాగిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు కొత్తవి. రు. 162-0-0 వేరుసెనగనూనె ఎక్సుపెల్లర్ (పీపరెజ) రు. 326, 327 3 టి.5% యస్. యస్. ఎం రెండుకాయనూనె (87 పౌన్లు గల డబ్బా) ఒకటిక కొచ్చిన్ క్వాలిటీ. రు. 36-12-9, 37-8-0

### ఆముదం

కొండి 500 కాసులుగలది రు. 250, 255 (ఒంగోల్, నరసరావుపేట) రు. 270-0-0

### పంచదార

| | | |
|---|---|---|
| నర్కటాగంజి (2తిందరు) | | రు. 94-9-5 |
| నూపకాపూర్ | ,, | రు. 94-7-10 |
| మోతీపూర్ | ,, | రు. 93-14-0 |

# న్యూయార్కు దూది

న్యూయార్కు, డిసెంబరు 9:

డిసెంబరు 30.27 / 30 27 మార్చి 30 22 / 30 22 మే 30.12 / 30,13 జూలై 29.53/29 53 అక్టోబరు 27 96/ 27.96 డిసెంబరు 27.87 సా. మార్చి 27.78/ సా. మే 27.74/సా.

| | | |
|---|---|---|
| స్పిడ్లింగ్ | పోజరు | 30.92 |
| మార్చి | (గరిష్ఠధర) | 30.87 |
| | (కనిష్ఠ ధర) | 30 22 |

### మార్చివాయిదా ధరలు

| | | | |
|---|---|---|---|
| నేటి | ప్రారంభం | వెల | 30 27 |
| | నిన్న | | 30 39 |
| ,, | ముగింపు | వెల | 30 22 |
| | నిన్న | | 30 21 |

ఆంధ్రపత్రిక

ఆదివారం డిసెంబరు 11, 1949

సారస్వతానుబంధము

# యూరప్ శాంతికి ధూమకేతువు

## జర్మన్ కమ్యూనిస్టు నాయకుడు విల్‌హెల్మ్ పెయిక్

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం ప్రారంభమైన ప్రాథమిక దశలో, అగ్రశ్రేణిలో వుండే ప్రధాన నాయకులెవరూ యిప్పుడు అదృశ్యంలో యెక్కడా కనపించరు. రష్యన్ కమ్యూనిస్టుపార్టీలోనుంచి, అంచె పరంపరను ప్రయోగించి దళం తరువాత దళంగా బోల్షివిక్ వృద్ధ నాయకుల నందర్నీ తుడిచివేయటమెక్కడే ప్రపంచానికి తెలుసుగాని, యితర దేశాల నాయకత్వాలలో వస్తున్న మార్పుల సంగతి యెవ్వరికీ తెలియదు. 1919 లో అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ ప్రారంభమైన తర్వాత జర్మన్ కమ్యూనిస్టుపార్టీ, రష్యా తర్వాత రెండో ప్రధానస్థానం ఆక్రమించుకొని వుండేది. ఆదిలో జర్మన్ కమ్యూనిస్టుపార్టీలో యూరప్ కార్మికోద్యమ నాయకత్వంలోని స్త్రీ పురుషులంతా వుండేవారు. రష్యన్ విప్లవం వచ్చే వరకూ వీరందర్నీ, లెనిన్ మొదలైన పార్టీలోని బోల్షివిక్ విజ్ఞానవేత్తల సమాన స్థాయిలో చూస్తూవుండేవారు. జర్మన్ కమ్యూనిస్టుపార్టీ సజీవంగా వున్న మొదటి మూడుసంవత్సరాలలోనూ, యెంతో త్వరిత గతిని బలపడి యెంతోమంది పార్టీలో చేరారు. 1923 సంవత్సరం వచ్చేసరికి పార్టీ దేశంలో యెంతో పలుకుబడి సంపాదించుకుని దేశంయొక్క రాజకీయ రంగంలో యెంతో ప్రాధాన్యత వహించటం మొదలుపెట్టింది. కాని నాటికి జర్మనీమీద విజయాన్ని సాధించివున్న దేశాలు జర్మనీలో విప్లవం వస్తుందేమోననే భయంతో జర్మనీలోని అభివృద్ధి నిరోధకవర్గాలకు మద్దతు చేసినై. ఆ కారణంగా 1923 లో జర్మన్ కమ్యూనిస్టుపార్టీ అధికారాన్ని చేపట్టడానికిచేసిన ప్రయత్నం భగ్నమై పోయింది. అదీగాక రష్యాలోకంటే అభివృద్ధినిరోధకవర్గాల బలం జర్మనీలో జాస్తిగా వుండేది. నిజమైనకారణాలు యిలా వున్నా యీ అపజయానికంతా కారణం పార్టీ నాయకత్వంలోవున్న లోపమేనని ఆరోపణచేసి వారందర్నీ తొలగించిమరో క్రొత్తదళాన్ని తెరమీది కెక్కించారు. ఆ మొదటి తుడిచివేతను తప్పించుకుని, నిలబడగల్గిన కొద్దిమందిలో విల్‌హెల్మ్ పెయిక్ కూడా ఒకరు. ఆ తేదీ లగాయతూ యీ రకం అవాంతర పరంపర లెన్నిటినో తప్పుకుంటూ చివరకు రష్యన్ సేన సహాయంతో పార్టీ అధికారానికి వచ్చిన తరువాత పార్టీనాయకుడయ్యాడు. ఇన్ని అవాంతరాలూ గడచాటంలో రష్యనుల చెప్పుచేతలకు తలవొగ్గటం మినహా ఈయన దగ్గిరున్న మరో ప్రతిభ ఏమీలేదు. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని అగ్రశ్రేణిలోకి యెగబాకా లంటే వున్న నిచ్చెన అదొక్కటే.

పెయిక్ జర్మన్ కమ్యూనిస్టుపార్టీ వ్యవస్థాపకులలో ఒకరు. అతఃపూర్వమే ఈయన రోజా లగ్జంబర్గ్,



శ్రీ యం. యన్. రాయ్

కారల్ లైబ్నెట్ మొదలైనవారితో పరిచయముండేది, "అంతర్జాతీయమండలి"లో సభ్యులుగావుండేవారు. వీరంతా, 1916 జనవరి 1 వ తేదీన జర్మన్ డెమాక్రాటిక్ పార్టీవారి శక్తియుక్తమైనవిధానానికి వ్యతిరేకంగా, విప్లవంలేనిదే "శత్రువు మనస్వంత దేశంలోనే వున్నాడ"ని నినాదాలుచేస్తూ యుద్ధసన్నాహాలను ప్రతిఘటించారు. ఈ వర్గంయొక్క కార్యకలాపాలన్నిటినీ రోజాలగ్జంబర్గ్ నాయకత్వంవహించి నడుపుతూవుండేవారు. జైల్లోనుంచి ఆయనరహస్యంగా బయటికి పంపే ఉత్తరాలమీద "స్పార్టకస్" అని చేవ్రాలుచేస్తూ వుండేవాడు. (స్పార్టకస్, ప్రాచీనరోమ్ చరిత్రలో బానిసలతిరుగుబాటు లేవదీసిన ప్రసిద్ధ నాయకుడు). ఆ కారణం చేతనే జర్మన్ కమ్యూనిస్టుపార్టీ అగ్రనాయకులను "స్పార్టకస్ బండ్" అనేవారు. వారి ప్రథమసమావేశం 1918 లో జరిగింది. ఆ సమావేశానికి పెయిక్ అధ్యక్షతవహించారు. విప్లవతరుణంలో, లగ్జంబర్గ్ లెయిబ్నెట్లతోపాటు పెయిక్ కూడా 'బెర్లిన్ కార్మికసభ'లో సభ్యుడుగావున్నాడు. లగ్జంబర్గ్, లెయిబ్నెట్లను ఉరితీసిన అనంతరం పెయిక్ "స్పార్టకస్ బండ్"కు నాయకుడయ్యారు.

1920 ప్రారంభదశలో జర్మన్ పాత సైన్యంలోని ఒకవర్గం తిరుగుబాటుచేసి, క్రొత్తగాయేర్పడ్డ వెయిమార్ ప్రభుత్వాన్ని తొలగించి ఇంచుమించు విజయాన్ని పొందేవాకావచ్చారు. ఈ సైనిక దళం ఒకనాడు హఠాత్తుగా రాజధానిలో ప్రవేశించి కీలకస్థానాలన్నిటినీ ఆక్రమించుకున్నారు. సోషల్-డెమాక్రాటిక్ అధ్యక్షుడు, ఈ బస్టు, ఆ రెస్టు కాకుండా తప్పించుకుని, తనమంత్రి వర్గంతోపాటు బెర్లిన్ వదలి పారిపోయాడు. యుద్ధానికి పూర్వం జరిగిన యూరప్ సంఘటనలలో అదిఒక విచిత్రమైన ఘట్టం. అంతకు కొద్దిరోజుల పూర్వమే, నేను, మెక్సికోనుంచి మాస్కో వెళుతూ బెర్లిన్‌లో మకాం చేసివున్నాను, నేను మకాంచేసివున్న హోటలు కిటికీలోనుంచి చూస్తే, నిరాడంబరమైన ప్రష్యన్ రాచరిక సైన్య దళాలు మూలలనూ పరవళ్లు పెట్టుతుండటం కనిపించింది. జనం, హఠాత్తుగా దెబ్బతిన్నవారిలా ఎక్కడివారక్కడ కంగారై చూస్తూ నిలబడిపోయారు. నగరంయావత్తు క్షణంలో అల్లకల్లోలమైపోయింది. ఆ రాత్రికి రాత్రి తిరిగి ప్రతిఘాతంచేసి పరిస్థితిని చేతిలోకి తీసుకుని అదుపుచేయగల బలమైన నాయకత్వమొకటి బయలుదేరింది. ఆ సందర్భంలోనే నేను మొదటిసారి విల్‌హెల్మ్ పెయిక్‌ను చూడటం తటస్థించింది. మొదట ఆయన్ని చూచి పౌరదుస్తులలోవున్న యెవరో మిలిటరీ అధికారి అనుకున్నాను.

అది కమ్యూనిస్టు పార్టీవారి రహస్య సమావేశం. పార్టీ నాయకత్వంలోవున్న యెర్నెస్ట్ మేయర్, నేనూ ఆ సమావేశానికి వెళ్లాం. ఈ సమావేశం యిలా జరుగుతుండగానే జర్మన్ కార్మిక ఫెడరేషన్ నాయకుడు కారల్ లీజియన్ ఈ ప్రతివిప్లవాన్ని అణచివేయటానికి కార్మికుల సమగ్ర సమ్మెకు పిలుపునిచ్చినట్టుగా వార్త వచ్చింది. అయన్ని కమ్యూనిస్టులూ, సోషల్ డెమాక్రటిక్ పార్టీలోని వామపక్షంవారూకూడా అప్పటికి ఒక అభివృద్ధి నిరోధకుడుగా లెక్కగట్టి వుంచారు. ఆ తరుణంలో పార్టీ ఒక నిర్ణయం చేయటానికి పాలుపోలేదు. లీజియన్‌కు ప్రక్కతాళం వెయ్యటమా, లేక స్వతంత్రంగా దృక్పథంలోనుంచి అంతర్హితులు కావటమా తేల్చవలసి వచ్చింది. నాయకులంతా వెనకా ముందూ తటపటాయిస్తున్నారు. అప్పుడు పెయిక్ ముందుకు వచ్చి మొదటి పంథా అనుసరించటానికే వారిలోని సమ్మెకు తాను కూడా పిలుపునిచ్చాడు. సోషల్ డెమాక్రటిక్ పార్టీలోనుంచి చీలిపోయిన వామపక్షం స్వతంత్ర సోషలిస్టు పార్టీ అనే క్రొత్త సంస్థగా యేర్పడి వ్యవహరించుకొంటూ వుండేవారితో కలిసి ఒక సంయుక్త ప్రకటన చేశాడు. ఆ ప్రకటనలో కమ్యూనిస్టు పార్టీతరఫున తాను చేవ్రాలు చేశాడు.

నాలుగు రోజులు సమ్మె దిగ్విజయంగా సాగింది. బెర్లిన్ వీధులన్నీ ఎక్కడా ప్రాణి సంచలనం లేకుండా యెడారులుగా మారిపోయినై. దాంతో ఆ వచ్చిన ప్రతి విప్లవ సైన్యం యేమీ చేయలేక యెక్కడి దళాలక్కడ పట్నం విడిచి వెళ్లిపోయారు. సుసంఘటితమైన కార్మిక సంఘం పశుబలాన్ని నిర్జించి జయాన్ని చేపట్ట గలిగింది. అలాంటి సంఘటనను చూడ గలగటం, నిజంగా అదృష్టమనే అనాలి.

రాచరిక సైనిక ప్రతి విప్లవాన్ని ఇలా భగ్నం చేసిన అనంతరం లీజియన్ మరో బలవత్తరమైన విధానాన్ని సూచించాడు. నిజంగా ఆ సూచనను ప్రజా పక్షాలకు చెందిన వామ పక్షాలన్నీ బలపరచి వుంటే జర్మనీ అనంతర చరిత్ర అలా అధ్వాన్నంగా పరిణమించేది గాదు. నాస్కే మొదలైన [illegible] వ్యక్తుల నందర్నీ తొలగించి మంత్రి వర్గాన్ని పునర్నిర్మాణం చెయ్యాలని లీజియన్ పట్టు బట్టారు. కాని వామ పక్షాల వారెవ్వరూ అందుకు సమ్మతించారు కారు. అటువంటి దురదృష్టవంతమైన ప్రతిఘటనకు ప్రధాన కారకుడు విల్‌హెల్మ్.

వర్సైల్స్ సంధి అనంతరం జర్మనీలో ఒక విచిత్రమైన ఉద్యమం ప్రారంభమైంది. సైన్యంలోని కొంతమంది యువకులైన అధికారులు, ప్రజాపక్షాలకు చెందిన విప్లవ వర్గాలతో చేతులు కలపటం ప్రారంభించారు. జర్మనీని బానిసత్వంలోనుంచి ఉద్ధరించటానికి 'నేషనల్ బోల్షివిక్' కేతనంక్రింద ఉద్యమం ప్రారంభించమని వీరు కోరుతూ వచ్చారు. నేషనల్ బోల్షివిక్ పార్టీ నాయకులు ఇందుకు అంగీకరించారు. ఆతరుణంలో కమ్యూనిస్టుపార్టీ ప్రధాన నాయకులంతా మరణించి వుండటం చేతనూ విల్‌హెల్మ్ నాయకత్వం చాలా బలహీనమైన నాయకత్వం కావటంచేతనూ, కమ్యూనిస్టు పార్టీలో "స్పార్టకస్‌బండ్" వర్గంవారి పలుకుబడి సన్నగిల్లి, 'నేషనల్ బోల్షివిక్' పార్టీ నాయకులు బాగాపలుకుబడి సంపాదించుకోగలిగారు. అదే జర్మన్ కమ్యూనిస్టుపార్టీఅంత్యానికినాంది. పార్టీ క్రమేపీ ఆచీకటి ముసుగున అంతరించిపోతో, చివరకు జర్మన్ సైనిక విప్లవతరుణంలో పాంతం దెబ్బతిని సర్వనాశనమై పోయింది. బోల్షివిజాన్ని గురించి మాట్లాడుతూండే ఈసైనికాధికారులందరికీకూడా ఆసైనిక విప్లవంతో సంబంధంవుండేది. అంతేగాదు, ధనికవర్గ ప్రభుత్వాన్ని కూలద్రోసే ఆశతో కమ్యూనిస్టుపార్టీ నాయకులుకూడా ఈ సైనిక విప్లవానికి రహస్యంగా సానుభూతి చూపుతూ వుండేవారు, నిజంగా, సమయానికి మేయర్ జైలునుంచి విముదల కాకుండా వున్నట్లయితే పెయిక్‌పార్టీని యెంత నవ్వులపాట్ల పరిస్థితిలో యీడ్చుకుపోయివుండేవాడు, మంత్రివర్గాన్ని పునర్నిర్మాణం చెయ్యాలని లీజియన్ చేసిన సూచనను బలపరచకపోవటం ఇంత అనర్థానికి దోవతీసింది. చివరకు లెనిన్ స్వయంగా జోక్యం తీసుకుని ఈ పరిస్థితినంతా చక్కదిద్దాడు.

అప్పటినుంచీ జర్మన్ కమ్యూనిస్టుపార్టీ తాల్‌హెయిమర్, మెయర్ మొదలైన "స్పార్టకస్‌బండ్" తాలూకు పాత నాయకుల క్రింద చారిత్రాత్మకంగా అభివృద్ధి చెందింది. చాలాకాలంనుంచీ పార్టీ నాయకత్వంలో పనిచేస్తున్నాడనే ఆదరంతో పెయిక్‌కుకూడా కేంద్ర సంఘంలో ఒక స్థానం ఇచ్చారు. 1923 లీప్‌జిగ్ సమావేశానికి అధ్యక్షతకూడా వహించాడు. ఆ సమావేశంలో మాస్కోనుంచి వచ్చిన ఆదేశాలప్రకారం, కమ్యూనిస్టులు సోషల్ డెమాక్రట్లతో కలిసి సాక్సొనీ, తురింగియాలలో సంయుక్త ప్రభుత్వాలను యేర్పాటు చేయాలని నిర్ణయించారు. క్రమబద్ధమైన విప్లవాన్ని లేవదీయటానికి యేర్పాటు చేయబడిన నాయకత్రయ సంఘంలోకూడా పెయిక్ సభ్యుడుగా వున్నాడు. లీప్‌జిగ్ సమావేశానికి నేనుకూడా వెళ్ళాను. తరువాత జరిగిన సంఘటనలలో కూడా పాల్గొన్నాను.

ఒక చిత్రమైన విషయమేమిటంటే, పోలీసు డ్రిల్లు దళపు సార్జెంటు మోస్తరుగా, నినాదాలు అరవటానికి మినహా మరోకదానికి దేనికీ కొరగాని యీ వ్యక్తి ఇలాంటి ప్రధానమైన కీలక స్థానాల్లో ఎందుకు వుంటాడా! అన్నది మాత్రం అర్థం గాదు.

ఆ విప్లవప్రయత్నమంతా తలక్రిందులై, దాని బాధ్యతంతా పార్టీ నాయకుల అసమర్థత క్రింద తేల్చి వారందర్నీ తొలగించిన తరుణంలోకూడా పెయిక్ యథాతథంగానే వున్నాడు. పార్టీ క్రొత్త నాయకత్వంలో ఇతణ్ణికూడా చేర్చారు. మాస్కోనించి వచ్చే ధన సహాయాన్ని వారికందేనీవని యీయనకు వప్పగింత చేశారు. దాంతో యెప్పటికప్పుడు పార్టీలో తన స్థానాన్ని పోకుండా పార్టీ సంస్థలలో బలం సంపాదించుకున్నాడు. పార్టీ నాయకులలోని మహామహులంతా లేవటం పతనమై పోవటం జరిగింది గాని పెయిక్ మాత్రం రష్యన్ నాయకుల చెప్పుచేతలకు శిరసావహిస్తూ అనాది 'స్పార్టకస్ బండ్' పెద్దపు ప్రతిమూర్తిగా అలానే వుండిపోయాడు.

1927 లో తేల్‌మన్ నాయకత్వానికి వచ్చిన తరుణంలో, పెయిక్‌కు పార్టీనిర్మాణ బాధ్యతను ఇచ్చారు. ఆ తరుణంలో ఇతడు అనుసరించిన తప్పుడు విధానమే ఫాసిజం బలపడటానికి పార్టీ సర్వనాశనమై పోవటానికి కారణం. కాని తీరా 7 వ అంతర్జాతీయ కమ్యూనిస్టు కాంగ్రెస్ సమావేశానికి మళ్ళీ తయారై పెద్దపెట్టున జర్మన్ కమ్యూనిస్టుపార్టీని విమర్శించటం ప్రారంభించాడు. తేల్‌మన్ నాజీ కాన్సెంట్రేషన్ క్యాంపులో వుండిపోయారు. తేల్‌మన్ స్థితిగతులు అనంతరం యేమైంది. అయోమయం. అలాగే, ఆయన ప్రధానమిత్రులు చాలామందికూడా ఆ సంఘటనలలో రూపుమాసిపోయారు. తిరిగి యీ అవాంతరాన్నికూడా గడచి, పెయిక్ పైకి తేలగలిగాడు; ఇతనితోపాటు ఇప్పుడు కమ్యూనిస్టు జర్మనీకంతా యజమానిగా తయారైన ఉల్‌బ్రిట్ కూడా తప్పించుకు బయటపడ్డాడు. హిట్లరు విజయాన్ని పొందగానే ఫ్రాన్సుకు పారిపోయిన కమ్యూనిస్టులలో ఉల్‌బ్రిట్ కూడా ఒకడు. అనంతరం వీరిలో చాలామంది స్పెయిన్ అంతర్యుద్ధంలో పాల్గొన్నారు. అక్కడ ఉల్‌బ్రిట్ ట్రాట్స్కీవాదులను వేటాడటంలో పేరుసంపాదించి తద్వారా రష్యావారి ఆదరాభిమానాలు సంపాదించాడు.

సోవియట్-జర్మన్ ఒడంబడిక జరిగిన అనంతరం సమ్మతంగా వీరందర్నీ జర్మనీకి పిలిపించి రాససరి కాన్సెంట్రేషన్ క్యాంపులకు పంపించి హతమార్చారు. ఉల్‌బ్రిట్ మాత్రం మాస్కోకు తప్పుకున్నాడు. అక్కడ 1941 అక్టోబర్‌లో జరిగిన జర్మన్ ఖైదీల సమావేశానికి అధ్యక్షత వహించాడు.

అనంతరం మిగిలివున్న జర్మన్ కమ్యూనిస్టులు పెయిక్, ఉల్‌బ్రిట్లనాయకత్వం క్రింద లాడ్స్‌క్రఫ్టుప్యుకాని 'జర్మన్-రష్యన్ ఒడంబడికను భగ్నపరచి హిట్లరు దేశాన్ని దగా చేశాడు. దేశ ద్రోహిమీద తిరుగుబాటు చేయండి' అని ప్రచారాలు చేశారు.

స్టాలిన్‌గ్రాడ్ యుద్ధానంతరం 1943 లో "స్వతంత్ర జర్మన్ జమిటీని" యేర్పాటు చేశారు. స్టాలిన్‌గ్రాడ్ మీదికి హిట్లర్ సేనలను నడిపించిన మార్షల్ వాన్ పాలస్, జనరల్ వాన్ సెయిడ్ లిట్జులు ఆ కమిటీలో ప్రధాన స్థానాలు ఆక్రమించారు. పెయిక్‌ను 'పొలిటికల్ కమిసార్'గా నియమించారు. జర్మన్ యుద్ధఖైదీల నందర్నీ తిరిగి ఆయుధపాణులను చేసి సేనగా తయారు చేయటానికిగాను కేటాయించిన డబ్బు మీద తిరిగి యీయనకు అధికత్వం వచ్చింది. ఈ విధంగా తిరిగి ఆయన మళ్ళీ బెర్లిన్ చేరాడు, - రాజకీయ అందోళనకారుడుగానూ, పార్టీ యజమానిగానూ, అతి ప్రాచీనమైన 'నేషనల్ బోల్షివిజంయొక్క' అస్థాయిక [illegible]గానూ, ఈ నేషనల్ బోల్షివిజం' జర్మన్ కమ్యూనిస్టు పార్టీని, ఒక పిశాచంలా ఆవేశించి పట్టుకునివదల్లేదు. అది యిప్పుడు మళ్ళీ రష్యావారి మద్దతుతో జర్మనీ ప్రజాస్వామిక భవిష్యత్తునూ, యూరప్ భవిష్యత్తునూ కూడా సర్వనాశనం చేయటానికి సిద్ధమై కూర్చున్నది. విల్‌హెల్మ్ పెయిక్ నేడు ఆ సర్వనాశన శక్తికి ప్రతిమూర్తిగా వున్నాడు.



ఢిల్లీ లక్ష్మీనారాయణ దేవాలయంలో గీతాజయంతి మహోత్సవాలలో పాల్గొన్న తరుణంలో గవర్నర్ జనరల్ సి. రాజగోపాలాచారిగారు పండిట్ గోవింద మాలవ్యాగారితో సంభాషించుతున్న దృశ్యం.



ఇటీవల అమెరికాలో జరిగిన నీగ్రో మహిళల జాతీయమహాసభకు అధ్యక్షుడు ట్రూమన్ గౌరవాతిథిగా ప్రారంభోత్సవం చేశారు. ఆ సందర్భంలో ట్రూమన్ మహిళాసంఘం వ్యవస్థాపకురాలు మేరీ మాక్లియాడ్ బెతూన్‌సతిని అభినందించారు. మానవజాతికి ఇతోధిక సేవచేసినవారుగా కొంతమందికి ప్రత్యేక బహుమానాలిచ్చారు. అలాంటి బహుమానాలు శ్రీమతి విజయలక్ష్మీ పండిట్, రాల్ఫ్ బంచ్ గార్లుకూడా స్వీకరించారు. చిత్రంలోవున్న వారు: ట్రూమన్, బెతూన్‌సతి, విజయలక్ష్మీ పండిట్, బంచ్.

65 వ జన్మదినం జరుపుకుంటున్న డా॥ ప్రసాద్, ఆయన మనుమలతో

# స్వర్గానికి నిచ్చెనలు

## కవిసమ్రాట్: శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

౨౧

మువ్వురు తీసినట్లు కనిపించకుండ సులభముగా లెక్కలు. రామశాస్త్రి నిరూపించి, మహాశాస్త్రి తగినంత యుక్తికి జలిసెను. మహాశాస్త్రి సంపన్న గృహస్థు. అతని కు కుమార్తెలు. అల్లుండ్రును ధనవంతు. పెద్దయల్లుడు రాజధానీనగరములో ఒకపాటిక రూపాయల జీతమువాడు. పని కొక యేబది యెకరముల మాగాని యుండు. ఆతనిపేరు నరసింహమూర్తి. లోభి.

గాలుక కోపిష్ఠికాన్నను దమ్మిడీ బయట పెట్టడు. చివరకు భార్యకు చీరలుకూడ కొనడు. ఆమె కట్టుకొనుచున్న చీరలు వినుసపట్టినతోడనే పుట్టింటికి వచ్చును. అచట రెండుమూడు నెల లుండును. వచలి పోవునపుడు కావలసినవన్నియు దీసికొని పోవును. నరసింహము తా నింటిలోనికి బప్పుప్పులయిన సరిగా దీసికొనిరాడు. కాని యతనికి జ్యోతిషపుపిచ్చి గలదు. తన జాతకచక్రమును, చేయియు జూపించినవారికి జూపింపకుండ జూపించును. అరచి చచ్చినను దమ్మిడి యెవ్వరికిని రాల్చని యీ నరసింహము జ్యోతిష్కులు వచ్చినను సాముద్రికులు వచ్చినను మంత్రశాస్త్రవేత్తలు వచ్చినను తెగ ఖర్చు పెట్టును. అప్పు డింటిలో పెండ్లి జరిగినట్లే. వా డొక్కొక్కడు పది దినములకు దక్కువ యుండిపోడు. ఆ పదిదినములు వారియిల్లు దివాణము. రెండవయల్లుడు వంద యెకరముల యాసామి. ఇంగ్లీషు చదువుకొన్నాడుగాని యుద్యోగము చేయ నన్నెను. ఇంటివద్దనే యుండును, వ్యవసాయము చేయించును. అ యల్లుని కీ యల్లునకు నన్ని విషయములయందును పోలిక యనునది లేదు. అత డెంత లోభియో యితడంత వితరణి. ఈయనపేరు గోపాలరావు. గోపాలుడు సామాన్యముగా భార్యను పుట్టింటికి బంపింపడు. ఆమెను జూచినచో నొక జమీందారుభాగ్యవతివలె నుండును. ఆమె యనూర్యంపశ్య. నిత్యము సర్వాభరణభూషితయై జరిపంచు దువ్వలువలు దాల్చి శిల మాయకుండ వలంత మాయకుండ మహారాణివలె నుండును. గోపాలునకు జ్యోతిషమునందు నమ్మకము లేదు. సాముద్రికమన్నం దంతకంటె నుండ లేదు. బ్రాహ్మణు డింటికి వచ్చినచో యథేచ్ఛముగా నింటిలో దినిపోవచ్చునుగాని యెవ్వరేగాని ఖర్చులేదు. నటకులకు, గాయకులకు, చిత్రకళావేత్తలకు, సమృద్ధిగా నిచ్చును, వేదవిద్యార్థుల కిచ్చును. అతనికి వ్యామోహములు లేవు, సిగరెట్టయినను త్రావడు. ఈ యిద్దరల్లుండ్ర సంగతి వామదేవుడు తెలిసికొనెను. నరసింహమునకు మామగారి యాస్తిమీద గోరిక కలదు. గోపాలునకు లేదు. మామగారికి బుత్రోదయ మయినచో గోపాలము సంతోషించును. నరసింహామున కభిమతము గాదు. అభిమతము గాదు సరికదా! భార్యతో చెప్పుడును మామగారి సుతోదయవాంఛను గూర్చి వెకసక్కెము లాడుచుండును. "ఆయన కరువదియేండ్లు వచ్చినవి. ఇంకను సంతానము కలుగునట. గొడ్డురాలికి బిడ్డలు కలిగినట్లే" యని భార్యతో నన్నగా నామె "మా నాయనగారికి యరువదియేండ్లు కాదు. యేబదియొనిమిదియే యనెను. "ఎట్లో యేబదియెనిమిది కాదు. ఇరువదియెనిమిది"దని యిత డుపాలంభించును. రామశాస్త్రిని వచ్చి తన యింటిలో నుండుమని గోపాలము నును రామశాస్త్రికి నలుబది యెకరముల సుక్షేత్రమైన మాగాణి కలదు. ఆయనభార్యకు నలుబదియేండ్లు దాటినవి. తనకు బురుషసంతానము కలదని యే దైవజ్ఞుడును చెప్పుచుండును. మొదటి సారి వానలో వామదేవుడు నక్కుచున్నప్పుడు రామశాస్త్రి యీ మహాయోగివలన నా మహాసిద్ధునివలన, నా పరమేశ్వరుని వలన మరల దానిని వినెను. ఆ వామదేవుడు తరువాత రెండేండ్లవరకును గన్పించనేలేదు. ఇప్పుడు కన్పించెను. రామశాస్త్రి ప్రతిదిన మభియుక్తుల జేరగా నిలయమునకు బోవును. వామదేవునితో మాటాడుటకు బ్రయత్నించును. వామదేవుడు మాటాడడు.

ఇట్లుండగా నొకనా డర్ధరాత్రమున వామదేవుడు పెద్దచలిలో రామశాస్త్రి వీధియరుగుమీద బండుకొని యుండెను. రామశాస్త్రి వీధిలోనికి వచ్చి చూచి యెవరువా రతని యడిగి తెలిసి కొని "స్వామీ! చలిలో నిచ్చట నేలను. లోనికి దయచేయుడని ప్రార్థించెను. వామదేవుడు మాటాడకుండ లేచిపోయెను. నీ కర్మపరిపాకము పొందినపుడు మా యనుగ్రహము కలుగును. అప్పుడు మేము వత్తుమని చెప్పి నడచిపోయెను. పోయి యూం జనేయునిగుడివద్ద నున్న యుటుటి సభయరుగుమీద బండుకొనెను. అది లొలి సాదు మొదటిన లీలయిల్లు. లీలభర్త సుబ్బయ్య. సుబ్బయ్య పొలాకొక చేతిలో గుమాస్తా. అతనికి నలుబదిరూకల జీతము. అతనికి బిల్లలు లేరు. ముసలితల్లి యుండెడిది. చనిపోయినది. అతనికి మెట్టపేరుగులో బాటకపుబెకరముల పొలమున్నది. దాని మీద సాలునకు నరువదిరూకల యాదాయము వచ్చును. స్వతంత్రమైన యిల్లున్నది. భార్యాభర్త లిద్దరికి సంసారము గ్రుడ్డిలో మెల్లగా సాగుచున్నది. సుబ్బయ్య మట్టిబొమ్మ. లీల బంగారుబొమ్మ. కాని లీలచాల బుద్ధిమంతురాలు. వాడకల్లవన్నె తెచ్చినది. ఈ విషమదాంపత్యము దుర్జనుల కెంత మోహోపాదకమయినదో! యీ మెసౌశీల్యముచేత నంత మోహావిచ్ఛేదక మయినది. సౌశీల్య మనునది సహజముగా దనువున బుట్టును. పరిస్థితులు లొక్కొక్కవేళ దానికి విచ్ఛేదకముగా నుండవచ్చును, మరియొకొక్కప్పుడు ప్రోద్బలకముగా నుండవచ్చును. ఆమె పేరు చెప్పినచో నా చుట్టుపట్ల నామెకాంతను, నామెసౌందర్యము, నామెను గన్నెత్తి చూడరాని లక్షణము ప్రశంసాతీతమైనవి. ప్రశంసాతీత మనగా? జనులు పొగడి పొగడి సహజమైనస్థితిగా నంగీకరించి యూరకుండిరని యర్థము.

ఆ రాత్రి సుబ్బయ్య బయటకు రాలేదు. వామదేవుని జూడలేదు. లీల తదారభ్య మొదట రెండుమూన్నాళ్లు వామదేవుని ప్రశంస విన్నది. ఆమె పట్టించుకోలేదు. రెండేండ్లు గడచినతర్వాత మరల వామదేవుని ప్రస్తావము వినిపించినది. నీలసంగతి నోటనోట చెప్పికొనుచున్నారు. హరశాస్త్రిమరణమునుగూర్చి చిలవలుపలవలుగా వార్తలు ప్రయాణములు చేయుచుండెను. వామదేవు డనినచో భక్తియు గౌరవమును వినినిమించి భయమును బట్టణములో గొన్నియెడల దాంపవించుచుండెను. రామశాస్త్రిగారి భార్యకు, లీలకు నాకానిపోకానిసంబంధమున్నది. ఆయనమూడవలేరముమీన బ్రిలీలనాయనమ్మకు మేనమామకూతురో? యేదోకి యనునట. అందుచే నెప్పుడయిన రామశాస్త్రిభార్యయయిన కామాక్షమ్మ లీలయింటికి వచ్చును. లీల యెవ్వరి యింటికినిబోదు. ఆ మరునాడు కామాక్షమ్మ లీలయింటికివచ్చి వామదేవు డంత చలిలో నిరుత్తరీయుడై తమయింటి యరుగుమీద బండుకొనుట, యోగులు ద్వంద్వాతీతులగుట వారికి నెవరిమీద ననుగ్రహము కలుగునో వారియింటికే వారు వచ్చుట మొదలయినవి గంటసేపు ప్రసంగించి వెడలిపోయెను. తరువాత నాల్గునాళ్లకు ప్రొద్దు గ్రుంకినతర్వాత వామదేవుడు యాదృచ్ఛికముగా వారియింటిముందుగ బోవుచు లీలయింటిలోనికి బోయెను. సుబ్బయ్య గౌరవముచేసెను. నాటిరాత్రి వారియింటిలో భోజనము చేయుమనెను. వామదేవుడు తనకు శిష్యులు కానివారి యింటిలో దాను భోజనము చేయ ననెను. సుబ్బయ్య నాటిరాత్రి వామదేవుని శిష్యుడయ్యెను. శిష్యు డగుట యనగా మనోవాక్కాయములచేత గురుద్రోహము చేయరాదు. శరీరాత్మలు రెండును గుర్వర్థమునకు సమర్పణము చేయవలయును. గురువుయొక్క యుచ్ఛిష్టము తినవలయును. శరీరము మిథ్య. దానియం దభిమానమును, మోహమును సంపూర్ణముగా నశింపజేయవలయును.

"గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః గురు స్సాక్షాత్పరబ్రహ్మ" ఆరాత్రి భార్యాభర్త లిద్దరు గురూచ్ఛిష్టమును భుజించిరి. ఉచ్ఛిష్ట మనగా? గురువు తిన్నతర్వాత తినుట కాదు. గురువు తాను భోజనము చేయుచు తన విస్తరిలోనుండి తన తినుచున్న యెంగిలిముద్ద వారి విస్తళ్లలో వేయుట. అది యొకదీక్ష. దాని పరీక్షలు చాల యున్నవి. గురువు విషమును త్రాగుమన్నచో త్రాగి తీరవలయును. గురువునందు సంపూర్ణముగా విశ్వసించినవానికి మరణభయము లేదు. సేవ నీళ్లలో గలిపి యిది యమృత మని త్రాగు మన్నచో త్రావితీరవలయును. ఇట్టి యనేకములయిన పరీక్షలకు సుబ్బయ్యయు లీలయు దాళుకొనిరి. గురువులో శిష్యు లంతర్భాగము. గురువు పరమేశ్వరుడు, పరిపూర్ణుడు. అతనియందు దోషముండదు. అతడు చేసినపని దోష మనుకొనుట గురుద్రోహము. మోక్షభంజకము. ఈరీతిగా లీలయు, నీలవలె నయినది. నీలకు లీలకు భేద మేమనగా? నీలలో శృంగారభావము చాలలేదు. లీలలో శృంగారభావమే లేదు. ఆమె యమాయకురాలు. తా నొక విచిత్రమయిన యవిజ్ఞాతమయిన మనోభావములోనుండి సర్వము గుర్వర్థముగా భావించుచుండెను. మనోవాక్కాయములచేత నంతయు గురుకైంకర్యముగా భావించుచుండెను. లీలను గురించి పన్నని యప్రతిష్ఠ పొరలుకట్టి సాగినది. కాని యది విజృంభించలేదు. ఆమెప్రవర్తనలో నొంటినాటికి నేటి కేమియు భేదము లేదు. పూర్వముకన్న నామెయం దొక యతిశయము గన్పించెను. ఆ మెయందు బూర్వ మొక సామాన్యమయిన భక్తిప్రపత్తులును నాచారములు నుండెడివి. ఇప్పు డవి విపరీతమయిపోయినవి. కోడికూతతో మేల్కాంచి చన్నీళ్ల తెలార స్నానముచేసి పగలు పన్నెండు గంటలవరకు ధ్యానమునందే యుండును. ప్రొద్దు గ్రుంకినతర్వాత మరల జపప్రయత్నమై ప్రొద్దుపోవువరకు నట్లే యుండును. ఇరుగమ్మలు పొరుగమ్మలు వచ్చి చూతురు. ఆమెయొక్క నియమతీవ్రత వారియందరి సంశయచ్ఛేదకముగా నుండును. అహా! యెంత యమాయకమయిన ప్రవృత్తి? ఎంత గురుభక్తి? తర్కాతీత మయినను స్పృశించని ధైర్యంతటి యచ్ఛమైన నిశ్చలబుద్ధి? ఆమె శరీర మామెకు దెలియదు. ఆమెమనస్సామెకు దెలియదు. ఆమెయాత్మ యామెకు దెలియదు. సరిగా త్రిశంకుస్వర్గమనగ నిదియే.

దేవతానిలయమున కొడమశరూళిమని పేరు వచ్చినది. ఈ పేరు వచ్చుటకు గారణము తరువాత చెప్పబడును. ఈ మఠమేళములోనికి మరియొకయువతి వచ్చెను. ఆమె పేరు శారద. ఈమె కొత్తదికాదు. పూర్వము మాటలు రాక పిడుసుపడినప్పుడు మాటలువచ్చిన స్త్రీ యీమెయే. ఒక్కొక్క స్త్రీ యొక్కొక్క విలక్షణమయిన శరీరవిన్యాసము గలది యనుటచేత నావిన్యాసము శారదయందు మిక్కిలియు విలక్షణమైనదై యామెశరీరసౌభాగ్యము, యౌవనమహోద్బోధదేహాళి విహితమందారమాలికాసదృశమయిన దగుటచేత నిలయముయొక్క ప్రతిష్ఠ మిక్కిలియు నెక్కువయయ్యెను. శారద రెండేండ్లుగా భర్తతో నిల యమునకు బోవలయు నని పోరాడుచుండెను. ఆ దేవతామహత్త్వములవలననే నవకు వాణిజ్యవ్యాపారము కలిగెను. భార్యాభర్తలు తా మిద్దరు జీవితాంత మా నిలయమునకు దను, మనో, ధన, ప్రాణములతో గృహస్థులై యుండవలయును. చెవిలో నిల్లుకట్టుకొని పోరగాపోరగా నామెభర్త యంగీకరించెను. కొందరు చిత్రమైనసృష్టి. వివేక మవివేకము రెండును గలిసియుండును. లౌకికముగా నెంతయేని వివేకవంతులుగా గన్పించుచుందురు. లోకవ్యవహారమునందు గాసలసినంత గడుసుదనముండును. అంత గడుసుదనములో నొక చోట వారు పడెదుభ్రాంతి నిరవధికముగ నుండును. శారదభర్త తాదృశుడు. నిలయమునకు వచ్చిన శారద నిలయమునందే యుండిపోయెను. అతడు కొన్నాళ్లుండి వెడలిపోయెను. శారద ప్రార్థనలలో, భజనలలో, గురుదీక్షలలో నిమగ్నురాలయ్యెను.

వామదేవుడు రామశాస్త్రియింటికి దరుచుగా బోవుచుండెను. రామశాస్త్రి యింటిలో గలశము పెట్టెను. నిర్మలమైన దేవతాపూజలు సర్వసలు సాగుచుండెను. చుట్టుపట్ల నమ్మలక్కలందరు వత్తురు. ప్రొద్దుపోవువరకు గూర్చుందురు. ప్రసాదము స్వీకరించి వెడలిపోవుదురు. ప్రతి శనివారము నిది జరుగుచుండెను. ఒక శనివారమున రామశాస్త్రి వామదేవుని వినయవినమితోత్తమాంగుడై "స్వామీ! మీ సంపూర్ణానుగ్రహ మెప్పుడు కలుగు"నని ప్రశ్నించెను. వామదేవు డా "రాత్రియే" యని చెప్పెను. కాని సంపూర్ణ మయిన ఫలోదయమునకు రెండుమాసములు గడువు పెట్టెను. ఆనాడు పూర్ణాహుతియు సంభావితికమును జరుగవలయును. ఈలోపుగా రామశాస్త్రియొక్క ధనము నీటి కన్న గనాకష్టముగ వ్యయ మగుచుండెను. వామదేవుడు ప్రతిశనివారమున వేయి రూపాయలు ఖర్చు పెట్టించుచుండెను. ఒకనాడు వామదేవుడు ప్రయాగలో సప్తర్షులను గలిసికొనవలయును. మరియొకనాడు కైలాసశిఖరమున సిద్ధసాధ్యకిన్నరుల నృత్యము జూడబోవలయును. మరియొకనాడు సత్యలోకమున హంసోత్సవము జరుగును. బ్రహ్మదేవుని వాహనమయిన రాజహంసాధిపతి నాడు బ్రహ్మవాహన మయిన మొదటిదినము. ఆనాడు సరస్వతీదేవియొక్క కచ్ఛపీపూజయు, నారదుని మహతీపూజయు జరుగును. భక్తులందరు నెలకొక తీగయు కొని తీసికొని పోవలయును. ఇట్టి వ్యయములు వరిదలాడి రామశాస్త్రికి దప్పలేదు. పుట్టినంత మేర ధనము త్రవ్వి తెచ్చెను. తాకట్లు పెట్టెను. పొల మమ్మజూపెను. కాని యాయనకు వామదేవునియందు విశ్వాసము సడలలేదు. ఆ వేలయువతి వృద్ధి బొందుచుండెను. ఆనాటిరాత్రి గొప్ప మహాయజ్ఞము. గడిలో నామాక్షమ్మ సురుపావనులకోవద శివస్తు నంచి ధ్యానమున్నదై యుండెను. సాంబ్రాణి, హారతికర్పూరము, అగురు మొదలైన సుగంధద్రవ్యములయొక్క ధూమము గది యంతయు సమావృతమై యుండెను. ఆనాడు పూర్ణిమ. రామశాస్త్రి దొడ్డిలో తులసికోటవద్ద నిలచుండి చేతులు జోడించి చంద్రునివంక జూచుచు గురూపదిష్టమైన మంత్రమును జపించుచుండెను. రాత్రి పండ్రెండుగంట లయినది. వాడయింటివారు నిద్రపోవుచున్నది. కామాక్షమ్మకు నలుబదియైదేండ్లు. ఆమె స్వచ్ఛమైన సంసారిణి. గురుపాదనిహితమయిన మస్తకము గురుయు స్తకనిహిత మయ్యెను. ఆమెపాదములు గురుపాదనిహితము లయ్యెను. గురువు రెండుగంటలకు వెడలిపోయెను. తరువాత భార్యాభర్తలిద్దరు గురుస్పర్శచేత బవిత్రములయిన శరీరములను యాలవలెనె బవిత్రములు చేసికొనిరి. పరమేశ్వరానుగ్రహము వారియందు బరిపూర్ణముగా ఫలించినట్లు భావించిరి. ఆస్తికి వారసుడు కావలె ననుకొనెను, రామశాస్త్రి. ఆస్తి యుంచుమించుగా బోయినవేళ వారసుడు కలుగునేమో?

౨౨

దూరంతయు రెండు చెక్కలయినది. నిలయపు చెక్క నిలయేతరమైన చెక్క. సనాతనులందరు నిలయపు చెక్కలో జేరిరి. జనములో గల్లు మార్పు జరిగినట్లు తెలియదు. ప్రారంభములు, ఫలానుమేయము లన్నట్లుండును. ఎప్పు డే యుద్రేక మెచ్చట బయలు దేరునో? అది యెట్లు పరిణామము చెందునో? మాత్సర్యమె కంటికి సూపాకు నందరానిదిగా నుండును. నిలయము యాపనుకట్టినప్పటినుండియు మరియొక ప్రతిపక్షి గ్రామములో బయలుదేరెను. ఇది "యావ" నినచో గాథు "గేద" యనువా రెప్పుడు నుండుదురు. ఆస్తికమత మెప్పుడు పుట్టినదో నాస్తికమతము నప్పుడే పుట్టినది. ఆస్తికమతము పారలౌకికము. నాస్తికమత మిహలౌకికము. రామాపురములో నాస్తికమతమునకు బూర్వము విజృంభణము లేదు. ఏమతమయినను విజృంభించుటకు దగినపరిస్థితులు చేర్పడవలయును. కాని ప్రపంచముయొక్క చరిత్రలో నాస్తికమతము విజృంభించి సర్వజగత్తు నాక్రమించినది. కాల మెప్పుడును గనుపించదు. ఆ నాస్తికమతముకూడ నే బాధ్యత మనియో పేరుపెట్టుకొని విజృంభించవలయును గాని దానియంత దానికి శక్తి చాలదు. నాస్తికమత మేమి? ఆస్తికమత మేమి ఏదో యొక తోడు గుతో డిగికొనవలయును. పట్టికుర్చీ నాపించి దీనిని రా జనుకొనవలయును. అన్నచో నెవ్వరు ననుకొనరు. ఒకపురుషు డచ్చట రాజువలె గూర్చుండవలయును. వాడు శిక్షించినచో మాటాడకుండ నూరకొందురు. వానిశాసనమును బుద్ధిపూర్వకముగా నంగీకరింతురు. ఈ మానవప్రకృతి విచిత్రమయినది. ఎవనిపని వాడు చూచుకొనడు. పగవానికి పగమజనను పరులపని తీర్చిపెట్టుడువాడె. రాజకీయవేత్తలు, మతకర్తలు వీరిలో బ్రభావులు "స్వయం తీర్ణః పరాంస్తారయతి" యన్న దానికంటె మిథ్యావాదము లేదు. తాను తీర్ణుడగుట యెన్నడును లేదు. వాడు పరులను దరింపజేయుటకే పుట్టుచున్నాడు. ఇట్టి జనుల సంఖ్య వృద్ధిబొందినకొలది కలికాలము వృద్ధిబొందుచున్నది. లోకమును మోసముచేసి ప్రతారించువారు నాస్తికులలోనే పుట్టుదు రనుటకు వీలులేదు. ఆస్తికులలో నెక్కువమంది పుట్టుదురు. ఆస్తికుగాని నాస్తికుగాని వాని జీవికకాధారమయినప్పుడు వాడు కేవలము గాకతప్పదు. ఒక యధికారవాంఛయో, కామకత్వమో? యధికముగా నెన్న వృగురుషుడు వాని కీర్తికాంక్షలో నేదియో యొకదానితో డు గుతో డిగికొనును. అది ధనము, కీర్తి, పూజలు, లోకసంగ్రహము. తదన్యమానలవర్ధనుండి ధనమును సంగ్రహించుట. ధన మెవ్వరికైనా నన్నప్పుడు వితరణ మేలను కుండను? వితరణశబ్దవాచ్యము గాని వితరణము లోకమునందు సర్వథా ప్రచురదేశమందుండును. కీర్తి వచ్చునను నాశ దొక్కటి. ఈ యశోవాంఛ సర్వజనసామాన్యమయినది. అధికారవాంఛ సంఘబలము కలవానికుండును. కామవాంఛ యౌవనవశవర్తులకుండును. యశోవాంఛ నిరవసానకమయినది. తృణకీటకపిపీలికాదివ్యాపించి యున్నది. అధికార, కామ, యశోవాంఛలు మూడును తా మొకనికి గలిసినచ్చును. ఆస్తికత్వముచేత గామవాంఛ సాగును నాస్తికత్వముచేతను గామవాంఛ తీరును. ఆస్తికులలో బలవత్కములయిన యీ స్తికులెట్లుందురో! నాస్తికులలో గూడ నట్టే యుందురు. ఆస్తికులమీద గోపముచేత నొకడు నాస్తికుడు. ఆస్తికులలో గొందరు జీవితములలో నై పెట్టిన నున్నారు. తానా పెట్టినపని జేరుట సాధ్యము కాదుగావున తాను నాస్తికుడు. జీవితములో నెదో పొరపాటు జరిగి యొకడు భ్రష్టుడైనాడు. అప్పటినుండి నాస్తికుడు. వాడు వాచాటు డయినచో, వాడు విద్యావంతు డయినచో, వాడు పలుకుబడి గలవా డయినచో, నాస్తికభావవ్యాప్తి. ఒక మతమునందు నుండిన సర్వజనులు క్రూరు లని, మరియొక మతస్థులు కారని లేదు. ఒకని క్రౌర్యము సాగును. మరియొకనిది సాగదు. సాగుటయు సాగకపోవుటయు గాలాధీనము. ఒకనాడు క్షత్రియులు క్రూరులయి బ్రాహ్మణులను హింసించిరి. బ్రాహ్మణులకు గాలముకలసి వచ్చినప్పుడు భార్గవరామపురస్సరులై క్షత్రియులను హింసించిరి. అధికసంఖ్యాకులయిన ముసల్మానులు భారతదేశముమీద దండెత్తి భారతీయులను హింసించిరి. మగల హిందువులు నిలవద్రొక్కుకొని వారిని హింసించిరి. "ఈ మానవచరిత్ర హింసయొక్క చరిత్ర" యన్నవాడు మహాకవియే. కొందరు రిభూమిని స్వర్గము జేయుదు మందురు. వారు నిజముగా వివేకులు. భగవంతుడు చేయలేకపోయెను, తదంశావతారములు చేయలేకపోయెను. తల్లికావతారములు చేయలేదు. ఆ యవతారములవంటి పురుషులు, వారిలో నూటికి గొన్నిపాళ్లయినను యాథార్థ్య ముండును. ఆరంభించుటయే ప్రతారణబుద్ధితో నారంభించిన లోకము మరి యెంత బాగుపడును?

గౌతముడు నాస్తికుడు. నాస్తికమతమునకు దేవుడు లే డనునది ప్రధానసూత్రము. ప్రధానసూత్రములతో నేమియు లేదు. తత్ప్రత్యేకవ్యాఖ్యానములలో వచ్చును. ప్రధానసూత్రము పట్టి భావరూపమయిన విషయమును చెప్పును. వ్యాఖ్యానములును, భాష్యములును నాచారకాండను పెంచును, లోకమునకు బ్రధానమయినది యాచారకాండ. ఆచారదశయందు మానవసృష్టి తన. సర్వేంద్రియముల వ్యవహారములతో నానివిషయములతో కామక్రోధాదులతో నిండియుండును. ఆ నిరూపితమయిన యాచారమునకు నీ ప్రవర్తించుచున్న యింద్రియాభిలాషకు నిత్యసన్నికర్షము, నిత్యసంఘర్షణము. రాజుగాని రాజస్థానీయుడుగాని నిష్పాక్షికముగా బాలనచేయవలయును. నిష్పాక్షికముగా నన్నచో బహుశ లేకుండ నుండవలయును. ప్రస్తుతజగత్తులో రాజ్యపాలనమంత యు రాజకీయపక్షములమీద నే యాధారపడి యున్నప్పుడు నిష్పాక్షిక మన్నశబ్దమే లేదు. ఈ రాజకీయము తనపక్షము రాజకీయములలోననే యుంచుకొన్నచో లోకమునకు సంపూర్ణముగా నష్టము గలుగదు. ఈ పక్షచ్ఛాయ మతములమీద, సంఘముమీద, విద్యమీద, సుద్యోగములమీద, నేలమీద, స్త్రీలమీద గూడ వ్యాపించినచో మరి యేమి చెప్పవలయును? కలియొక్క విజృంభణ మని చెప్పవలయును. రామాపురములోని నాస్తికమతము పట్టి నాస్తికమత మయినచో దప్పేమియు లేదు. ఇక్కడ మొక్క వేసినచో పెరిగి చెట్టయి కాయకాచును. అక్కడ వేసినచో మరునాటికి వాడుమూపును. ఆ నేల యటువంటిది. ఈ నేల యిటువంటిది. భూమిని దండించుమా? ఆ మొక్క తాను మాడినది చాలక దానికి నన్న గొంగళిపురుగుపట్టి తోటయంతయు బాడుచేసినచో విచారపడవలయును. ఈ గొంగళిపురుగు వాడినమొక్కకే పట్టునని యేమి యున్నది? పొట్లపాదో బీరపాదో! మంచి యేపుమీద వచ్చుచున్నది. దానియందును గొంగళిపురుగు పట్టినది. ఈపురుగు గాలిలో పుట్టును. పెట్టునన్న దప్పులేదు. నేలనన్న దప్పలేదు. ఈ పురుగు బలిసి యన్నము తిననీయదు. ఒడలిమీద బ్రాకి కంపరమెత్తించును. నిదురపోనీయదు. కప్పకొన్న గుప్పటిమీద నది ప్రాకినది కాబోలు? అబ్బా!

పాపము గౌతముడు సూత్రదశలోనివాడు. అతని యనుయాయు లాచారదశామూర్తులు. ఆస్తికత్వములో నొక చమత్కార మున్నది. ఎంత దుర్మార్గము చేసినను వానిలో నమోఘములే చేయగల్గుదురు. నాస్తికత్వ మట్లు గాదు. ఇందులో దుర్మార్గము చేసెడివాడు మనోల్పులు. ఇదియొక విచిత్రమయిన భేదము. మనుష్యుచేత బెద్దవాండ్రను చెడిపోయినచో దానికుంప తెగినదే! బ్రతికి బట్టకట్టగలిగినవారు బాలురున్నారు, వారితంతులో బాసపడవచ్చు ననుకొనవచ్చును. ఈ నాస్తికమతము బాలురనే పాడుచేయును. ఆస్తికులు పెద్దవారు పాడయిపోయినను బాలురకు మంచిమాటలు చెప్పుదురు. నాస్తికులు విపరీతము. గ్రామములోని యువకులలో బాహుపుష్టి కలవారు, రొమ్ముపుష్టి గలవారు గౌతమునిమతము స్వీకరించిరి. ఈ మతము రామాపురములో విజృంభించెను. మతి మొక వేర్పాటుచేయుట జరుగవలయునుగాని వానిసూత్రములు సూత్రములుగా నుండవు. మతము సూత్రముల ననుసరించి యుండదు. భావ్యముల ననుసరించి యుండును, రామానుజమతమును, శాంకరమతమును సున్న విగాని నైయాసికీమతము లేదు, అట్లే గౌతమునకు భాష్యకారులయిన శిష్యులు బయలుదేరిరి. వారిలో గొందరు ప్రళయవాదులు. ప్రళయవాదులనగా నుండు సర్వము నశింపజేయుదు మందురు. నాశనములోనుండి నూతనసృష్టి బయలుదేరు నని వారి వాదము. సర్వము నశించినతరువాత దానియంతట నది యెట్లు పుట్టునో తెలియవేదము. వారి మేధాబీజము పాశ్చాత్యదేశములయందలి పరిణామవాదగతవిశ్వాసజన్యము. అచేతన మయినవాని నుండి చేతనము పుట్టును జడమునుండి ప్రాణము సముద్భవించును. అనాత్మవస్తువు నుండి యాత్మ యావిర్భవించును. అన్యోన్యవిరోధివస్తువు లన్యోన్యప్రతిపాదకము లెట్లగునో? వారి తర్కము వారికే తెలియవలయును, అది తర్కము గాదు. విశ్వాసము. విశ్వాసము పరబ్రహ్మస్వరూపము. మరియు నా విశ్వాసమును రక్షించునది పోషించునది దేహబల మయినచో నోరెత్తుటకు వీలులేదు.

గౌతముని శిష్యులు గ్రామమంతట నిండి యుండిరి. అతని శిష్యు లనుటయేగాని వారిలో నూటికి తొంబదిమంది యతని యనుయాయులు గారు. ఎక్కువమంది ప్రళయవాదులు. వారు దైనందినసభలు చేయుచుందురు. ఈ యాస్తికమతము మూఢవిశ్వాసములతో నిండియున్నది గావున దీనిని సమూలచ్ఛేదము చేయవలయునని వారి నిశ్చితాభిప్రాయము. దానికి వారవలంబించు మార్గములు శతశస్సహస్రశోఖలహేతువులుగా నుండును. బాగుగా నాస్తికులని తెలియబడినవారు పీఠవింటవచదుటకు వీలులేదు. వారి పిల్లలు బడులలో జదువుటకు వీలులేదు. ఊరిలో సర్వజనులు సాయంవాహ్యాళికి బోవుటకు బురపాలకసంఘమువారు తోట నొకదానిని వేసి దానిలో రేడియో పెట్టిరి. ఆస్తికు డెవరయిన రేడియో వినుటకు వచ్చెనా! యొకడో ప్రళయవాది "యేమిరా! నీ మొగమునకుదోడు రేడియో వినవలయునా?" యని తూలనాడి వాడు వెంటనే సరిగా నింటికి బోయినచో ఫర్వాలేదు. పోనిచో గొంతెము దేహశుద్ధిగూడ జేయును. వాడు నాస్తికుడు గావున నాత్మశుద్ధి పూర్వమే యయినది. మిగిలినది దేహశుద్ధి. అదియు న్యాయమే. ప్రళయవాదులు రొమ్ములు విరుచుకొని భ్రూలతలయందు దీక్షత్వము తాండవించగా వీధులవెంట సంచరించుచుండ రామాపురము గ్రామమువలె లేదు. అడవి వలె నుండెను.

ప్రళయవాదులు వామదేవునిమీద గత్తికట్టిరి. వాని నొక తడి పెట్టిరేగాని వారికి నిద్రపట్టదు. ఇది జరుగుటకు రెండు హేతువులు గలవు. మొదటిది సంఘస్థితి. రెండవది వామదేవుని వివేకము. అతడు మహాపతివ్రతామణి యొక్క యాజ్ఞాసులోనుండి వెడలివచ్చును. అతడు దానిని గర్భు నసగా రాడు. ఆ స్థలమునందు సనగా నుండడు. మరియు దొమ్మిగా బోవుటకు రాజకీయ మంత పల్లిపోలేదు. రాజకీయము లాంఛనముగా నెంత కలుషిత మయినను భావవీథుల యందు విపరిణామము చెందినవి గాని ప్రత్యక్షశరీరవ్యవహారదశయందు నింతి ప్రచ్ఛన్నముగానే వ్యవహారము చేయుచున్నది. దొమ్మి జరిగినంతనే రక్షకభటులు వత్తురు. న్యాయస్థానములు, వాయిదాలు, శిక్షలు జరుగును. శిక్షాసమయమున శిక్ష హెచ్చుటలోనో తగ్గుటలోనో రాజకీయములు పనిచేసినను ఫలిత మనిశ్చితము. వ్యవహారదశాకాలము శ్రమహేతువు బాధాజనకము. ఆ భయముచేత దొమ్మిజోలికి బోరు. అందుచే నాస్తికవాదుల తీర్మానములు సంపూర్ణముగా ఫలవంతము లగుట లేదు.

వారు సర్వతః రామాపురమునుండి యాస్తికమతమును ధ్వంసించి వేయవలయునని సంకల్పించుకొనిరి. దీనికి మరియొక యభ్యంతర మున్నది. ఎంత కాదన్నను మాలగురువు గౌతముడు. భూషణమును గౌతముడును సన్నిహితబంధువులు. భూషణముగారు చాల మంచివాడు. నాస్తికపక్ష మింత ప్రబలినను, నిలయవాసులను నిత్యము బాధించుచున్నను భూషణము జోలికి బోరు. ఇది యీ యూరి నాస్తికవాదుల దుర్బలత్వము. సిద్ధాంతముయొక్క తీవ్రత్వ మెట్లుండవలయుననగా దన సిద్ధాంతమునకు వ్యతిరేకు లయినచో దండ్రియయినను దల్లియయినను నరికివేయవలయును. సత్పురుషుడు డని శాంతుడు డని భూషణముజోలికి బోలేని యీ జట్టు తమ సిద్ధాంతము నెట్లు నిలవద్రొక్కుకొనును? ఒక పురుషుడు శాంతు డని సత్పురుషుడని గౌరవించువారు నిజముగా నాస్తికులా? యని యొక ప్రశ్న. వారు నాస్తికులు నిజముగా గారు. వారు హృదయములయం దాస్తికులే. వారి మనస్సులు, వారి భావములు, వారి బుద్ధులు కలుషితములు చేయబడి వారు నాస్తికులుగా నయిరి. కాని పరిస్థితుల యొత్తిడి మిక్కిలి చెడ్డది. వారి నెన్ని త్రోవలనయిన నడిపించును. శాంతము, దయ, ధర్మము, వినయము మొదలయిన సద్గుణము లుండవలయు నని బోధించు ఆస్తికమతముతో నదే క్రూరత్వము, లోకవిద్రోహకరమయిన కామవాంఛ, సంఘమును కలుషితము చేయు దుర్వ్యవసాయము ప్రబలియుండ గా నాస్తికమతములో నేల యుండరాదు? ఈ లెక్కను జూచినచో నేకదేశమునందు తీవ్రరూపముగా గన్పించినను సగటుమీద నాస్తికులయందే శాంత్యాదిగుణములు కన్పించునేమో? కాని యీ నాస్తికులయం దేకదేశమునం దున్న యధర్మము ఘోరముగా నుండును.



# గుజ్జనగూళ్లు చిట్టికథలు

## అక్బరు చక్రవర్తి

పూర్వము అక్బరు అను చక్రవర్తి యుండెను. అతడు చాల తెలివిగలవాడు. అధికమైన సైన్యం సమకూర్చెను. నానా రాజులను జయించెను. విశాల రాజ్యానికి ప్రభువయ్యెను.

అతనికి చదువురాదు. అయినను పుస్తకములను తెప్పించి వాటిని చదివించి వినుచుండెడివాడు. చాల కవులను ఆహ్వానించెను. కొందరిని తన ఆస్థానమున నే నియమించెను. హాస్యగాండ్రను రప్పించెను. సంగీతగాండ్రను కూడ ఆహ్వానించుచుండెను. అతని ఆస్థానమున నున్న హాస్యగాడు మిక్కిలి తెలివిగలిగి యుండెను. అతనిపేరు బీర్బల్. అక్బరును పలుమారు నవ్వించుచుండును. అతనిని చూచిన అక్బరుకు చాల సంతోషమగును.

ఒకనాడు అక్బరు తన ఆస్థానమున సభ జరుప నిశ్చయించెను. అందుకు నానా యుద్యోగస్తులు, మంత్రులు, ప్రభువులు, సంగీతగాండ్రు, కవులు వచ్చియుండిరి. కాని హాస్యగాడు బీర్బల్ మాత్రము రాలేదు. అతని రాకకై అక్బరు వేచియుండెను. కాని ఎంతసేపటికి రాకుండెను. వేచి వేచి అక్బరుకు విసుగుపుట్టెను. తుదకు అతనిని పిలుచుకొని రమ్మని ఒక సేవకుని పంపెను. అతడేగి రాజుగారి యుత్తరువు నెఱింగించెను. బీర్బల్ తడబడ ఆస్థానమునకేగి ద్వారముకడ నిలబడి రాజుగారతని జూచి,

"ఇంతవర కేమి చేయుచుంటివి. వేచివేచి విసుగుచెందితిమి" అని బిగ్గఱగా నరచెను.

"సలాం! మహారాజ్, కోపము చేసుకొనకండి, ఉన్న సంగతిని చెప్పతాను."

"ఏమి సంగతి'' అని రాజడిగెను.

"ఏమీ లేదు. నాకొక బిడ్డ కలడు. నేను బయలుదేరునపుడు నన్ను జూచి ఆ బిడ్డ ఏడ్వసాగెను. ఎంతో ఓదార్చితిని. కాని వినలేదు. అందువలన యింతకాలము పట్టినది. ఆలస్యముగ వచ్చితిని. కనుక క్షమించవలెను" అని బీర్బల్ బదులు చెప్పెను. "ఇది వింత సంగతిగా నున్నది. ఇందరిని నవ్వించువానివి, కోపమణచు శక్తి కలిగియుండికూడ నీ బిడ్డను క్షణములో ఓదార్చలేకపోయితివా? ఇది కాదు; ఏదో కారణముండవలెను. నిజము చెప్పుము'' అని అక్బరు అడుగ "లేదు దేవరా! నిజము చెప్పుతున్నాను" అని బీర్బల్ బదులు చెప్పెను.

"పొప్పులు పెట్టి పోరు మాన్పలేకపోయితివా?"

"అయ్యో! పొప్పులే కాదు; సైకిగా బొట్టుకూడ యిచ్చితిని కాని..."

"ఊ...కానీ...రెండు నయ్యాపు మాటలు చెప్పి శాంతింపజేయకూడదూ."

"కాదు మహారాజ్...ఎంతో ప్రయత్నించితిని. మీరు నాకు యీ నీతులు నేర్పవలెనా?"

"కాదు బీర్బల్! నేను కొన్ని మాటలతో సముదాయించుదునా!"

"అట్లే కానీయండి, నేను బిడ్డగా నటిస్తాను. మీరు తండ్రిగా నటించి నన్ను ఓదార్చండి."

"ఊ...కానీ.....కామ్" అని రాజు చెప్పెను.

బీర్బల్ సభా మధ్యమున కూర్చుండెను. బిడ్డగా నటింప మొదలు పెట్టెను. కన్నీరు నింపెను. ఒక్కపెట్టున 'బోరు'మని యేడ్వసాగెను. అతని రోదనము సభాభవన మంతయు నాక్రమించెను. రాజు తండ్రిగా నటించి అతనిని ఓదార్చ మొదలుపెట్టెను.

"బిడ్డా...చిట్టీ...ఏడ్వకు, ఏడ్వకు."

బీర్బల్ యింకను బిగ్గరగా ఏడ్వసాగెను.

"ఏడువాకు నాయనా! నీకేమి కావాలి? అడిగితే యిస్తా."

కాని బీర్బల్ ఏమి చెప్పక యింకా ఏడ్వసాగెను.

"ఏడువాకురా! ఏడిస్తే వెక్కిరిస్తారు. అడిగింది యిస్తాను" అని అక్బరు చెప్ప

### శ్రీ పి. సుబ్రహ్మణ్యం

"ఊ...ఊ...నాయనా! పిల్లోలంతా చెఱకుతింటూ వుండారు. నాకొక పెద్దచెఱకు కావాలి" అని బీర్బల్ చెప్పెను.

"వ్వా...అంతేనా? అట్లు చెప్పవరి" అని అక్బరు ఒక సేవకునిచేత పెద్ద చెఱకు గడను తెప్పించి యిచ్చెను. కాని బీర్బల్ ఏడ్పు మానకుండెను.

"ఇంకాఎందు కేడుస్తావ్. చెఱకు తెచ్చియిచ్చినానే! ఊరుకో!" అని అక్బరు చెప్పెను. కాని బీర్బల్ మాత్రము తన ఏడుపు మానలేదు. అక్బరు అతని కన్నీరు తుడుస్తూ "ఓరీ! నాయనా! ఏడువాకు!'' అని చేతిగుడ్డతో కన్నీరు తుడిచెను. కాని బీర్బల్ యింకను బిగ్గరగా నేడ్వసాగెను. అక్బరుకు సాధ్యముకాకపోయెను.

"ఏడ్వవద్దురా! యింకేమి కావాలి! చెప్పరా" అని అక్బరు అడుగ

"ఈ చెఱకును ముక్కముక్కలుగా చేసి యివ్వవలెను." అని బీర్బల్ బదులుచెప్పెను. చెఱకు ముక్కముక్కలుగా నఱుకబడెను. అన్నీ బీర్బల్ చేతికిచ్చి

"ఇకనైన మానుకోరా నీ యేడ్పు" అని అక్బరు అడిగెను. ఇంకను బీర్బల్ తనఏడ్పును చాలించలేదు. అక్బరుకు సాధ్యముకాక "అబ్బ! ఏమిరా! యింతగోడు! చెఱకుతెచ్చి యిచ్చితిని. ముక్కముక్కలు చేసియిచ్చితిని. ఇంకను నీ యేడ్పు మానుకోవే" అని అక్బరు అడిగెను. "ఊహు.... నాయనా! ఈ ముక్కలన్నీ కలిపి చెఱకు మొదట ఎట్లుండెనో అట్లు తయారుచేసి యివ్వవలెను" అని బీర్బల్ అడిగెను. అక్బరుకు దిక్కుతోచదాయెను. దిగులుచెందెను. అటు యిటు చూచెను. "బీర్బల్! నీ ఏడ్పుచాలించు. మన పందెములో నీవే గెలిచితివి. నీ మాటలే నిజము. పిల్లవాండ్రపోరు పెద్దది. అసాధ్యమయినది. నా కిపుడు బాగుగా అర్థమయినది. నీ ఆలస్యమునకు మన్నించితిని." అని అక్బరు బీర్బల్‌ను మన్నించి తన ఆస్థానమున నొక ఆసనముపై కూర్చుండ నియమించెను.

దొంగలున్నారు జాగ్రత!

## యూసుఫ్ ఖాన్ ప్రతీకారం

నిర్మలమైన ఆకాశములో చంద్రుడు తన సహజకాంతుల వెదజల్లుచుండెను. అది ఒక రెయ్యారి. ఇసుకతోకూడిన గాలులు తీవ్రముగ వీచుచుండెను. కాటి చెట్ల క్రీనీడలో యూసుఫ్‌గుడిసె, తెల్లగా కాంతివంతముగా ప్రకాశించుచుండెను. పరిసరప్రదేశములన్నియు నిశ్శబ్దముగా నుండెను. యూసుఫ్ తనతల భూమిమీద ఆనిచ్చి, తన కండ్లను చేతులతో కప్పుకొని దుఃఖించుచుండెను. "ఓ దేవుడా! నీవు నా ప్రాణము నెందుకు తీసుకపోలేదు. నే నీబాధనెట్లు భరించగలను" సుకుమారుడు, ఎవని మీదనైతే నా అన్ని ఆశలుండినవో ఆ నా పుత్రుడుపోయి, నే నింకా ఉండ్నా నెందుకు?"

కొంతసేపు నిశ్శబ్దముగానుండి, మరల నొకమాట్లు వినబడింది. "అబ్బా తలచుకుంటే గుండె చెరువై పోతోంది. నాకొడుకెంత చక్కనియువకుడు! పరిగెత్తువారిలో మొదటివాడే? ఓ దేవుడా! నీ వెంత నిర్దయుడవు! వాడు చనిపోగానే నా చేతులు, నాయిల్లు సర్వసము ఖాళీ అయినవే! అంధకారం వ్యాపించిందే!" మరల కొంతసేపు నిశ్శబ్దం. యిప్పుడొక పాదముల ధ్వని యూసుఫ్‌నకు వినబడెను. ఆ వచ్చినవాడు యూసుఫ్ గుడారాన్ని సమీపించెను. వాడు చాల అలసిపోయిన ట్లగుపడుచుండెను. గుడారంవద్దకు రాగానే "నీరు! దాహము!" అని కేక వేసెను.

ఒక్క క్షణములో యూసుఫ్ తన తోలుసంచితో నీటిని తెచ్చి అతనికిచ్చెను. ఈ క్షణకాలము, ఇతరునికి చేసే సేవవల్ల తన దుఃఖమును కొంత మరచిపోయాడు.

మళ్ళి మాలిగేడు యూసుఫ్ "నాకుమారుని వయస్సుకూడా యింతే! అచ్చం ఈలాగే ఉండేవాడు!"

నవ్విన అతిథి అన్నాడు- "ఓ యూసఫ్! ప్రజలకదరు నిన్ను చాలామంచివాడంటారు. నాపై నీ మంచితనము కొంత చూపగలవా?" యూసఫ్ అంగీకరించేడు. భయములో వణుకుచున్న ఆ అతిథినైపు చూచి నీకేమి సహాయము కావలె"నని అడిగినాడు.

"నా ప్రాణము తీయాలని కొందరు ప్రజలు నా వెంటబడినారు. "అల్లా" పేరుతో మీరు నాకు కొంత విశ్రాంతి యివ్వాలి. విశ్రాంతి తీసుకున్న పిదప నేను పారిపోవటానికి కేదో ఒక దారిచూపాలి.

'తప్పకుండా చేస్తానాపని'. అన్నాడు యూసఫ్. అతన్ని లోపలికి తీసుక వెళ్ళినాడు.

యూసఫ్ అన్నాడు- "ఈ గుడారము నాది. దేవునిదికూడా ఎవరైతే ఆపదల్లో

మూలం: **రూత్ ఇ. రాబిన్సన్**

అనువాదం: **శ్రీ ఎస్. వి. హనుమంతరావు**

వుంటారో వారందరికి యిక్కడ రక్షణ దొరుకుతుంది."

ఒక మంచము చూపించి, ఒక దుప్పటి యిచ్చి యూసఫ్ అన్నాడు- "నాయనా! పండుకో! విశ్రాంతి తీసుకో! తెల్లవారక ముందే నిన్ను లేపుతాను!"

వందనాలు తెల్పుతూ ఆ అతిథి పడుకొనినాడు. కాని వెంటనే ఆ తడొక మాటచే మేల్కొనినాడు: యూసఫ్ ఏడుస్తున్నాడు- "అయ్యో! దేవుడా! ఆ ఇబ్రహీం అనేవాడు నాకొడుకుని చంపేడట! వాడిని నరకానికిపం పెయ్యి దేవుడా? నాకుమారుని, అంతమంచివాడిని చంపటానికి చేతులెట్లా వచ్చెనో! నేనా ఇబ్రహీంను యెట్లు కన్గొనగలను? వాడు నాకు కనిపించేడా, వాడినిపాడిచి త్రొక్కి ముక్కముక్కలుగా చేసేయనూ?"

చాలకాలమువరకు ఆ అతిథి యూసఫ్ యొక్క ఈతిట్లూ, శాపనార్థాలూ వింటూ వుండినాడు: కొంతసేపటికి యూసఫ్ వచ్చి అతనిభుజముతట్టి అన్నాడు. "లే! నీవు వెళ్ళిపోవటానికి సమయమిదే!"

వెంటనే ఆతడు లేచి యూసఫ్‌ను వెంబడించేడు. తెల్లవారటానికి యింకా రెండు మూడుగంటలుంటుంది.

ఇదిగో, నావద్దనుండే గుర్రాల్లో కన్నిటికి ఈగుర్రం వేగంగా పోగలదు. ఆ సంచుల్లో నీకాహార పానీయాలు, బంగారమూ వున్నాయి నీ కవసరమైనప్పుడు తప్పకుండా వాడుకో" అన్నాడు యూసఫ్.

"మీరు ఈ సహాయం అంతా, నాకు, ఒక అతిథికి చేస్తున్నారు!" ఆశ్చర్యపోతూ అడిగేడు అతిథి.

"అవును నాకు నీ ఈడువాడే ఒకకుమారుడు వుండేవాడు. నీకు సేవచేస్తూ వానికి సేవచేస్తున్నాననే ఆనందాన్ని పొందగల్గుతున్నాను." జవాబిచ్చేడు యూసఫ్.

అతిథిఅన్నాడు- "కాని మీ ఆదరణకు నేను తగకపోతే! నేనొక నేరముచేసి యుంటేనో?

యూసఫ్ అన్నాడు- "భగవంతుడు మనలను లక్షసార్లు క్షమిస్తుంటే, మన సోదరుని మనం ఒక్కసారి క్షమింపలేమా? నేను నిన్ను క్షమిస్తాను."

ఆ అతిథి అన్నాడు:- "అయ్యా? నే నిప్పుడు తమకొక బాధాకర విషయాన్ని చెప్పబోతున్నా. అయ్యో! కాని ఎట్లు చెప్పగలను?" అతని కండ్లనుండి కన్నీరు ఒకే ప్రవాహంగా కారుతున్నయ్.

యూసఫ్ "నీకేమీ భయంలేద"ని అభయమిచ్చినతర్వాత ఆ అతిథిఅన్నాడు- అయ్యా! మీ కుమారుని చంపినవాని నేనే! నేనే యిబ్రహీంను నన్ను, ఒక పాపిని, దుండగుడిని మీరు క్షమిస్తారా?"

యూసఫ్ క్షణకాలం ఆలోచించి అన్నాడు- "నాయనా! అవును, నిన్ను నేను క్షమిస్తాను. నేను క్షమించుతాను అనటంకంటె భగవంతుడు నిన్ను క్షమిస్తాడనటం బాగుందేమో? వెళ్ళునాయనా, శాంతంతో వెళ్ళు. భగవంతుడు నీకు మేలు చేస్తాడు.

అతిథి యేడుపుతూ, యూసఫ్ ఓదార్చాడు. అతనిని పంపేటప్పుడు, అతనిని ఆశీర్వదించాడు. అతనికి (యూసఫ్) కు ప్రతీకారవాంఛ లేదిప్పుడు. దూరాన చంద్రుడుకూడ అతనిని చూచి సంతోషించినట్లుండెను.

బాలకవి చాటర్‌టన్. 16 సంవత్సరాల చిటుతప్రాయం తీరకముందే మహత్తరమైన కవితాశక్తిని ప్రదర్శించిన ప్రతిభాశాలి. బ్రిస్టల్ నివాసి. పెరమెచ్చు లుపచరించటం మినహా ఇంగ్లండు దేశం ఈ కవి కుమారుని పోషించుకోలేకపోయింది. దారిద్ర్యాన్ని భరించలేక 17 వ యేటనే ఆత్మహత్య చేసుకున్నాడు. ఆయన రచనలను మాత్రం ఇంగ్లండు ఇక్కడ ప్రపంచానికి చూపి గర్వపడుతూ వుంటుంది.

# సోవియట్ రష్యా నిజస్వరూపం

రచన: ఫ్రైడా ఊట్లే

## 7

## విచ్ఛిన్న విభ్రాంతి

[ఫ్రైడా ఊట్లే సతి రచించిన "విచ్ఛిన్న విభ్రాంతి" యను గ్రంథమునందలి యీ ఏడవ అధ్యాయ సంగ్రహమునందు సోవియట్ రష్యా దక్షిణప్రాంతములో సంభవించిన కాటకమునుగూర్చియు, కమ్యూనిస్టుపార్టీలోని ఉన్నతవర్గము వారు అనుభవించుచుండిన భోగ విలాసములను ఆమె వర్ణించినది. ఎటువంటి అల్పసంఖ్యాకవర్గమైనను నిరంకుశాధికారం చలాయించేయెడల భ్రష్టమై పోగలదని యీ కమ్యూనిస్టుపార్టీ సాగించుచున్న ప్రజాపీడన ఘాతుకపద్ధతిని స్వానుభవ సిద్ధముగా గ్రహించి ఆమె సిద్ధాంతీకరించుచున్నది.]

"లాంకషైర్ - దూర ప్రాచ్యము" అను పేరుతో నేను రచించిన గ్రంథమును ప్రచురించుటకు వలయు ఏర్పాటులను చేయు నిమిత్తమై నేను ఇంగ్లండుకువెళ్లి అచట మూడుమాసములుండి తిరిగి 1931 సెప్టెంబరులో మాస్కో నగరమునకు వచ్చినప్పుడు, నా భర్త చాలా బక్కచిక్కి తెల్లబారియున్నాడు. చాలా సన్నగిల్లి నిస్సత్తువగానున్నాడు. అతనను చూస్తేనే నాకు భయమైంది. ఆయన ఉద్యోగ కార్యభారంతోనే క్రుంగి కృశించి ఆత్మహత్య చేసుకొనుచున్నాడన్నట్లుగా కన్పించింది.

గత సంవత్సరం శీతాకాలములో మాస్కో నగరమందున్నటువంటి ఆహార వస్తువుల దుస్థితికంటె ఈ రెండవసంవత్సర శీతకాలములో మరింత అధ్వాన్నముగా నున్నది. ఇప్పటికి నా భర్తకు "గోర్గ (బి)" తరగతి రేషనుకార్డు లభ్యమైనది. మాస్కోలో పనిచేయుచుండెడి విదేశీయ ప్రవీణులకు కమ్యూనిస్టులకు ప్రత్యేకంగా యివ్వబడునట్టి "ఇన్నిసాబు" రేషనుకార్డు నాకు లభ్యమైనది. దీని అర్థమేమనగా, తిండితరులు చాలామందికంటె మా పరిస్థితి చాలా బాగున్నది. మా పరిచితులు చాలా మంది ఆకలితో అవస్థపడుచున్నారు. నా రేషను సప్లయిలోనుంచి ఒక పౌను ఆహారధాన్యం యిస్తే వారు ఎంతో కృతజ్ఞత నాయెడల చూపించుచున్నారు.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ప్రచార సంస్థలలో నా ఉద్యోగం విరమించితిని. ఫాక్టరీ సరకులను ఎగుమతిచేయునట్టి సంస్థలో అనగా ప్రాన్ ఎక్స్‌పోర్టులో నేను నేతసరకుల స్వరపారవేత్తగా పని చేయుచున్నాను. నా ఉద్యోగ ధర్మరీత్యా నేతమిల్లులున్న ప్రాంతాలకు నేను వెళ్లినప్పుడు అచటి కార్మికుల విషాదకర స్థితిని చూడగల్గితిని. కాని, యీ కార్మిక వర్గమే రష్యాప్రభుత్వచక్రమును త్రిప్పుచున్నదని చాటించుచున్నారు.

నా భర్తయగు ఆర్కేడిగారు ఉద్యోగాధికారరీత్యా 1932 సం॥ ఏప్రిలు మాసంలో ఒకసారి ఒడెస్సాకు వెళ్ళియుండినప్పుడు అచటి జనుల స్థితిగతులను చూస్తే ఆయనకు గుండె నీరైపోయింది. చాలా విషాదభరితుడై తిరిగి వచ్చెను. ఆ దక్షిణ రష్యాప్రాంతంలో తిండిలేక వీధులలో చచ్చిపడియున్న జనుల శవములను ఆయన కండ్లార చూచెను.

అప్పుడు ఇంగ్లండునుండి నా అమ్మ కూడా రష్యకు వచ్చింది. ఆమెను కూడా వెంటబెట్టుకొని వేసంగి సెలవు దినములలో క్రిమియాకు వెళ్లియుంటిమి. ఈ దీర్ఘప్రయాణమునకు కావలసిన ఆహార సామగ్రులను అన్నింటిని వెంటకొనికొని మేము మాస్కోనగరమునుండి బయలుదేరితిమి. కాని మేము ప్రయాణం సాగించిన మొదటి రోజుననే మార్గమధ్యంలోని రైల్వేస్టేషనులందు తిండిలేక నకనకలాడుచున్న అన్నార్తులకు నా అమ్మ వెంట తెచ్చిన ఆహారవస్తువులను దానముచేసెను.

అన్నపూర్ణా రామచంద్రా యని కన్నీరు కార్చుచు ఆ నిరుపేద బిచ్చగాండ్లను ఆమె నాకు చూపించి, జాలిపడెను. ముఖ్యంగా పాపపుణ్యము లెరుగని పసి పాపల దురవస్థ మరింత హృదయ విదారకముగా నుండెను. అప్పుడు మేము చేసిన ఆ ప్రయాణము దుఃఖకరమై దుస్సహమయ్యెను. ఆ దృశ్యములు నా కిప్పటికిని మరపునకు రావు. ఆ గోయుకు దారిద్ర్య మహాసముద్రముగా నుండెను. ఆ మహాసముద్రములో మేము అర్పించిన నాలుగు కబళములు ఏమూలకైనను చాలవు. రష్యను భాషలో ఆకేద రత్తును బిచ్చగాండ్లు "టోట్టా! దాయి - క్లేబ్! టోట్టా దాయి క్లేబ్!" అనగా, "అమ్మా రొట్టె దయచేయి" అని అరచేవారు. వారి ఆర్తనాదము ఆ సోషలిస్టురష్యా యొక్క జాతీయ గీతముగా సదా నాకర్ణపుటములందు ప్రతిధ్వనించుచునే యున్నది.

పరస్పర తారతమ్యములను చూచినప్పుడే హృదయం దహించుకొని పోవుచుండును. రైలుబండిలోని భోజనశాల పెట్టెయందు దట్టముగ బలిసినరష్యను అధికారులు పుష్టిగా భోజనంచేస్తూ ఉండేవారు. సమృద్ధిగా తిని నిర్లక్ష్యంగా తిరుగుచుండెడి రష్యన "జీపూ" పోలీసుభటులు ఒకవైపునను తిండిలేక మాడుచున్న జనులు మరొకవైపునను కన్పించుచుండిరి. వారు పరిపాలించే అధికారులు, మేము పాలితులమైన ప్రజలం- వారు పీడించేవారు- మేము పీడితులము.

క్రిమియాలోని సత్రములలో మాకు బస దొరికింది. అక్కడ ఆహారపదార్థముల లోపంకూడా మాకులేదు. మరరొట్టెలు, పండ్లు, మంచుముక్కలు, అప్పములు బహుపుష్కలంగా వడ్డించేవారు. మేము తినగామిగిలినది అవతలపార వేసేవారు. క్రిమియాలోని సోవియటు రిపబ్లికు తాలూకు కేంద్ర కమిటీకి చెందినటువంటి విశ్రాంతి భవనమిది. బెర్కెంగోఫ్‌గారి దయవల్ల మేము యీ విశ్రాంతి భవనంలో బసగల్గితిమి. ఆయన మాకు లండనులో పరిచితుడు. ఆయన ప్రముఖుడైన బోల్షెవిక్కు. ఆతడు రష్యాలోని యీ ప్రాంతపు నివాసియే.

ఆ విశ్రాంతిభవనం చాలా గొప్పవారైయున కమ్యూనిస్టుల ఉపయోగార్థం ఉద్దేశింపబడినది. నిజానికి, మేము అందులో దిగుటకు తగిన పలుకుబడిగలవాళ్లం కాము. కాని మేము అందులో దిగుటవల్ల కమ్యూనిస్టుపార్టీలోని గొప్పవాళ్ల పద్ధతులు ఎట్లా ఉన్నవో చూచుటకు మాత్రము మాకు అవకాశముకలిగినది. పూర్వపు రష్యను జమీందారులయొక్క విలాసమందిరములివి పేద జనులగోల చెవిని బడకుండా, వారు కంటబడకుండా పూర్వము యీ మందిరములకు ఎటువంటి ఆవరణాలు ఉండేవో ఇప్పుడుకూడా అటువంటి ఆవరణాలుకలవు, ఆనాటి శ్రీమంతులుపోయి, క్రొత్తసామంతులు వెలసినారు. అప్పటికీ, ఇప్పటికీ, అంతకంటె వ్యత్యాసంలేదు.

సోవియటు రష్యాలోని జీవితము చాలా కంటకంగా, విషాదకరంగా, ఘోరంగా, దుస్సహంగా ఉండవచ్చును. కాని మరొకవిధంగా కలుగజాలని రాజకీయ వ్యవహారానుభవజ్ఞానం మాకు కలిగింది. మాకు యీ జ్ఞానబోధ ఎంత కఠోరముగా నుండినప్పటికిన్ని మైకేలున్న, నేనున్న, సేరున్న దీని ప్రయోజనమును గ్రహింపగల్గితిమి. దొంగ పేరులతో వర్తించుచున్న నిజతత్వములను గ్రహింపగల్గితిమి. రాజకీయ ఇంద్రజాలములను మాయ మర్మం లేకుండా చూడగల్గితిమి. ధర్మసూత్రములను మోసపోకూడదనియు, అరచేతి వైకుంఠములను చూపించెడివారి మాటలను, కపట నాటకములు నాడెడివారి పటాటోపములను చూచి మోసపోరాదనియు గ్రహించితిమి.

పాత సాంఘిక వ్యవస్థను నిర్మూలించవలెనని మనము ప్రయత్నించునప్పుడు, మన సహజ మానవ సౌజన్యమునే మనము నిర్మూలించుకొనేయెడల మనము నిర్మించెడి నూతన సాంఘికవ్యవస్థ ధర్మబద్ధముగాను, దయాదాక్షిణ్య భరితంగాను ఎట్లుండగలదు? చాలా కఠోరమైన అనుభవజ్ఞానం పెక్కు సంవత్సరములు నాకు కలిగిన అనంతరము బెర్ట్రాండు రస్సెలుగారి సాంఘిక తత్వశాస్త్రము నాకు నచ్చినది.

ఏ అల్పసంఖ్యాకవర్గమునకైనను నిరంకుశమైన అధికారం చేతికివచ్చినప్పుడు అట్టి అధికారంవల్ల ఆ అల్పసంఖ్యాకవర్గము భ్రష్టము కాగలదు. కిరాతకులు చేసెడి ఘోరాపచారములకంటె వీరాపేక్షపరులైన దేశభక్తులు ఎక్కువ ఘోరాపచారములను చేయుదురు. వారు తమలక్ష్యము సాధించుటయే ప్రధానంగా భావించి ఏ నీచమైన మార్గోపాయము ద్వారా అవలంబిస్తారు. అటువంటివారి వ్యవహారదక్షత ఫలిత పర్యవసానము లెట్లుండునో ఎవ్వరూ నిశ్చయంగా చెప్పజాలరు. సర్వస్వతంత్రుడైన నిరంకుశ ప్రభువు ఎంత ధర్మబుద్ధిగలవాడైనప్పటికీ, అతనివల్ల ప్రజలకు కలిగేది మేలుకంటె, ప్రజాస్వామ్య ప్రభుత్వ విధానము ఎంతలోపభూయిష్టమైనను ప్రజలకెక్కువ మేలు చేకూర్చగలదనే విషయము ఆరేండ్లు సోవియటు రష్యాలో ఉండి నేను గ్రహించగల్గితిని.

హెన్రీ వాలెస్‌వంటి ఉదారాశయులు రష్యాలోని ఆర్థిక ప్రజాస్వామ్య ప్రాశస్త్యమునుగూర్చి తరచు ప్రస్తావించుచుందురు. ఇటువంటివారందరు పశ్చిమ రాజ్యాలలో ఉదారవాదులని చెప్పబడుచున్నారు.

కాని, రష్యాలోని కమ్యూనిస్టు పార్టీ సాగించెడి భీకర ప్రజాపీడనమును, అచటి రహస్య పోలీసు గూఢచారులవలని భయమును స్వయంగాచూచి అనుభవిస్తేగాని సోవియటు రష్యానుగూర్చిన దుర్భ్రమ తొలగిపోదు ఎందుచేత?

సర్వసమమైన కమ్యూనిజం పరీక్షార్థమైనను సాధ్యపడదనే గ్రహింపు మనకు కలుగదు. ఎందుచేత? విద్యాధికులైనవారికి మేధావంతులైనవారికి యీ రష్యనుగూఢచారుల మూలంగా ప్రాప్తించెడు దుస్థితి కొల్పుతే, సామాన్య జనానికి ప్రాప్తించెడి నిర్బంధ ప్రవాసము, ఇంకో మార్గం లేదు. తప్పించుకొనుటకు తరణోపాయం లేదు.

ఏకపార్టీ అధికారం గల రాజ్యాలలో పరిపాలనాధికారమున్నూ ఆర్థికాధికారమున్నూ ఒక్క అధికారవర్గమునకే సంక్రమించుచున్నది. ఇట్టి సంక్రమణ చాలా హెచ్చుస్థాయిలోనికి వచ్చుటమూలంగా మానవకోటి జరూరుగా ఆలోచించి పరిష్కరించవలసిన క్రొత్త సమస్య ఏర్పడుచున్నది. సాంఘిక అయుక్తతను వ్యక్తిస్వాతంత్ర్యమును కాంతిని కాపాడు నిమిత్తము క్రొత్త ధర్మసూత్రములను నీతి నియమములను కాపాడవలసివచ్చుచున్నది. భౌతికశాస్త్రజ్ఞానము శాస్త్రప్రావీణ్యము వల్ల అనేక నూతనశక్తులు ఉత్పత్తి యగుచున్నవి. వీని నన్నింటిని సక్రమంగా వినియోగించవలసియున్నది.

కమ్యూనిస్టు పార్టీ యొక్క క్రూరత్వమును, రష్యను విప్లవముయొక్క వికృత పరిణామమును ప్రత్యక్షంగా చూచి అసహ్యించుకొని, స్టాలిను ప్రారంభించిన యీ "సోషలిజం" పద్ధతికి బదులుగా సుసాధ్యమైన మరొక మంచిపద్ధతి కలదా యని ఆర్కేడిగారు యోచింపసాగిరి. ఘోరమైన ప్రమాదములు లోపములు యీ ప్రభుత్వపద్ధతిలో సంభవించినవని ఆయన అంగీకరించెను. కాని, వాటిని సంస్కరించుటకు వీలుకలదా అని ఆయన శంకించెను.

రష్యను ప్రజలు ధైర్యం గోల్పోయి నిరాశచెందియున్నారు. వారికి అసహ్యం పుట్టింది. ధర్మమనేది ప్రపంచములో ఉన్నదా అని శంకించిరి. ఈ అరాజక సంక్షోభస్థితిలో ఏదోవిధంగా కాలము గడుపుటకు సందె రాయిచేసికొనిరి. ఈ నూతనరాజ్యంలో "అయ్యో పాపం" అంటే అపరాధంగా వుంది. బ్రతుక నేర్చినవారు మాయవేషధారిగా కపటనాటకం ఆడసాగెను.

బ్రతికే ఉపాయం ఏదిరా అనే ఆలోచన సర్వత్ర ప్రజానీకం ప్రాకులాడుచుండెను. అధికారపదవులు, అయిశ్వర్యం గడించే మార్గమేదిరా అని కమ్యూనిస్టు పార్టీలోని అన్నివర్గాలు ఆవేదనపడుచున్నారు.

సోవియటురష్యాలో విద్యావిధానం ఎట్లున్నదని కొందరు నన్ను అడుగుచుందురు. రష్యాలోని పిల్లల అభివృద్ధికొరకైనను చాలా కృషి చేయబడలేదా అని ప్రశ్నించుచుందురు. ఓడ్లెంకా అనే ఊరిలో మేము మకాముచేసిన భవనపు అంతస్తులో ఒక అటకమీద పరుండిన నిరాశ్రయులైన కొందరు పిల్లలు మేము తిన్నరొట్టె పెచ్చులు త్రాగుటకు వేడినీళ్లు కావలెనని మమ్ము యాచించేవారు. ఇవనోవ్ వొసెస్నెస్కవద్ద బట్టమిల్లులలో పనిచేసే కార్మికుల పిల్లలు, ఆ కార్మికుల బారకేసులలో పరుండుటకు వసతైనను లేక కటిక నేలను ప్రక్కపరచి పరుండుటచే నెరుంగుదును.

రష్యాలోని పిల్లలకు కష్టాలకోర్చుకొనుట అభ్యాసమైనది. కష్టములకే చేదు విషం చక్కగా మింగుతారు. ఒకొక్కప్పుడు కొందరు పిల్లల తాలూకు తల్లిదండ్రులను అధికార్లు అరెస్టు చేస్తారు. తల్లియును తండ్రియును అరెస్టయినపిదప వారికి ఆహారమును తీసికొనివెళ్లుటకై ఇంట్లోవున్న సామగ్రుల నన్నింటిని పిల్లలు అమ్మివేస్తూ వుంటారు. ఈ పిల్లలకు ఆదరించెడి దగ్గరిబంధువు ఎవ్వరూ లేనియెడలను, తల్లిగాని తండ్రిగాని తిరిగి యింటికి రానియెడలను, ఆ పిల్లలు నిరాశ్రయులైన యితర పిల్లల మూకలతో చేరి ముష్టి ఎత్తడం నేర్చుకుంటారు. లేదా దొంగతనాలు చేస్తారు. ఈసోవియటురష్యా అనే ఘోరాటవిలో అడవిజంతువులవలె తిరుగుతూ ఉంటారు. కమ్యూనిస్టు రష్యాలో పిల్లలకు వర్తించుచున్న విద్యావిధానములలో ఇది ఒకటి.

నిరాధారులైన పిల్లలలో కొందరు యీడువచ్చి పెరిగిన పెద్ద పిల్లలను దూరపు మారుమూల యనేది స్టాలిను ఏలుబడిలో జరుగుచున్న మహాక్రూర కార్యం. పన్నెండు సంవత్సరములుగాని అంతకు పైబడినగాని వయస్సుగల పిల్లలు ఎవరైనను దొంగతనములు చేస్తే మరణదండన విధింపబడునని 1935 లో ఒక వుత్తరువు జారీచేయబడెను. ఈ వుత్తరువును అమలు జరుపుట మూలంగా దౌర్భాగ్యులకు దీనుల బిడ్డలను, రష్యాకు అనవసరమైనవారిని హరించివేయవలసినదిగా పోలీసులకు అధికారమివ్వబడెను.

రష్యాలోని ప్రముఖ కమ్యూనిస్టుపార్టీకి చెందిన ఒక ప్రసిద్ధుని కుమారుడుగాని, కుమార్తెగాని అయినయెడల, ధనికవర్గదేశాలలోని శ్రీమంతుల బిడ్డలకు ఉండే సౌకర్యములు సౌఖ్యములు రష్యాలో లభించగలవు.

సర్వజన సమాన కాలమనెడిమాట ఈ సోవియటురష్యాలో కట్టిమిథ్య. కమ్యూనిస్టుపార్టీలోని ఉన్నతవర్గాలవారి పిల్లలకు ఉండే పాఠశాలలు ఒకమాదిరిగా నుండును, ప్రజాసామాన్యపుపిల్లల పాఠశాలలు మరొకరీతిగా నున్నవి. కొన్నివర్గములవారి పిల్లలు సౌఖ్యభోగములతో పెరుగుతూ ఉండేటప్పుడును, మరికొందరిబిడ్డలు కడుపునిండ తిండిలేక, పందులవలె మురికి కొంపలలో పెరుగుచుండినప్పుడును విద్యావిషయికసౌకర్యములందును సమానావకాశము లుండుట అసంభవము.

# హైదరాబాదు లెవీ సంస్కరణలు

ఇప్పటికి దాదాపు 7, 8 సంవత్సరముల నుండి హైదరాబాద్ సంస్థానములో లెవీ అను పేరతో నిర్బంధ ధాన్యసేకరణ చేయబడుచున్నది. దీని ముఖ్యోద్దేశ్యము పండింపు రయితువద్దనుంచి ధాన్యమునసూలు చేసి లేనిప్రాంతములలో లేనివారికి సప్లయిచేయుట యైనప్పటికి క్రమంగా లెవీ స్కీము యొక్క పరిచేయుటవల్లనూ, కలవారినుంచి ధాన్యము నిర్బంధముగా వసూలుచేయుటయే కాని లేనివారికి ధాన్యము సక్రమంగా సప్లయి చేయకపోవుటవల్లనూ ప్రభుత్వోద్యోగుల అక్రమచర్యలవల్లనూ ముఖ్యముగా సంస్థానములో తిప్ప యూనియనులోని పరిసర ప్రాంతములలో యీ పద్ధతి లేకపోవుటవల్లనూ, యిచ్చటి రయితులకు లెవీ అను పదము సంపూర్ణముగా అసహ్యము కలిగించినది. ప్రభుత్వము యిప్పటివరకు యీ లెవీ విధానములో యెన్నిమార్పులు చేసినను అది రయితులను సంతృప్తిపరచజాలకపోయెను. యీ సంవత్సరము ఒక క్రొత్త లెవీ విధానము అమలులోనికి రానున్నది. యీ విధానములో రయితుకు పండు పంటను అంచనావేసి లెవీ నిర్ణయింపబడినది. తరీ పొలమునకు యం. 1 కి పదిమణుగులు బియ్యమును, మెరక యం. 1 కి నాలుగు మణుగులు జొన్నలు పండునని ప్రభుత్వముచే అంచనావేయబడినది. ప్రభుత్వం తలచినట్లు బహుచిన్న రయితులకు అనగా 27½ మణుగులున్నర ధాన్యము పండునని అంచనా వేయబడిన పొలము మాత్రమే కలిగియున్న రయితులకు తప్ప మామూలీగా మధ్యరకపు రయితుకు యీ విధానం యెంతమాత్రం లాభదాయకముగా లేదు. మన సంస్థానములో రయితులకు తగినంత యెరువుల సరఫరాలేదు. పసుసంపదకూడా చాలినంతలేదు. యీ కారణముల వల్ల రయితులు తమపొలమును పూర్తిగా సారవంతముచేసి సంపూర్ణమయిన పంటను పండించలేకపోతున్నారు.

ప్రభుత్వము అంచనావేసినట్లు యకరము లేక రెండు యకరములు తరిగాని పదిపదిహేను యకరములవరకు మెరకగాని కలిగియున్న రయితుమాత్రమే తరి యం. 1 కి పదిమణుగుల బియ్యము మెరక అయినచో నాల్గుమణుగుల జొన్నలు పండించ గలుగుచున్నాడు. బహుశా యిటువంటి చిన్నరయితులు అంచనాకంటె యింకా యెక్కువగాకూడా పండించ కలుగుతారేమో కాని మధ్యరకము రయితు అనగా 40, 50 యకరములు మెరకగల రయితు యీ అంచనాప్రకారం ధాన్యం పండించజాలడు. క్రొత్త లెవీ విధానములో దీనిని యెక్కువగా పరిశీలించినట్లు కానరాదు. యెటువంటి పొలమయినను మెరక యం. 1 కి నాలుగు మణుగుల జొన్నలు తప్పక పండునని అంచనా వేయబడినది. పంటలు పండుట పొలముల సారవంతమునుబట్టి వుండును. ప్రభుత్వపు అంచనాకన్నా యెక్కువగా కూడా పండే పొలములు లేకపోలేదు. గాని నేడు పొలములు తగినంత సారవంతంగా లేనందువల్ల 50% పొలములు అంచనాకన్నా తక్కువగానే పండుచున్నవి. ఒకరయితుకు సంపూర్ణం

బసవరాజు మధుసూదనరావు

గా నాలుగు మణుగుల అంచనాకన్నా యెక్కువగా పండే పొలములూ- మరొక రయితుకు అంచనాకన్నా తక్కువపండే పొలములూ (గర్వ చవుడు వగైరా) వుండుటకద్దు. అలాంటప్పుడు ప్రతిపొలము మీద సమిష్టిగా సమాన అంచనా వేయుట రయితులకు ప్రభుత్వమునకూ కూడా నష్టదాయకం కాగలదు. యిటువంటి పొలములకు మాఫీ దరఖాస్తులు యిచ్చుకొనుటకు క్రొత్త లెవీ విధానములో వీలుకలిగించబడలేదు. అదిగాక రయితుకుగల మొత్తం పొలములోనుంచి 1353 ఫసలీకి పూర్వము నుంచి బీడులుగాయున్న పొలములు ఫలవృక్షముల తోటలు, వాగులు వగయిరాల వల్ల సాగుకు అనుపయోగమయిన భూమిని మినహాయించి మిగతా భూమిలో సగములో పండించినను పండించకపోయినను సేద్యముచేసినను చేయకపోయినను ఆహార ధాన్యములు పండించినట్లు భావించి అంచనావేసి లెవీ తీసుకొనుటకు నిర్ణయించబడినది, రయితు లెవీ తప్పించుకొనుటకై తనపొలమును యెన్నడూ సాగుచేయకుండా వుండడు. కాని అతివృష్టి అనావృష్టి కారణములవల్లనూ విత్తనములు లేక నష్టటికి పయిరు మొలవని కారణము వల్లనూ, ప్రతిసంవత్సరము సేద్యము చేయబడు పొలము ఒక్కొకప్పుడు పడావాగా వుండిపోవలసివచ్చును. క్రొత్త లెవీ విధానములో యీ ప్రకారం పడావాగా యుండు పొలములకు మినహాయింపు యివ్వక వాటినికూడా లెవీ పరిమితిలో చేర్చబడినది.

తరీ పొలముల విషయములో అంచనా కొంతవరకు బాగానేయున్నది. కాని ఖర్చుల క్రింద పగిపోవు ధాన్యం మినహాయించినట్లులేదు. తరి పొలము యం. 1 కి 80 సేర్లవరకు యిత్తనములు నాటుకూలి 80 సేర్లు కోతకూలి 80 సేర్లు కల్లుతీత 30 సేర్లు మొత్తం 220 సేర్లు అనగా అంచనా 146 సేర్ల బియ్యం కూలీలక్రింద ఖర్చు అగును. అంచనా పంటలోనుంచి సేద్యపు ఖర్చులు టేబుల్ ప్రకారం లెవీ తీసివేసిన మిగతాధాన్యము కుటుంబఖర్చులకు సరిపోజాలదు.

అన్నిటికన్నా మించియీ లెవీ విధానములో మనిషి 1 కి నాలుగున్నర మణుగుల ధాన్యముమాత్రమే మినహాయించుట రయితులోకంలో తీవ్ర అలజడిని కలుగచేయుచున్నది. యీ ధాన్యం బస్తీలలో సుఖజీవనం గడిపేవారికి సరిపోవునేమో కాని పగలంతయు చెమటోడ్చి కష్టించు రయితు కూలీలకు యెంతమాత్రము సరిపోజాలదు. వ్యవసాయంచేయు ఒక రయితుకు సంవత్సరమునకు కనీసం 8 మణుగుల ధాన్యం కావలసి యుండును.

వీటన్నిటి దృష్ట్యా క్రొత్త లెవీ విధానములో యీ దిగువమార్పులు చేయుట అత్యవసరము. గనుక ప్రభుత్వము దీనిని పునః పరిశీలించి రయితులకు సౌకర్యము కలుగ చేయవలయును.

1. ప్రతిసంవత్సరము, పూర్తిగా సాగు చేయబడిన భూమిలోమాత్రమే సగం లెవీ పరిమితిలో చేర్చవలయును.

2. అంచనా పంటకన్న యేకారణముల వల్లనైన తక్కువ పండు పొలములకు సత్వరిగతంగా మాఫీ దరఖాస్తులు యిచ్చుకొనుటకు వీలుకలిగించి అట్టి పొలములను ప్రభుత్వోద్యోగులు స్వయముగా పరిశీలించి పంటను నిర్ణయంచేయవలెను.

3. పరిపాలనకు యమునకు కనీసం 8 మణుగుల ధాన్యం (బియ్యం) అంచనా పంటనుంచి ఖర్చులక్రింద మినహాయించి మిగిలిన ధాన్యం వీలయినమాత్రమే టేబుల్ ప్రకారం వెల తీసుకొనవలయును.

4. వ్యవసాయంచేయు రైతు కూలీలకు మనిషి 1-కి కనీసం 8 మణుగుల ధాన్యం ఆహారముక్రింద ప్రత్యేకించవలయును.

5. అంచనాకన్నా అధికంగా పండి కుటుంబ ఖర్చులకు సేద్య ఖర్చులకు పోను లెవీ యిచ్చినప్పటికీ రయితువద్ద మిగిలిన ధాన్యమును (యిది ప్రతివెల రయితు యిచ్చు స్టాకు తక్తాను బట్టి తెలియుచుండును) బ్లాకు మార్కెటుకు పోనివ్వక ప్రభుత్వమే స్వయముగా ఖరీదుచేయవలయును.

6. ప్రస్తుతమున్న లెవీ ఖరీదును పెంచవలయును.

# ఓటమిలో గెలుపు!

మూలం : సుదర్శన్
అనువాదం : ఆనందమూర్తి

భారతీప్రియుడు తన గుఱ్ఱాన్ని ప్రాణతుల్యంగా చూసుకొంటున్నాడు. అశ్వశాలముందు నిలబడి తదేకదృష్టితో చూస్తూ ఏదో చెప్పలేని ఆశ్చర్యానందం అనుభవిస్తున్నాడు. కడుపార కలిగిన కన్నబిడ్డను చూస్తున్న తల్లిచూపులు—స్వహస్తాలతో నాటి పెంచిన సస్యమూతను తిలకిస్తున్న రైతు సోదరుని దృష్టులు—భారతీప్రియునిది. ఆ అశ్వమే తన ప్రాణమంతా, చూచినకొద్దీ తనివి తీరడంలేదు. క్షణక్షణానికి అతనికేవో క్రొత్త రుచులు గోచరిస్తున్నవి. అమితానందంతో దాని వంకే చూస్తున్నాడు. కొంతసేపటికి చూపు జడమైంది. చెమ్మగిలిన కళ్లతో చూస్తూ ఆప్యాయంగా అశ్వాన్ని చేతితో నిమిరాడు. తోకఝాడిస్తూ ఆడిస్తూ సకిలించింది సుల్తాన్.

మసక చీకట్లు యింకా మాసిపోలేదు. యథావిధిగా భారతీప్రియుడు నదీతీరానికి బయలుదేరి వెళ్లిపోయాడు. చూపులందేవరకు సుల్తాను భారతినే చూస్తూ నిలబడింది. సూర్యోదయమైంది. తడిగుడ్డలతో గృహోన్ముఖుడైనాడు. పర్ణశాలలోకి అడుగు వేయబోతూ ఒకసారి అశ్వశాలవైపు చూచాడు. గుఱ్ఱం సమాధానం చెప్పింది. భారతీప్రియుడు 'సుల్తాన్' అని నిట్టూరుస్తూ ప్రార్థనాలయంలోకి ప్రవేశించాడు.

భారతీప్రియుడు సన్యాసి. అతని ఆస్తి అంతా ఒక గుఱ్ఱమే. అదే అతనికి సర్వస్వము. దానిని విడనాడి ఒకక్షణమును మనలేడు. తన స్వహస్తాలతోనే దానికి సకల పరిచర్య సలిపేవాడు. అశ్వశాలలో కూర్చొని దానికి ఆహారం అందిచ్చేవాడు. భజనమందిరాన్నైనా మఱచిపోతాడేమో కాని అశ్వశాలనిమాత్రం మఱచిపోలేడు.

సాయంత్రంపూట కొద్దిసేపు సుల్తానుమీద సవారి చేస్తాడేగాని భారతికి తిన్న అన్నము జీర్ణము కాదు. సుల్తాను ఉత్తమజాతి గుఱ్ఱం! పరిసర ప్రాంతాలలో సుల్తాను ఖ్యాతి ప్రాకిపోయింది. భారతికి సుల్తానుకి అద్వైత్వం ఆపాదించేవారు అక్కడివారు. భారతిలేక సుల్తానుగాని—సుల్తానులేక భారతిగాని ఎన్నడూ అక్కడి ప్రజలకు కనపడలేదు. సుల్తాను కీర్తిప్రతిష్ఠలు వాడవాడలా వ్యాపిస్తున్నవి.

ఖడ్గసింహుడు అక్కడి పట్టణంలో ఒక పెద్దదొంగ. ఊరివారందరికి అతడు దొక్కలో బల్లెము. పేరువింటే గడగడలాడేవారు. సుల్తాను పేరుప్రతిష్ఠలు ఖడ్గసింహుని చెవులలోనూ మారుమ్రోగినవి. అతని మనస్సు ఆకర్షింపబడింది. ఆ గుఱ్ఱాన్ని సంపాదించాలి. సుల్తాను రాజతీవిగల జంతువు. మదమైనది. తన కది అన్నివిధాలా ఉపయోగపడుతుంది.

ఒకనాడు ఖడ్గసింహుడు భారతీప్రియుని పర్ణశాలకు పయనమైనాడు. భారతి పరామర్శించాడు "ఏం—నాయనా—ఏమిటి విశేషాలు?"

'దర్శనార్థం'—అన్నాడు ఖడ్గసింహుడు

"అశ్వదర్శనార్థమా?"

'మీ సుల్తాను పేరు ప్రతిష్ఠలు ఊరూర పాకిపోతున్నది'

'నెమ్మదిగా అంటావేం బాబూ—సుల్తానులాంటిది లోకంలోనే లేదు. చూస్తే నీకే తెలుస్తుంది.'

'నేనూ విన్నాను. చాలా అందమైనదని చురుకైనదని.'

'నా ప్రాణానికి ప్రాణము. చక్కని రూపం. నా సుల్తాను కనం తొక్కుతూ నడుస్తుంటే అందరూ మంత్రముగ్ధులౌతారు. దాని వంకే చూస్తారు. గంభీరమైన ఆకృతికలది సుల్తాన్.'

ముందుగాలేచి అశ్వశాలవైపు నడక సాగించాడు భారతి. ఖడ్గసింహుడు వెంట నడిచాడు. సుల్తాన్—అని పిలిచాడు భారతి. తలత్రిప్పి సకిలించింది గుఱ్ఱం—గంభీరమైన ఆకృతి. అది సన్యాసుల దగ్గఱ ఉండతగనిది దానికి ఖడ్గసింహుడే అర్హుడు!

'భారతీప్రియా—సుల్తాన్ని నాకిస్తారా?'

'స్త్రీనాయనా—నా ఒంటిలో ప్రాణం ఉండేవరకు నేను ఎవ్వరికీ ఇవ్వను, అదే నాసర్వస్వము.' ఖడ్గసింహుడు కన్ను చిట్లించుకొన్నాడు. పోతూపోతూ 'భారతీ...గుఱ్ఱం ఒక నాటికైనా నా దగ్గఱ ఉంటుంది' అన్నాడు. భారతీప్రియుడు నివ్వెఱబోయాడు. ఖడ్గసింహుడు వెళ్ళిపోయాడు.

* * *

భారతీప్రియుడూ ఒక మానవుడే, సుల్తానుగూర్చి వినడానికిగాని, మాట్లాడడానికిగాని ఉబ్బితబ్బిబ్బయి పోయేవాడు. నలుగురూ దాన్ని మెచ్చి గొప్పగా చెప్తూ ఉంటూంటేవిని ఎంతో పొంగిపోయేవాడు. మాటకీమాటకీ మధ్య సుల్తాను పేరు అతని నోటిలో తిరుగుతూ ఉండేది. భారతీప్రియుడు పిచ్చివాడు—అతనికి గుఱ్ఱపు పిచ్చిబాగా పట్టింది. అన్నది లోకం!

* * *

ఖడ్గసింహుడు వెళ్లిపోయాడు. భారతీప్రియుడు వణికిపోయాడు. తనకిక ఎడబాటు కలుగుతుందా? నిద్రాహారాలు మానుకొని అశ్వశాల ముందుకూచునేవాడు. భజనమందిరంలోకివెళ్లడం మానేశాడు. రాత్రిళ్లు అశ్వశాలముందే కాపలా కాసేవాడు. చప్పుడైనపుడల్లా 'సుల్తాన్'ని కేకవేసేవాడు. అది జవాబుచెబుతూ ఉండేది. కొద్ది రాత్రులు గడచినయి. మాసాలు గడచినయి. కాని ఖడ్గసింహుడు ఏవడూ రాలేదు. భారతికి కొంత ఉచ్ఛ్వాసం లభించింది. ఇక ఖడ్గసింహుడు రాడు. ఆ గుఱ్ఱం తనను విడిపోదు. కొంత వెలపు తగ్గింది. కొద్దిరోజులలో మళ్లా మామూలుస్థితికి వచ్చాడు భారతి. సుల్తానుమీద సవారిచేస్తూ ఊరిబయటకెళ్లేడు. మార్గంలో ఒక పిలుపు వినబడ్డది. కంగారుతో వెనుదిరిగి చూచాడు. చెట్టుక్రింద ఎవరో ఒక ముసలి చేయెత్తి పిలుపుసంజ్ఞ చేయ్యడం కనబడింది. అప్పటికి సూర్యాస్తమయమైంది. భారతి గుఱ్ఱాన్ని చెట్టుకిందికి తోలుకెళ్లాడు. దుప్పటి కప్పుకొని ఒక ముదుసలి. 'బాబూ! ముసలివాణ్ణి. చీకటి పడింది. కళ్లుకనబడవు. ప్రక్కఊరిలో చంద్రపాలుగారింటికి వెళ్లాలి. పుణ్యాత్ములు. దయచేసి నన్నక్కడికి తీసికెళ్లండి బాబూ.' భారతి హృదయం కరిగిపోయింది. పాపం ముదుసలి, దారితప్పిపోయాడు. చీకటి పడింది. తాను గనుక వాని మొఱ ఆలకింపకపోతే అతనికిక దారిచేరడానికి మార్గాంతరంలేదు. జాలిపడ్డాడు. 'నాయనా—భయపడకు. నేను తీసికెళ్లి దిగబెడతాను.' అని గుఱ్ఱం దిగాడు. దుప్పటి కప్పుకొని వణుకుతున్న ముసలికి కొంత ఊతయిచ్చి గుఱ్ఱం మీదకెక్కించాడు. తాను వెంట కళ్లెంపట్టుకొని నడిపిస్తున్నాడు. నాలుగడుగులు సాగినవి. భారతీప్రియుని చేతిలోని కళ్లెం ఒక్కమారు గభీమని లాగివేయబడింది. విస్తుపోయి కన్నెత్తిచూచాడు. గుఱ్ఱం కనుచూపు మేరలో కనబడింది. ఆ గుఱ్ఱంమీద ఎవరో వికృతంగా నవ్వుతున్నారు. భారతి గుండెలు జారినవి. ఏమీ తోచలేదు. 'ఖడ్గసింహా' అని ఒక వెఱ్ఱికేక వేశాడు.

'పిచ్చివాడా—నీకీ గుఱ్ఱం యికరాదు' అని సమాధానం వచ్చింది. భారతికి కాళ్లు తడబడ్డవి. గొంతుకలోంచి ఏవో మాటలు రాబోయి ఆగినవి.

"నాయనా...ఒక్కమాట" కొంత తొందరపడి అరిచాడు. ఖడ్గసింహుడు బలశాలి. ఆరితేరిన గజదొంగ. గుఱ్ఱాన్ని నడిపించుకొని భారతిని చేరవచ్చేడు.

'నాయనా—ఈ గుఱ్ఱం నీదే...కాని'

"................"

"ఒక్కమాట వాగ్దానం చెయ్యి. ఈ సాయంత్రం జరిగిన సంగతిమాత్రం ఎవరితోనూ చెప్పకద్దు. వాగ్దానం చెయ్యి"

ఖడ్గసింహుడికీమాటలు అర్థంకాలేదు. పిచ్చివాడు ఈ అవమానం జరిగినందుకు లోకానికి జడుస్తున్నాడు అనుకొన్నాడు. అయినా ఏమో!

'ఎందుకూ?' అని ప్రశ్నించాడు. భారతిని అర్థంకాని చూపులుచూస్తూ.

"ఈ సంఘటన లోకానికి వెల్లడయితే ఇకమీదట పేదవారిమాటలు ఎవరూ నమ్మరు నాయనా...వారికోసమని నిన్ను ప్రార్థిస్తున్నాను. ఎవరితోనూ చెప్పవద్దు." ఈ మాటలు భారతినోటినుండివచ్చినయి. ఇక మాటాడలేదు. వెనక్కు తిరిగేడు. నడక సాగినాంది. ఖడ్గసింహుడు నిశ్చేష్టుడై ఆలోచిస్తున్నాడు. వెళ్ళిపోయే లోగా భారతిని నిశితంగా పరిశీలించాడు. ఆనాటివాడు కాడు. అతనిలో విచారంకోన బడలేదు. కళ్ళల్లో కమ్మినవీరు యిగిరిపోయింది. నిర్వికారంగా కనబడ్డాడు. భారతి ప్రవర్తన చిత్రంగా తారాస్థరయింది. అక్కడే ఆలోచిస్తున్నాడు ఖడ్గసింహుడు!

బాగా చీకటిపడింది. అర్ధరాత్రిఅయింది నక్షత్రాలు ఆకాశమంతా మిణుకుమిణుకుమంటూ వెలుగుతీగలను వెదజల్లుతున్నది. భూప్రదేశమంతా అంధకార బంధురంగా ఉన్నది. చప్పుడు చెయ్యకుండా కళ్లెం చేత్తో పట్టుకొని తోలుకొచ్చాడు. అంతా నిరామయంగాఉన్నది. అశ్వశాలవైపు చూచాడు. ఎవ్వరూలేరు. ఖడ్గసింహుని హృదయం ఓక్కుమన్నది. అదేచోట కొద్దిరోజుల క్రితంవఱకు భారతి అటూ యిటూ తిరుగుతూ ఉండేవాడు. చప్పుడైనపుడల్లా కేకలు వేస్తుండేవాడు. ఇప్పుడంతా నిశ్శబ్దంగా ఉన్నది. అశ్వశాల దగ్గఱకెళ్ళేడు. ప్రశాంతంగా ఉంది. విషాగంతో ప్రియుల రాకను ఎదురుచూస్తూ కనురెప్పలను విప్పుకొని చూస్తున్నది అశ్వశాల. రెండుతలుపులూ బార్లగా తెరిచి ఉన్నయి. గుఱ్ఱాన్ని లోపలికి తీసికెళ్ళేడు. యథాస్థానంలో కట్టేశాడు. గుఱ్ఱం గట్టిగా సకిలించింది. ఖడ్గసింహుని హృదయం కంపించిపోయింది. నిశ్శబ్దం భగ్నమైంది. కాని సుల్తాను పిలుపుకి సమాధానం ఏమీ రాలేదు. ఖడ్గసింహుడు నొచ్చుకొన్నాడు. కన్నీరు కార్చాడు. తడబడుతున్న అడుగులతో తిరిగి వెళ్లిపోయాడు. గుఱ్ఱం మళ్ళా సకిలించింది. అశ్వఘోష అలలు అలలుగా వ్యాపించినది. శబ్దతరంగాలు ఆ ప్రశాంత గంభీర నిబిడాంధకారంలోకి చించుకొని ప్రపంచించుకొని సాగిపోసాగినవి. ప్రార్థనాలయప్రాంగణాన స్వప్నావస్థలో పడున్న భారతీప్రియుని చెవుల తాకినవి. 'సుల్తాన్'—అని బిగ్గకేక వేసి మేలుకొన్నాడు. చెవులొగ్గి విన్నాడు. సుల్తాను కేక మరలవినబడలేదు. భారతి వాస్తవిక ప్రపంచంలోకివచ్చాడు. ఇక ఎక్కడి సుల్తాన్? తనకు వినబడినది స్వప్న పేనులలోని సుల్తానుకేక! నిబ్బరించుకొని కనులు మూయజూచినాడు. కాని కూడబడలేదు. నక్షత్రగణాలు నడకసాగిస్తున్నవి. అంబరముఖపు తూర్పుటంచువెలవెల బోతోంది!

భారతీప్రియుడు లేచాడు. యథావిధిగా ఏటి స్నానానికి వెళ్లబోయాడు. గుఱ్ఱం సకిలింపు వినబడ్డది. పాదాలు అశ్వశాల వైపుకు కదలినవి. రెండడుగు లేసి వెనక్కుతిరిగాడు. భారతి—ఇక సుల్తాను సంభావణ దుర్లభము. అదిలేని అశ్వశాలలో అడుగు పెట్టను! భారతివెళ్లిపోయాడు.

స్నానానంతరం ప్రార్థనాలయంలోకి అడుగు పెడుతూ అలవాటుచొప్పున 'సుల్తాన్'ని కేక వేశాడు. గుఱ్ఱం సకిలించింది. ఆగి విన్నాడు. అది సుల్తాను గొంతే. స్పష్టంగా దానిదే! అశ్వశాలవైపు పరుగెత్తాడు. తోక ఝుళిపిస్తూ ఆడిస్తూ సుల్తాను తిరిగి సకిలించింది. 'సుల్తాన్' అన్నాడు బిగ్గరగా!

పశ్చాత్తాపము—ఖడ్గసింహుడు కార్చిన కన్నీటిని భారతీప్రియుని బాష్పాలు పవిత్రీకరించినవి!!

కార్మికుల కనీస వేతనాల శాసనంమీద చేవ్రాలు చేస్తున్న అమెరికా అధ్యక్షుడు ట్రూమన్

# ఆంధ్రోద్యమ మూలపురుషులు

ఆంధ్రోద్యమ మూలపురుషు లెవరు? అసలు, ఈ ఆంధ్రోద్యమం ఎవరి? దీని భావం ఏమిటి? తత్వం ఏమిటి?

ఉద్యమం అంటే ఏదో చైతన్యంస్ఫురిస్తుంది. దానికోగుణం వుంది. అది నడిచే గుణం. ముందుకిపోయే గుణం. ఉద్యమం అనేది ఏ బండరాయి కాదు. స్థిరాస్తి కాదు. నిజానికి స్థిరంగా వుండేది ఆస్తి కాదు. అవసరానికిరాని ఆసవాళ్ళనగల లాగ అది మెరిసే ఆస్తిమాత్రమే. చరిస్తేనే గాని మూల్యానికి విలువ లేదు. నాలుగు చేతులు మారితేగాని ధనం వృద్ధికాదు. ధనాభివృద్ధికి ధనప్రచారం అవసరం. అల్లాగే ఉద్యమానికి ముఖ్య లక్షణాలు చలనం, ప్రచారమూను. ఈలక్షణాలు కలిగిన ఆంధ్రోద్యమం ఏమిటి? ఆంధ్ర శబ్దం దేన్ని స్ఫురిస్తుంది? దేన్ని సూచిస్తుంది. ఆంధ్రం అనాదిగా భాషాసూచకమైంది. ఈ శబ్దోత్పత్తి వృత్తాంతం ఇదమిద్ధమనినిర్ణయించినవారు లేరు. ఉత్పత్త్యర్థం ఏమైనా పరిపాటిగా ప్రచారంలో వున్న అర్థం భాషాపరంగా వ్యవహరించ బడుతోంది. న్యాయశాస్త్రంలో శాస్త్రంకంటె అనాది వ్యవహారానికేఎక్కువ పోడా. క్రమేణా భాషనిబట్టి దేశపర్యంగాకూడా ఈశబ్దం వ్యవహారంలోకి వచ్చింది. ఇప్పుడు పాకిస్థానం అంటే మతం అనే ఆధారంమీద ఏర్పడిన స్వతంత్రరాజ్యం. అది పాకిస్థాన్ తత్వం. ఇండియా అని ఇంగ్లీషులోనూ, భారతదేశం అని దేశభాషలలోనూ వ్యవహరించే మన దేశం, జాతి, మత, సామంత, కులేత్యాది వ్యత్యాసాలులేకుండా "లోకాస్సమస్తా స్సుఖినోభవంతు", అనే అర్థ సూక్తి ఆధారం చేసుకొని నిర్మాణం చేశామని ప్రారంభించిన (శాస్త్రరీత్యా) స్వతంత్ర రాజ్యం. ఇది ఇండియా తత్వం. అల్లాగే రష్యా తత్వం. అమెరికా తత్వం ఉన్నాయి. రెండూ రెండు ప్రత్యేక మానవ జీవితోద్యమాలు.

ఇటువంటి లక్షణాలు కలిగిన ఆంధ్రోద్యమం ఏమన్నా వున్నదా? ఉండడానికి ఏమున్నదా? ఇతర భారతీయులికీ ఆంధ్రులికీ విభేదాలువున్నాయా? రాజకీయంగా, ఆర్థికంగా, వైజ్ఞానికంగా, ఆంధ్రుల విశిష్టత అనేది ఏమైనా వున్నదా? వుంటే అది ఉద్యమరూపంగా చైతన్యం కలిగి ప్రచారంలో వున్నదా? ఉంటే ఆచైతన్య భావాలు ప్రచారంచేసి, కొన్ని ఫలాలైనా సాధించినవారు ఆంధ్రోద్యమ మూలపురుషులు.

రాజకీయంగా, జాతీయదృష్టిలో ఆంధ్రులికీ ఇతర ప్రాంతాల వారికీ ప్రత్యేక సమస్యలు ఏమీ లేవు. భారత దేశానికి లేనట్టుగానే మనకీ శత్రువులు లేరు. యుద్ధాలు లేవు. భారతదేశం యుద్ధంలో మునిగితే మనమూ మునుగుతాం. దేశంలో వున్న ఇతర ప్రాంతాలతో యుద్ధం చేశామనే వుద్దేశం, పూర్వకాలం సంగతి అల్లా వుంచి, ప్రస్తుతం ఎవరికీ వున్నట్టు లేదు. అందుచేత, దేశసంరక్షణ విషయంలో భారతదేశం సమస్యే మన సమస్య. మనకి ప్రత్యేక ఉద్యమం లేదు. తద్వారణంగా, పాకిస్థాన్ తత్వంలో ఇంతవరకు మనకి స్వాతంత్ర్యేచ్ఛ లేదు. ఉండబోదు.

ఆర్థికంగా మనకి ఏమైనా ప్రత్యేకత వున్నదా? ఉన్నదంటాను. అనేటప్పుడు నా మనోదృష్టిలో సంపూర్ణాంధ్ర స్వరూపమే గోచరిస్తోంది. ఈ సంపూర్ణాంధ్ర ఆర్థిక ప్రత్యేకత ఏమిటి? అంగట్లో అన్నీ వుండగా అల్లుడి నోట్లోశని.

అమ్మాయికి లోపించిన అయిదోతనం! ఇందాకా చెప్పినట్టు ఆంధ్ర దేశానికి స్థిరాస్థి చాలా వుంది. తృణ, జల, కాష్ట సమృద్ధి వున్నది. నదులన్నీ ఆంధ్రులవి. ప్రాజెక్టులన్నీ ఆంధ్రేతరులవి. సముద్ర తీరం చాలా ఆంధ్రులది. రేవులన్నీ ఆంధ్రేతరులవి. ఖనిజ సంపద ఎంతవుందో మనకి తెలియదు. దక్షిణాఫ్రికా వజ్రగనులు రాక పూర్వం, ప్రపంచానికి వస్త్రాల

## కపిల కాశీపతి

సంత ఆంధ్ర భూమి. లోహసంపద యూరేనియంలో సహా (సంపూర్ణాంధ్రంలో) వున్నది. బంగారం వున్నది. అయితే ఇదంతా ఈ నాడు స్థిరాస్థి మాత్రం. ఆంధ్రులు బీదవారు. ముష్టివారు కారు, కాని, బీదవారు. ఈ బీదతనం ఆర్థిక, వైజ్ఞానిక, ఆధ్యాత్మిక, రూపాలలో పోగొట్టి సర్వ సంపదలు, సర్వ జనానికీ అంద జెయ్యడమే స్వతంత్ర భారత ప్రభుత్వ మహదాశయం. ఈ సంపద మనకి ఇంతవరకు అంటక పోవడమే మన ఆర్థిక ప్రత్యేకత. స్వాతంత్ర్య భారత దేశపు సిరి మనకబ్బలేదు. చిదుగు అంటుకుంది.

న్యాయానికి "లోకాస్సమస్తాస్సుఖినోభవంతు" అనే భారత దేశానికి స్వాతంత్ర్యం ఎందుకు? అన్న మోరామచంద్రా, అలోలక్ష్మీ నా అని అరాలనోపాలం అల్లాడిపోకుండా ఉండడానికి గోజుకి మూడుణాలు. మన దేశంలో ఒకవ్యక్తిసగటు ఆదాయం. ఇరవైమూడు సంవత్సరాలు సగటు ఆయుస్సు. ఇంతహీనస్థితి ఏ దేశంలోనూ లేదు. పరాయివారు పరిపాలనచేస్తే తమ శారోగ్యం, తమసౌభాగ్యమేగాని, మన సంగతిచూడరు. అందుకుగాను పౌర తంత్ర్యంకూడదు. అపారతంత్ర్యం ఈ నాడుపోయింది. మనదేశసంపద అభివృద్ధి చేసుకుని, వికసింపోగొట్టే అవకాశం కలిగింది. అందరికీ, తినడానికింత, కట్టుకోడానికి వస్త్రం, ఉండడానికి ఇల్లు, ఆరోగ్యరక్షణకి, విజ్ఞానాభివృద్ధికీ, తద్వారా ఆధ్యాత్మికాభివృద్ధికిఅవకాశాలు కలిగాయి.

ప్రపంచ జనాభాలో అయిదోవంతు భారతదేశప్రజనం. అందులో పదోవంతు మనం. ఈ దేశంలో పదోవంతైన ఆంధ్రులికి, స్వరాజ్యప్రాప్తివల్ల కలిగేలాభాలన్నీ కలుగుతున్నాయా? కలిగే అవకాశాలు వున్నాయా? కావిడిబరువు మోసేవాడికి తెలుస్తుంది. ప్రస్తుతంలేవనీ, ఇదేపరిస్థితులు వుంటే లభించే అవకాశాలుకూడా లేవనీ పెద్దల అభిప్రాయం. స్వరాజ్యం అంటే ఏమిటి? నాకు సర్వసౌఖ్యాలూఉండాలి. నేనూ అనే ఆత్మాభిమానం నాకుకలగాలి. అప్పుడు ఇతరులసంగతి చూడడానికినాకు అవకాశంవుంటుంది. నాకడుపుకాల్తోంటే ఇతరులికి పెట్టమనడం గ్రంథసహర్త మేగాని, ప్రత్యక్ష జీవితధర్మంకాదు. బాధ్యతలేగాని, హక్కులులేని స్వరాజ్యం నాకు అక్కర్లేదు. అందుచేత, భారత దేశానికి ఏవిధంగా స్వరాజ్యంఅవసరమో కొన్ని మార్పులతో, భారతదేశంలో, భాగమైననాకూ స్వరాజ్యం అవసరం. ఒక బండికికట్టిన రెండుఎద్దులు సమానబలంగా ఉండి, సమంగాలాగితే, బండినడుస్తుంది. ఒకటి ఏటికీ మరోటి కోటికీలాగితే బోల్తాపడుతుంది. భారతదేశం అనేరథానికి అంగాలైన ప్రాంతాలు అన్నీ సమంగా అభివృద్ధిపొందితేగాని స్వరాజ్యం సార్థకం కాదు. ఒక కుటుంబంలో వ్యాధిగ్రస్తుడు వుంటే, కుటుంబానికంతకీ వ్యాకులత వుంటుంది. లేకపోతే అది కుటుంబంకాదు. అల్లానే దేశంలో ఒక భాగంలో దుర్భిక్షంవుంటే, దేశానికి పుంసవం దుర్లభం. "కృషితోనాస్తి దుర్భిక్షం" అన్నారు. ఈ కృషికి అవకాశం కల్పించడమే స్వరాజ్యప్రాప్తి పర్యవసానం.

ఈ కృషి ప్రారంభించి ఫలాలు పొందడం ఎల్లాగ? దేశంలో వున్న భూమిలో కొంత మెరక, కొంతపల్లం, అందులో కొంత గరపనేల, కొంతచవిటిపర్రవుంటే, ప్రత్యేక భాగాలకి ప్రత్యేక పద్ధతులలో వ్యవసాయంచేసి, ప్రత్యేక పైరులు పెంచాలి. "దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్!" అని ఘోషించాడు గురజాడవారు. మానవ సమస్య మానవ సంప్రదాయంలో పరిష్కారం చేయ్యాలి. మానవుడికీ తక్కిన పశువులికీ వ్యత్యాసం ఏమిటీ అంటే, ఆలోచించే మేనస్సు అంటున్నారు పెద్దలు. ఈ మేధస్సే సమస్యలకి కారణం, యీ మేనస్సే సమస్యలకి పరిష్కారమార్గం కూడా ను. బుద్ధితో ఆలోచించి మనుష్యుడు వివిధ ప్రాంతాలలో వివిధమైన విజ్ఞాన ధనం పోగుచేసి పెంచుతున్నాడు. సమస్యలు సగటున ఒకటైనా సంస్కృతులు చాలా వరకు వేరు. ఈ సంస్కృతులికి ముఖ్య లక్షణం భాషా ప్రత్యేకత. ఈ భాషతోనే మానవుడు ముందుకిగాని వెనక్కిగాని పోతున్నాడు. వైజ్ఞానికంగా ఆంధ్రుల ప్రత్యేకత ఈ భాషే. అందుకనేవారికా పేరు. దీన్ని బట్టే ఒక ప్రత్యేక సంస్కృతి అనాదిగా దక్షిణ దేశంలో వృద్ధిపొంది, ఖండఖండాంతరాలు వ్యాపించి, శాశ్వతికంగా ఇప్పుడగప్పిన నిప్పులావుంది. స్వరాజ్యం ఎందుకూ అంటే, నా భాషలో నావ్యవహారం నడుపుకోడానికి. నా దేశంలో, నా వూళ్ళో నా వ్యవహారం పరాయిభాషలో జరుపుకోవలసిన ఆగత్యం కలిగితే, అటువంటి స్వరాజ్యంతో నాకు ప్రమేయంలేదు. రాజ్యం అనేది, సరిహద్దు లల్లావుంచి, పరిపాలనాపరంగా, వ్యవహారమే. ఈ పరిపాలన నా భాషలో జరిగితే అది నాకు నిజమైన స్వాతంత్ర్యం. అటువంటి పరిపాలనవుంటే నా కృషికి, నా పాడుకి మీర్లు యెక్కువ. అందుకని నా భాషాప్రాంతం అంతా ఒక చట్టంలో పరిపాలించాలి. అదే ఆ నిర్ణయమే ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణం. ఇదే ఆధునికాంధ్రోద్యమ పరమలక్ష్యం. కాని ఇది పాకిస్థాన్ తత్వం వంటిదికాదు. ఏకు మండువాల ఇంట్లో వుండే సంయుక్త కుటుంబంలో దంపతుల ప్రత్యేక గదుల వంటిది.

ఏతావతా తేలిందేమంటే, ఆంధ్రోద్యమం అనేది ఆర్థికంగా ప్రారంభమై, వైజ్ఞానికంగాపరిష్కారమై, రాజకీయంగా పరిణమించి ఫలోన్ముఖం కాబోతుంది.

ఈ మహా మహాయజ్ఞంలో ఈ ఉద్యమ మూలపురుషుల్ని స్మరించడం భావ్యం. విజ్ఞానానికీ, తన్మూలమైన ఉద్యమానికీ ముఖ్య ఆధారంశబ్దం. ధ్వని సృష్టికేమూలం. మన ఉద్యమానికి ఆధారమైన శబ్దం "ఆంధ్ర" మంత్రశాస్త్ర ప్రకారం శుభ శబ్దం కాదనేవారున్నారు. ఏమైనా, ఈ శబ్దప్రచారం ఆంధ్రోద్యమానికి పట్టుగొమ్మ. ఉత్పత్త్యర్థం నిర్ణయంకాని ఈ శబ్దం ఎవరు సృష్టించారో తెలియదుగాని, ప్రచారం చేసినవారు ఒకరు మనదేశభాషలో విజ్ఞాన ప్రచారంకోసం పత్రికస్థాపించి దానికి "ఆంధ్ర"నామకరణం చేసిన శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు. వారి జీవిత చరిత్ర లోకవిదితం. వారి పత్రికా ప్రభావం లోకవిదితం. ఆంధ్రోద్యమ చరిత్రగాని, పంతులుగారి జీవితచరిత్రగాని నేను వ్రాయదలచుకోలేదు. ఈ శబ్దప్రచారం చేసిన మహానుభావులు వారని సూచిస్తున్నాను. ఉద్యమానికి ప్రచారం ప్రాణమని మనవి చేశాను.

కొమ్మలు కొట్టేస్తే చెట్టు బతుకుతుంది వేళ్ళన్నీ తవ్వేసినా బతుకుతుంది. తల్లివేరు తవ్వేస్తే చస్తుంది. ఆంధ్రోద్యమానికి ఆతల్లి వేరు ఆంధ్రపత్రిక అని నా మనవి. దాన్నే సంస్కృతంలో "మూలం" అన్నారు. అటువంటి పురుషుల్ని మూలపురుషులన్నారు. ఆంధ్రోద్యమానికి పంతులుగారొకరు మూలపురుషులు ఆంధ్రపత్రికతోసహ ఆంధ్రోద్యమ చరిత్ర ఎవరన్నా వ్రాయగలరా?

అయితే విత్తనం లేకుండా, మొక్కా, మొక్కలేందే వేళ్ళు, తల్లి వేరూ, వృక్షం వుండదు కనక విత్తనం వేసినవారు గణనీయులుకారా అంటారు. ఆ ప్రశ్న చమత్కారంగా తప్పుకోగలరు,

నేను వ్రాసేదిమూలపురుషుల సంగతిగాని, "విత్తనపురుషుల" సంగతికాదు. అసలు ఆమాటకొస్తే ఈ రాష్ట్రోద్యమ విత్తనం వంగదేశంలో పాతేసిపోయినవాడు కర్జను ప్రభువు. చలరేగినవారు వంగదేశీయులు, లాభం పొందినవారు బీహారువారు. వారిని అనుసరించినవారు ఆంధ్రులు. ఆ అనుసరణఫలితమే 1910లో గుంటూరు యువజన సంఘంవారి తీర్మానం. 1911 లో నిడదవోలు సభలో అలజడి. 1913 లో ఆంధ్ర మహాసభ సంస్థాపనారు. ఆ సభకి అధ్యక్షతవహించిన బయ్యా నరసింహేశ్వర శర్మగారు, ఆహ్వానసంఘాధ్యక్షులు దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు తీర్మానం ప్రతిపాదించిన ముట్నూరి ఆదినారాయణయ్యగారూ మొదలైనవారి పరిశ్రమ కర్జనుప్రభువు విత్తనంవల్లనే. నలభై సంవత్సరాలుగా ఈ సభ నిర్వహించిన వారూ అధ్యక్షులూ, కార్యనిర్వాహకులూ అందరూ మూలపురుషులే.

ఆంధ్రశబ్దానికి అన్నివిధాలా అలంకారాలుచేసి, రామతారక మంత్రంలా ప్రచారంచేసిన మహా కవులు మరోవిధమైన మూలపురుషులు. శబ్దానికి అర్థం కల్పించి రాగంతో మేళవించి రసవంతంగా రచనచేసి వాఙ్మయం సృష్టించినవారు మహా కవులు. భావం ప్రచారం చెయ్యడానికి వాఙ్మయం ముఖ్యసాధనం. అందులో రసరాగయుక్తమైన కవిత మరీను. అటువంటి ఆంధ్ర కవిత్వానికి వరవడి పెట్టినవారు ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు. 1912 లో నెల్లూరు సభ మొదలు మొదట ఈ నాటికీ ఆంధ్రుల కీర్తి పాడి, చరిత్ర త్రవ్వపోసి, "చావలేదు, చావలేదు ఆంధ్రుల మహోజ్వల శక్తి" అనే ఆశాసందేశం ప్రచారం చేసిన ఆధునికాంధ్ర కవిరాజు సుబ్బారావుగారు. తర్వాత ఆంధ్రత్వం ఇలాపెంచిన మహాకవులు వారి అనుచరులే అనాలి. ఈ ఉద్యమానికి కవితా ప్రచారంచేసి ప్రాణం తెచ్చి పోషించినరాయప్రోలువారుఆంధ్రోద్యమ మూలపురుషులలో, ఒకరు.

మూలపురుషులంటే ఎవరో చెబుతో, ఉద్యమ ప్రచారంచేసి, కొన్ని అయినా లాభాలు సాధించిన వారని మనవి చేశాను. కృషి వేరు, ఫలం వేరు. రాతిమీది వ్యవసాయానికి ధనంతేకమూలేదు. అది కృషికాదు. నలభై సంవత్సరాలుగా అయువు పట్టులో కీలకంగా వుండి, తనతత్వం ప్రజకి అపార్థమైనా, తన ప్రయత్నం విడిచి, చచ్చిపోయిందనుకున్న ఉద్యమానికి జయపురంలో సింహ ప్రతిపాలన ప్రయోగం చేసి, ఊయలు తిరగ రాయించి, తన జీవితంలో ఉచ్చదశలోనే, తన మాతృదేశానికి ఉచ్చస్థితికోసం, రాత్రిం బగళ్లు కత్తిమీద సాముచేసి తనజీవితాశయం, తనవారి జీవితాశయం ఇచ్చించగలిగిన ఏకైక రాజకీయ వేత్త రాష్ట్రపతి పట్టాభి, మరో మూల పురుషుడు.

దేశోద్ధారకుడు, కవిభూషణుడు, రాష్ట్రపతి, వీరుముగ్గురున్నూ ఆంధ్రోద్యమ మూలపురుషులు.

